అపరాధ పరిశోధన అనుబంధం—98

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎనిమిది కుర్చీలు
రచన : వసుంధర

## నాలుగో చక్రం
రచన : సికిందర్

## విగ్రహం ఇచ్చిన క్లూ
రచన : ఎమ్.వి.వి. సత్యనారాయణ

## సీతాకళ్యాణం
రచన : టెంపోరావ్

రక్తం త్రాగే పిశాచం-ఎనిమిదవ భా ౯౦

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—98**
ఫిబ్రవరి, 1982
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**ఏ. వీ. మోహన్రావ్**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ఎనిమిది కుర్చీలు

## వసుంధర

అక్కడ మొత్తం ఎనిమిది కుర్చీలలో ఎనమండుగు రున్నారు.

ప్రముఖ సినిమా నటుడు వీరేశం, క్రికెట్ ఆటగాడు రమేష్, పారిశ్రామికవేత్త హరగోపాల్, న్యాయవాది చంద్రశేఖరం, రాజకీయ నాయకుడు గోవిందయ్య, కాలేజీ ప్రిన్సిపాల్ నరహరి, డాక్టర్ మోహనరావు, రచయిత శ్రీనివాసరావు వున్నారక్కడ.

వీళ్ళు ఎనమండుగురూ సమ వయస్కులు. చిన్ననాటి స్నేహితులు. అంతా నలభైలోపు వయసువాళ్ళు. తమ తమ రంగాల్లో బాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించు కున్నవారు.

పార్టీ గోవిందయ్య ఏర్పాటు చేశాడు. రానున్న బై ఎలక్షన్‌లో ఆయనకు అధికార పార్టీ టికెట్ లభించింది.

పార్టీ ఖరీదుగానే వుంది. విందులో మందు కూడా వుంది.

"మనది అరుదైన స్నేహం—చిన్నతనంనుంచీ కూడా సంతోష సమయాల్లో ఇలా కలుసుకుంటూనే వున్నాం" అన్నాడు కోన్యాక్ చప్పరిస్తూ శ్రీనివాసరావు.

"ఇలాగే యింకా యింకా కలుసుకుంటాం—" అంటూ చంద్రశేఖరం టేబిల్ మీద చార్మినార్ పెట్టి తీశాడు.

ఆ పార్టీలో అదొక్కటే చవకైనది. అందుకు కారణం వుంది. చిన్నతనంలో మొదటిసారిగా ఈ ఎన మండుగురూ దగ్గరగా వచ్చినపుడు కాల్చినవి చార్మినార్ సిగరెట్లు. ఆ తర్వాతనుంచి ప్రత్యేకమైన వేడుక సమయాల్లో కలుసుకున్నప్పుడు చార్మినార్ తాగడం సంప్రదాయంగా మారింది.

ఎనమండుగురూ కూడా ఒకప్పుడు సాధారణ మధ్య తరగతి కుటుంబాలకు చెందినవారే! ఆ స్థాయినుంచి ఈ స్థాయికి ఎదగడానికి వాళ్ళు చేసిన కృషిలో నేరాలు, ఘోరాలు కూడా వున్నాయి. అలాంటివాట్లలో ఒకో సారి పరస్పర సహాయం చేసుకోనడం కూడా జరిగింది.

చంద్రశేఖరం సిగరెట్ తీసి వెలిగించి పక్కవాడికి తోశాడు. ఒక్కొక్కటే సిగరెట్ వెలిగించుకున్నారు.

"పార్టీలో ఇదేగా ఆఖరి అయిటం—" అన్నాడు గోవిందయ్య.

"మనకు పెళ్ళిళ్ళు కావడమేకాక — మన పిల్లలు పెళ్ళీడుకొస్తున్నారు. ఆఖరి అయిటం ఇంకా ఏదో వుంటుందని ఎలాగనుకుంటాంలే—" అన్నాడు వారగోపాల్.

"ఆఖరి అయిటం అనగానే మళ్ళీ ఎప్పుడో ఇలా కలుసుకోవడం అనిపిస్తోంది—" అన్నాడు మోహనరావు.

"అవకాశముంటే వీరేశానికో, రమేష్‌కో, చంద్రశేఖరానికో వుంది. ఇంకెవ్వరికీ లేదు—" అన్నాడు ప్రిన్సిపాల్ నరహరి.

"ఈ రోజుల్లో హీరోలకేగానీ క్యారెక్టర్ యాక్టర్లకి బహుమతులుండటంలేదు. అందువల్ల నాకే అవకాశమూ లేదు—" అన్నాడు సినీ నటుడు వీరేశం.

"నాకు కెరీర్ ముగుస్తోంది. ఇంక టెస్టు సెలక్షన్ వచ్చే అవకాశం లేదు. వున్నదల్లా చంద్రశేఖరానికే వుంది—" అన్నాడు క్రికెట్ ఆటగాడు రమేష్.

"ప్రస్తుతం ఓ ఇంట్రస్టింగు కేసు చేతిలో వుంది. బహుశా మనం మళ్ళీ కలవచ్చు—" అన్నాడు న్యాయవాది చంద్రశేఖరం.

"ఏమిటా కేసు!" మిగతా అందరూ ఆసక్తిగా అడిగారు.

"పార్టీలో కలిసినపుడు చెబుతాను—" అన్నాడు చంద్రశేఖరం.

పార్టీ అయిపోయింది. అంతా ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. గోవిందయ్య అందరికీ గుడ్‌నైట్ చెప్పి తన పడగ గదికి వెళ్ళాడు. అతడి భార్య జానకి అప్పటికే నిద్రపోతోంది. పక్కమీద అలికిడి కాగానే ఆమె మత్తుగా కళ్ళు విప్పి—"పార్టీ అయిపోయిందా?" అంది.

"అయిపోయింది. అప్పుడే నిద్ర పట్టేసిందా?" అన్నాడు గోవిందయ్య.

"పిల్లలైతే ఎప్పుడో నిద్రపోయారు. నేనే ఇప్పుడిప్పుడే నిద్రపోయినట్లున్నాను—" అంటూ ఆవలించింది జానకి.

గోవిందయ్య లుంగీ తీసుకుని పాంటు విప్పాడు.

విప్పడంలో అందులోంచి ఓ కవరు క్రిందపడింది. ఠవ్ మని చప్పుడయింది.

"ఏమిటా చప్పుడు?" అంది జానకి.

"ఏదో కవరు—" అంటూ గోవిందయ్య యథాలాపంగా ఆ కవరు అందుకున్నాడు. తెల్లటి కవరు అది. దానిమీద తన పేరే రాసివుంది. గోవిందయ్య కవరు అటూ ఇటూ తిప్పి చూశాడు. అతికించే వుంది. అతికించిన కవరు తన జేబులోకి ఎలా వచ్చిందోనని ఆశ్చర్యపడుతూ గోవిందయ్య అది చింపి లోపలి కాగితం బైటకు తీశాడు. తెల్లటి కాగితంమీద ఎర్రటి అక్షరాలు.

"గోవిందయ్యా! చార్మినార్ సిగరెట్ పెట్టెలో ఎనిమిది సిగరెట్లున్నాయి. వాటిలో ఒకటి విషపూరితం. తెల్లారేలోగా మీలో ఒక్కరుండరు. తర్వాత పార్టీకి పాపం ఏడుగురే వుంటారు—"

అని వ్రాసి వుంది. సంతకం లేదు.

"ఇంకా పడుకోలేదా?" అంది జానకి. సమాధానంగా ఆమెకి ధబ్ మన్న శబ్దం వినపడింది.

"ఏమిటండీ అది!" అంది జానకి కంగారుగా. సమాధానం లేదు. జానకి కళ్ళు నులుముకుని లేచి వచ్చేసరికి అక్కడ గోవిందయ్య స్పృహతప్పి పడివున్నాడు.

## 2

గోవిందయ్య ఫామిలీ డాక్టరు వచ్చి చూసేసరికి ఆయన చచ్చిపోయాడు. డాక్టరు కొన్ని పరీక్షలు చేసి— అది సహజ మరణమని తేల్చి చెప్పాడు. గోవిందయ్య చేతిలోని ఉత్తరం చూసి-"ఇది పోలీసులకిస్తే మంచిదే! కానీ దానివల్ల చాలా ఇబ్బందులూ వున్నాయి—" అన్నాడాయన.

ఫామిలీ డాక్టరు సలహామీద గోవిందయ్యకు వచ్చిన ఉత్తరం గురించి ప్రత్యేకమైన రిపోర్టు ఏమీ ఇవ్వలేదు జానకి. ఆ విషయాన్ని కుటుంబ సభ్యులు తమలో తాము ఇముడ్చుకున్నారు.

పార్టీకి వచ్చిన గోవిందయ్య మిత్రుల్లో ఒక్కరుకూడా అతడి శవాన్ని చూడ్డానికి రాలేదు. అందరూ రాత్రికి రాత్రే స్వంత కార్లలో ఆ ఊరు వదిలి వెళ్ళిపోయారు. వాళ్ళలో ఏ ఒక్కరూ ఆ ఊరివారు కాదు.

భర్త మరణవార్త ఈ స్నేహితులకు తెలియ జెయ్యాలా మానాలా అని ఆలోచించింది జానకి. చివరకు ఊరుకుంది. ఎందుకంటే ఈ స్నేహం పూర్తిగా భర్తకూ, వారికీ పరిమితం. తన భర్తతోపాటే స్నేహమూ అయి పోయినట్టే!

గోవిందయ్య అంత్యక్రియలు జరిగిపోయాయి ఎంతో వైభవంగా! ఎందరో ప్రముఖులు సంతాపాన్ని వ్యక్త పరుస్తూ టెలిగ్రాములు పంపారు. గోవిందయ్యకు రావలసిన పార్టీ టికెట్ మరో జనార్దనమూర్తికి వెళ్ళింది. అతడోసారి జానకి ఇంటికి వచ్చి — "పార్టీ టికెట్ కోసం ఎంతో కాలంగా ప్రయత్నిస్తున్నాను. కానీ అది ఇలా రావటం నాకెంతో బాధగా వుంది—" అని చెప్పాడు.

బాధగా వున్నప్పటికీ జనార్దనమూర్తి పార్టీ టికెట్ తనకు వచ్చినందుకు విందులు ఏర్పాటు చేశాడు. ఎన్నికలు రాగానే ముమ్మరంగా ప్రచారమూ ప్రారంభించాడు. ఆ కోలాహాలం చూసినపుడల్లా జానకికి ఎంతో బాధగా వుండేది. బ్రతికి బాగుంటే ఆ కోలాహాలమంతా తన భర్త పేరున జరగాల్సి వుంది.

8

ఎన్నికలు ముగిశాయి. జనార్దనమూర్తి పదివేల మెజారిటీతో నెగ్గాడు. ఊరంతా పెద్ద ఊరేగింపు. ఊరేగింపు చూసి జానకి కళ్ళనీరు పెట్టుకుంది.

ఆ మర్నాడే గోవిందయ్య పేరిట ఓ కవరు వచ్చింది. తన భర్త పేరుమీద ఉత్తరం వచ్చినందుకు ఎంతో ఆశ్చర్యపడిన జానకి అది విప్పి చదివింది.

అది న్యాయవాది చంద్రశేఖరంనుంచి వచ్చింది.

"మిత్రమా గోవిందయ్యా!

అనుకున్నట్లుగానే నేను పార్టీ యిస్తున్నాను.

ఈ పార్టీకి నువ్వు రాలేవని నాకు తెలుసు.

అయినా అది నా లోపంకాదు. నేను బ్రతికున్నంత

కాలం నీ పేరున ఆహ్వానం పంపిస్తూనే వుంటాను.

తప్పక వస్తావు కదూ—...."

క్రింద పార్టీ తేదీ వివరాలున్నాయి.

ఈ ఉత్తరం చదవగానే జానకి బుర్ర చురుగ్గా పని చేసింది. ఇలాంటి పార్టీలో ఓ సిగరెట్ త్రాగి తన భర్త ప్రాణాలు కోల్పోయాడు. అది హత్య అవునో కాదో తెలియదు. కానీ ఈ విషయం ఆ పార్టీలోని మిగతా సభ్యులకు తెలియడం ఎంతైనా అవసరం.

జానకి వెంటనే చంద్రశేఖరానికి గోవిందయ్య పేరు మీదనే టెలిగ్రాం ఇచ్చింది — పార్టీకి తను బయల్దేరి వస్తున్నట్లు.

3

ఈ టెలిగ్రాం అందుకుని చంద్రశేఖరం చాలా ఆశ్చర్యపడ్డాడు. గోవిందయ్య పోయినట్లు తను పత్రికల్లో చూశాడు. సంతాపం తెలియచేస్తూ టెలిగ్రాం కూడా కొట్టాడు. మరి ఈ టెలిగ్రాం ఎవరిచ్చారు?

చంద్రశేఖరం ఏర్పాట్లన్నీ ఏడుగురికే చేశాడు. పార్టీ కోసం ఓ గదిని ప్రత్యేకించాడు. రాత్రి ఎనిమిది దాటినాక ఇంట్లోని ఎవ్వరూ కూడా అటువైపు రాకూడదని శాసించాడు. టైముకి ఒక్కొక్కరే రాగానే అందర్నీ తను ఆప్యాయంగా రిసీవ్ చేసుకుని గదిలోనికి తీసుకుని వెళ్ళాడు. అంతా వాళ్ళ వాళ్ళ సీట్లలో కూర్చున్నారు.

"కుర్చీలు ఏడే వున్నాయి—" అన్నాడు హరగోపాల్. ఆయన ముఖంలో బాధ కనబడింది—"కుర్చీలు తగ్గేటంత వయసు మనకు లేదు—"

"ప్లీజ్ — ఇది మనం సంతోషంగా గడుపవలసిన సమయం—" అన్నాడు చంద్రశేఖరం.

"విషాదాంశాలను స్మరించను కూడా స్మరించకూడదు—"

అంతా కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా అయిపోయారు. అది వారి పార్టీ నియమం. అక్కడున్నంతసేపూ ఉత్సాహమైన కబుర్లే చెప్పాలి.

"నిజానికి ఈ కేసు నేను నెగ్గుతానని అనుకోలేదు. అంతవరకూ వ్యతిరేకంగా వున్న సాక్షి ఒకడు మాకు అనుకూలంగా మారిపోయాడు. దాంతో కేసు తిరిగిపోయింది. నేను రక్షించినది సామాన్యుణ్ని కాదు. ఫీజుగా నాకు లక్ష రూపాయలు వచ్చింది—మన పార్టీకి ఇంతకంటె అనుకూలమైన పరిస్థితి ఏముంటుంది?" అన్నాడు చంద్రశేఖరం.

"కేసు వివరాలు చెప్పాలి!" అన్నాడు మోహనరావు.

"చెబుతాను. ముందు కడుపులు నింపాలి గదా!" అన్నాడు చంద్రశేఖరం.

అంతా ఉత్సాహంగా అక్కడున్న పదార్థాలమీద పడ్డారు. ముందు ఓ రౌండ్ మందు కొట్టారు. తర్వాత చికెనూ, మటనూ లాగించారు. అప్పుడు మళ్ళీ మందు కొట్టటం మొదలుపెట్టారు.

టేబిల్ కు మధ్యలో ఓ చార్మినార్ సిగరెట్ పెట్టె వున్నది. అది కొద్దిగా తెరిచి వుంది. అందులో ఏడు సిగరెట్లున్నాయి.

చంద్రశేఖరం చెప్పడం మొదలుపెట్టాడు.

"హతుడు మధ్యతరగతివాడు. పదిమంది అతడిమీదే ఆధారపడి జీవిస్తున్నారు. హతుడి చెల్లెలికి పెళ్ళి కుదిరింది—కట్నం లేకుండా! అలాంటి పరిస్థితుల్లో ఓ కోటీశ్వరుడి కొడుకు హతుడి చెల్లెలిని రేప్ చేయ బోతూండగా హతుడి కలగజేసుకున్నాడు. గొడవలో హత్య జరిగింది. హత్య జరిగిన కొద్ది క్షణాల లోనే హంతకుడు తండ్రిని కలుసుకుని జరిగింది చెప్పాడు. తండ్రి నా దగ్గరకు వచ్చాడు.

హత్య గురించి పోలీసులకు ఫిర్యాదు వెళ్ళేలోగా మేము హతుడి కుటుంబాన్ని కలుసుకుని వాళ్ళ కష్టాలన్నీ తీరుస్తామని వాగ్దానం చేశాం. ఈ మధ్యతరగతివాళ్ళతో ఇదో పెద్ద న్యూసెన్సు. డబ్బు కోసం నానా గడ్డి కరుస్తూనే-నిజంగా డబ్బొచ్చేసరికి సెంటిమెంట్లు పెంచు కుంటారు. హంతకుణ్ని ఉరికంబమెక్కించి తీరుతామని వాళ్ళు ప్రతిన బూనారు. కేసు పోలీసులకు వెళ్ళింది. ఇలాంటి వాళ్ళంటే సానుభూతి వున్న లాయరు వాళ్ళ కేసు టేకప్ చేసి బలంగా తయారుచేశాడు.

నా శాయశక్తులూ ఉపయోగించాను. మనసులో ఆశ లేదు. ఆ సమయంలో ఓ సాక్ష్యం నా వైపు తిరిగింది,

ఫలితంగా తేలిందేమిటంటే హతుడి చెల్లెలికి హంత కుడితో అక్రమ సంబంధమున్నదనీ అది తెలిసి హతు డుద్రేకపడి చెల్లెల్ని చంపేయబోయాడనీ — ఆమెను రక్షించడంలో హంతకుడు ప్రమాదవశాత్తూ హత్య చేశాడనీ! ఇది ఋజువు కావటంతో నే నా క్లయింట్ ని వదిలేశారు. హతుడి కుటుంబం ఇంకా కష్టాల్లో పడింది. అంతవరకూ లేని మరో చెడ్డ పేరు హతుడి చెల్లెలికి వచ్చింది — ఏమైతేనేం — నాకు లక్ష రూపాయలూ వచ్చాయి—" అన్నాడు చంద్రశేఖరం గర్వంగా.

చంద్రశేఖరం తెలివికి మిత్రులంతా అభినందించారు. "ఇదే విధంగా నువ్వు మరిన్ని లక్షలు సంపాదించాలని కోరుచున్నాము —" అని అంతా ఏక కంఠంతో అన్నారు.

శ్రీనివాసరావు టేబిల్ మీద చార్మినార్ సిగరెట్ పెట్టె తీశాడు. అందులోంచి ఓ సిగరెట్ తీసి వెలిగించి-పెట్టె పక్కవాడికి తోశాడు. ఒక్కొక్కరే సిగరెట్ వెలిగించారు.

"పార్టీలో ఇదే ఆఖరి అయిటం—" అన్నాడు వీరేశం.

"మళ్ళీ పార్టీ ఎవరు చేస్తారో?" అన్నాడు నరహరి.

"నా ఆశలన్నీ వీరేశంమీదా, శ్రీనివాసరావుమీదా వున్నాయి. ఇద్దరికీ మంచి గుర్తింపు పొందే అవకాశం వుంది—" అన్నాడు హరగోపాల్.

"అలా ఏమీ చెప్పలేము. పార్టీ చేసే అవకాశం మనలో అందరికీ ఏదో విధంగా రావచ్చును-" అన్నాడు శ్రీనివాసరావు.

సిగరెట్ ఆఖరి దమ్ము లాగటం అయిపోగానే అంతా

లేచారు.

అందర్నీ పంపించడం అయినాక చంద్రశేఖరం లోపలకు వెళ్ళబోతూంటే వాచ్‌మన్ — "సార్!" అన్నాడు.

"ఏం?" అన్నాడు చంద్రశేఖరం వెనక్కి తిరిగి.

"మీ పార్టీ అవుతూండగా ఒకామె వచ్చిందండి. తన పేరు జానకి అని చెప్పింది. పార్టీలో వుండగా తమ రెవ్వరినీ కలుసుకోరని చెప్పాను. తనూ పార్టీ పనిమీదనే వచ్చానని చెబుతూ ఆహ్వాన పత్రం కూడా చూపిందామె. సరేనని లోపలకు వెళ్ళనిచ్చాను. ఆమె లోపలకు వెళ్ళి పది నిమిషాల్లో వెనక్కి తిరిగి వచ్చేసింది. మిమ్మల్ని కలుసుకున్నారా అంటే లేదని చెప్పింది. కాసేపు ఆగుతారా అంటే ఆగనని చెప్పింది. ఇలా వచ్చి వెళ్ళినట్లు అయ్యగారికి చెప్పాలా అంటే అవసరంలేదంది. అంతా తమాషాగా అనిపించింది నాకు. ఎందుకైనా మంచిదని మీతో చెబుతున్నాను."

"ఆమె వయసెంతుంటుంది?"

"ముప్పై దాటుతుందండి. మనిషి చాలా అందంగా ఉందండి—"

"అలాగా-" అని వెనక్కి తిరిగాడు చంద్రశేఖరం.

జానకి—ఎవరామె? ఇలాంటి పేరు తనెక్కడా విన లేదు. ఆమె కూడా ఆహ్వాన పత్రం కూడా తీసుకుని వచ్చిందంటున్నాడు. అదెక్కడిదామెకు?

తను మొత్తం ఎనిమిది ఆహ్వాన పత్రాలు పంపాడు. పార్టీకి ఏడుగురు వచ్చారు. ఒక ఆహ్వాన పత్రం గోవిందయ్యది.

జానకి ఎవరో చంద్రశేఖరానికి గుర్తొచ్చింది. జానకి

గోవిందయ్య భార్య పేరు. తన ఆహ్వానాన్నందుకుని ఆమె గోవిందయ్య పేరున టెలిగ్రాం ఇచ్చిందా? గోవిందయ్యకు బదులు తను పార్టీకి రావాలనుకుని చివరి క్షణాల్లో మనసు మార్చుకుందా? అలా మనసు మార్చుకునే సంఘటన ఏం జరిగింది?

ఆలోచిస్తూనే చంద్రశేఖరం లోపలకు నడిచాడు. పార్టీ జరిగిన గదిపక్కనుంచి నడుస్తూండగా—"చంద్రశేఖరం—" అని ఎవరో లోపల్నుంచి పిలిచినట్లు వినిపించిందతడికి. చటుక్కున అతను ఆ గదిలోకి వెళ్ళాడు.

ఇప్పుడక్కడ ఏడు కాదు—ఎనిమిది కుర్చీలున్నాయి.

"నేను రాననుకుని నా కోసం నువ్వు కుర్చీ వేయించలేదు. అందుకని నా కుర్చీ నేనే తెచ్చుకున్నాను—" అన్నాడు ఎనిమిదో కుర్చీలో కూర్చున్న గోవిందయ్య.

గోవిందయ్యను చూస్తూనే చంద్రశేఖరం—కెవ్వుమని అరిచాడు.

## 4

"ప్రముఖ న్యాయవాది చంద్రశేఖరం హఠాన్మరణం" అన్న వార్త చూసి సబురాలైంది జానకి. పేపర్లో వార్త నామె ఎంతో శ్రద్ధగా చదివింది. అందులో ఎక్కడా అది హత్య అన్న సూచన లేదు.

మొత్తం వాళ్ళు ఎనమండుగురు స్నేహితులు. గోవిందయ్య వాళ్ళకు తనింట్లో పార్టీ యిచ్చాడు. చార్మినార్ సిగరెట్ పెట్టెలో ఎనిమిదింట్లో ఒకటి విషపూరితం అన్న హెచ్చరిక గోవిందయ్యకు అందింది. గోవిందయ్య చనిపోయాడు. తర్వాత మళ్ళీ పార్టీ జరిగింది. ఈసారి చంద్రశేఖరం పార్టీ యిచ్చాడు. తను వెళ్ళి అతణ్ని సిగరెట్ల విషయమై హెచ్చరించాలనుకుంది.

వెళ్ళింది కూడా!

అయితే చంద్రశేఖరం ఏ సందర్భంలో తనా పార్టీ యిస్తున్నాడో స్వయంగా చెబుతూండగా వింది. అతను నేరస్థుణ్ని కాపాడి అమాయకులకు కష్టం కలిగించాడు. ఆ విజయాన్ని పురస్కరించుకుని పార్టీ చేస్తున్నాడు. పార్టీలో ఒక్కరు కూడా అది అన్యాయమనలేదు. అంతా అతడి విజయాన్ని హర్షించారు. ఎందుకో ఆ క్షణంలో తనకు వాళ్ళని హెచ్చరించాలనిపించలేదు. కానీ అందు మూలంగా ఘోరం జరిగిపోయింది. మరో కడికి అకాల మరణం సంప్రాప్తించింది.

హంతకుడు ఈ ఎనమండుగురిలోనే వున్నాడు. వారిలో ఇద్దరు పోయారు. ఇంక ఆరుగురు మిగిలారు. ఏ ప్రయోజనాన్నాశించి హంతకుడీ హత్యలు చేస్తున్నాడు? ఇంకా అతదెన్ని హత్యలు చేయబోతున్నాడు? ఆ ఆరుగురిలోనూ హంతకుడెవరు?

జానకి ఆలోచనలు పరిపరి విధాల పోయాయి.

జానకి చదువుకున్న వనిత. భర్త పోయిన దుఃఖం నుండి ఆమె తొందరగానే తేరుకుంది. ఏ కారణంగా భర్త హత్య కావించబడ్డాడో తెలుసుకోవాలన్నది ఆమె కుతూహలం. ఆ కుతూహలంలో కొంత భయం కూడా వున్నది. హంతకుడే పగ ఒక్క గోవిందయ్యపైననో లేక మొత్తం కుటుంబం మీదనా?

చంద్రశేఖరం హత్యతో జానకికి కొంత ధైర్యం కలిగినా హత్యలకు వెనుకనున్న అసలు కారణం తెలుసుకోవాలని ఆమెకున్నది.

ఇప్పుడామెకున్న అనుమానం—మళ్ళీ మూడో పార్టీ జరుగుతుందా? ఈ పార్టీ అయ్యాక కూడా ఇంకొకరు

మరణిస్తారా?

జానకి ఆలోచనలిలా వుండగానే గోవిందయ్య పేరున ఇంకో ఆహ్వాన పత్రం వచ్చింది. అది నటుడు వీరేశం పంపాడు. అప్పటికి చంద్రశేఖరం చనిపోయి నాలుగు మాసాలవుతుందేమో!

బహుశా వీరేశానికి చావు మూడింది. అతడిని హెచ్చరిస్తే ఎలా వుంటుంది? హంతకుడు మిగతా అయిదుగురిలోనూ వున్నాడు.

అప్పుడే జానకి కింకో అనుమానం కలిగింది. రెండుసార్లు పార్టీ ఇచ్చిన వ్యక్తులే చనిపోయారు. హెచ్చరిక ప్రకారం చార్మినార్ సిగరెట్లలో ఒకటి విషపూరితం. హంతకుడు అంత ఖచ్చితంగా విషపూరితమైక సిగరెట్ ని హతుడికెలా అందజేయగల్గుతున్నాడు? విషపూరితమైన సిగరెట్ ని హంతకుడు స్వయంగా హతుడికందిస్తున్నాడా లేక పార్టీ ఇచ్చినవారే చనిపోవడమన్నది కాకతాళీయంగా జరిగిందా?

తను హెచ్చరించకపోతే వీరేశమో — మరొకడో చావడం కాయం. ఇప్పుడు తనేం చేయాలి? ఇంతవరకూ జరిగినది వాళ్ళకు చెప్పటం తన బాధ్యత కాదా? జానకి తీవ్రంగా ఆలోచించి పార్టీకి వెళ్లాలనే నిర్ణయించుకుంది.

## 5

"పర్సులు ఆరు. సిగరెట్లు ఆరు-" దిగులుగా అన్నాడు మోహనరావు.

"ఈ రోజు మనం ఉత్సాహంగా వుండాలి!" హెచ్చరించాడు వీరేశం.

"అలాగే వుందాం. కానీ ఒక ముఖ్యమైన విశేషం

చర్చించాలి. అదాట్టే ఉత్సాహకరమైనది కాదు. కానీ జీవితానికి చాలా ముఖ్యమైనది—" అన్నాడు శ్రీనివాస రావు.

"ఏమిటది?" అన్నాడు నరహరి ఆత్రుతగా.

"మనమీ పార్టీలు జీవితంలో అద్భుతమైన విజయం సాధించినందుకు చేసుకోవాలనుకున్నాం. అలాగే చేసుకుంటున్నాం. కానీ నాకిప్పుడు అలాగనిపించటంలేదు. ఉద్యోగంలోంచి రిటైరయినప్పుడు జరిగే పార్టీలాగ— జీవితంనుంచి రిటైరయిరపుడు చేసే పార్టీలాగ—వుంటోంది—" అన్నాడు శ్రీనివాసరావు.

"కవి హృదయం అర్థంకాలేదు—" అన్నాడు హర గోపాల్.

"ఇప్పుడీ పార్టీ ఎందుకు?"

"నా నటనకు రాష్ట్ర స్థాయిలో గుర్తింపు వచ్చింది. ఉత్తమ నటుడి బహుమతి నాకు లభించింది. అందుకు!" అన్నాడు వీరేశం.

"తనకు అధికారపక్షం టికెట్ లభించిందని గోవిందయ్య పార్టీ యిచ్చాడు. ఆ రాత్రే అతను చని పోయాడు. నెగ్గుతాననుకోని కేసు నెగ్గానని చంద్ర శేఖరం పార్టీ యిచ్చాడు. ఆ రాత్రే అతనూ చని పోయాడు. ఇప్పుడు వీరేశానికి అనుకోకుండా ఉత్తమ నటుడి బహుమతి వచ్చింది. పార్టీ యిచ్చాడు. ఆ రాత్రి...." అని ఆగిపోయాడు శ్రీనివాసరావు. ఈ మాటలు వింటూనే అందరికీ ముచ్చెమట్లు పోశాయి.

"అయితే ఏమంటావ్?" అన్నాడు మోహనరావు.

"మనలో మనకిలా అనుకోని విజయాలెందుకు వస్తున్నాయి? పార్టీలివ్వగానే ప్రాణాలెందుకు పోతున్నాయి?

ఇది కాస్త ఆలోచించవలసిన విషయం—"

"ఈ రచయితలతో ఇదే బాధ. కాస్తుంటే గంపంత చేస్తారు. గాలి పోగుచేసి తుఫాన్ సృష్టిస్తారు. మనం అనవసరంగా భయపడుతున్నామని నా అనుమానం—" అన్నాడు హరగోపాల్.

"నా అభిప్రాయం కూడా అదే! ఈ పార్టీ ఉత్సాహంగా వుండడానికే గానీ ప్రాణభయంతో కృంగిపోవడానికి కాదు—" అన్నాడు వీరేశం.

"పార్టీ ప్రారంభానికి ముందు—చిన్న మనవి! ఈ పార్టీలో కూడా ఏదైనా అయితే ఆ తర్వాత కొద్ది నెలలకు మళ్ళీ మనలో ఎవరికైనా అనుకోని విజయం లభిస్తే—పార్టీ ఇచ్చేముందు బాగా ఆలోచించుకోవాలి" అన్నాడు శ్రీనివాసరావు.

"ఒక్క క్షణం—" అన్నాడు హరగోపాల్—"ఒకవేళ ఇవి హత్యలా అనుకుందామంటే హంతకుడు మన ఆరుగురిలోనే ఉండాలి. అలాంటప్పుడు హత్యకు ప్రయోజనం కూడా ఆలోచించాలిగదా! సరదాగా ఎవరూ ఎవరినీ దేనికీ చంపరు ఎంత ఆలోచించినా నా మటుకు నాకు నేను గోవిందయ్యనూ, చంద్రశేఖరాన్నీ ఎందుకు చంపానో తెలియటంలేదు."

ఈ మాటలు వింటూనే అంతా నవ్వారు.

అప్పుడు నరహరి యిలాగన్నాడు—"ఈసారి పార్టీ నియమ నిబంధనలు కాస్త మారుద్దాం. రాత్రికిక్కడే ఉండిపోయి ఏ విశేషాలూ లేకపోతే ఎవరి ఊరు వారు పోదాం. విశేషముంటే తక్షణ కర్తవ్యం మిగతా అయిదుగురం చర్చిద్దాం—"

"మిగతా అయిదుగురం అంటే?" వీరేశం గుటకలు మింగుతూ అడిగాడు.

"అది రేపు తెలుస్తుంది—" అన్నాడు శ్రీనివాస రావు.

పార్టీ ప్రారంభమయింది. కొద్ది క్షణాలలోనే అంతా ఉత్సాహంగా మారిపోతూరు. మందు ప్రభావం అలాంటిది.

అన్నీ సుష్టుగా అయ్యాక మోహనరావు మొదటి సిగరెట్ వెలిగించి పక్కవాడికి తోశాడు. అప్పుడే ఎవరో తలుపు తట్టిన శబ్దమయింది.

"నాన్సెన్స్! మధ్యలో ఇదేమిటి?" అన్నాడు హర గోపాల్ అసహనంగా.

వీరేశం మాట్లాడలేదు. అంతా సిగరెట్స్ ముట్టించారు. మళ్ళీ తలుపు తట్టిన చప్పుడయింది.

"వీరేశం—నీ ఏర్పాట్లేమీ బాగోలేవు—" అన్నాడు నరహరి.

"సిగరెట్ చివరి దమ్ములోకి వచ్చేదాకా తలుపు తియ్యం. ఈలోగా మళ్ళీ తలుపు తట్టి వేధించకుండా చూడు—" మోహనరావు.

వీరేశం మొహం కందగడ్డలాగయింది. అతను సిగరెట్ దమ్మును మరోసారి లాగేలోగా తలుపు మళ్ళీ చప్పుడయింది.

వీరేశం కుర్చీలోంచి లేచి — "మీరంతా అలాగే కూర్చోండి. చివరి క్షణాల్లో మన ఆనందాన్ని పాడు చేయడానికి వచ్చిన ఆ దుర్మార్గుడి పని పడతాను—" అంటూ విసురుగా తలుపుదాకా వెళ్ళి- నెమ్మదిగా తలుపు తోసి తెర ఒత్తిగించి చూసి ఏదో అనబోయి ఆగి

పోయాడు.

అక్కడ ఒక స్త్రీ వున్నది. ఆమెను ఎప్పుడో చూసినట్లే అనిపిస్తోంది.

"నా పేరు జానకి! మీ స్నేహితుడు గోవిందయ్య భార్యను—" అందామె.

వీరేశం చటుక్కున ఒక్కడుగు బయటకు వేశాడు. అప్పుడు చూసిందామె—అతడి చేతిలోని సిగరెట్టును.

"అది చార్మినార్ సిగరెట్టా?" అంది జానకి కంగారుగా.

"అవును. మీకెలా - తెలుసు....ఓహ్....గోవిందయ్య చెప్పి వుంటాడు—" అని అప్రయత్నంగా ఓ దమ్ము లాగి—"ఈ సమయంలో మీరిక్కడికెందుకొచ్చారు?" అన్నాడు.

"చెబుతాను. ముందాసిగరెట్ అవతల పారేయండి!" అంది జానకి.

వీరేశం ఇంకో దమ్ములాగేసరికి ఆమె కంగారుగా—"ప్లీజ్! ఆ సిగరెట్ అవతల పారేయండి. అది విష పూరితం—" అంది.

వీరేశం ఉలిక్కిపడి ఆగిపోయి — "ఏమన్నారూ?" అన్నాడు.

జానకి క్లుప్తంగా గోవిందయ్య మరణం గురించి చెప్పి ఆనాటి ఉత్తరాన్ని చూపించింది. వీరేశం ఆ ఉత్తరాన్ని జానకికి తిరిగిచ్చేసి—"దీనితో ఓ పెద్దకథ సృష్టించకండి. ఇది సరదాకు రాసిన ఉత్తరం" అన్నాడు.

"అలా కొట్టి పారేయకండి. ఇందులో రాసిన ప్రకారమే రెండు హత్యలు జరిగాయి—" అంది జానకి.

ఆమె ముఖంలో కలవరపాటు కనబడుతోంది.

వీరేశం నవ్వి—తన జేబులోంచి ఓ కాగితనం పెన్ను తీసి—ఆ కాగితంమీద ఏదో రాసి జానకికి అందించాడు. జానకి అది చదివి ఆశ్చర్యపోయింది.

"గోవిందయ్యా! చార్మినార్ సిగరెట్ పెట్టెలో ఎనిమిది సిగరెట్లున్నాయి. వాటిలో ఒకటి విషపూరితం. తెల్లారేలోగా మీలో ఒక్కరుండరు. తర్వాత పార్టీకి పాపం ఏడుగురే ఉంటారు—"

తన దగ్గరున్న ఉత్తరంమీద దస్తూరీ ఇదీ ఒకటిగానే వుంది.

"ఇది సరదాకు నేనే రాశాను. తర్వాతి పార్టీలో దీని గురించి చర్చవస్తే అప్పుడు అసలు సంగతి చెబుదామనుకున్నాను. వినోదం కోసం ఇలాంటి ట్రిక్కు వేయటం మాకు మామూలే! అయితే నేనా ఉత్తరం రాసిన రోజునే గోవిందయ్య చనిపోవటంతో నేను భయపడి ఈ విషయం ఎవరికీ చెప్పకుండా వూరుకున్నాను. తీరికూర్చుని మనుషుల మనసుల్లో అనుమానాలెందుకూ సృష్టించటం అనిపించింది. మీ మనసులో కూడా యితరత్రా అనుమానాలుంటే దీంతో పోతాయనుకుంటాను—" అన్నాడు వీరేశం ఆమె వంకే చూస్తూ.

జానకి ఆశ్చర్యంగా అతడి వంకే చూసింది.

"పార్టీ చివర్లో వున్నాం. ఇంకా ఏమైనా మాట్లాడాలంటే ఓ పావుగంటలో వస్తాను. మీరు మేడమీద నా భార్యతో కబుర్లు చెబుతూ కూర్చోవచ్చు—" అన్నాడు వీరేశం.

"అవసరంలేదు—" అంది జానకి.

# 6

వీరేశం వ్రాసిన కవరు చూసింది జానకి. దానిమీద దస్తూరీ—తనకు వీరేశం అప్పటికప్పుడు వ్రాసి ఇచ్చిన ఉత్తరం మీద దస్తూరీ ఒక్కలా లేవు.

తన భర్త చెప్పాడు. ఈ పార్టీకి సంబంధించి అన్ని పనులూ స్వయంగా చేయాలన్నది వారి నియమం. ఉత్తరంమీద చిరునామా వ్రాయటం దగ్గర్నుంచీ అన్నీ తనే చేయాలనేవాడు. అదే నిజమైతే ఎక్కడో ఏదో తిరకాసుంది.

వీరేశం తను చూపించిన ఉత్తరం చూసి ఏ మాత్రమూ కలవరపడలేదు. అంటే దాని గురించి అతడికి ముందే తెలిసి వుండాలి. ఆ ఉత్తరం తనే రాశానని అప్పటికప్పుడు ఋజువు కూడా చేశాడు. పార్టీ చివర్లో వుండటంవల్ల తొందరగా తన్ను వదుల్చుకుని లోపలకు వెళ్ళాలనుకుని వుంటాడు. అందుకే క్షణాల మీద ఋజువు చేసి పంపించాడు.

ఆ ఉత్తరం కారణంగానే తన భర్త మరణించాడు. తనకు అనుమానంగానే వుంది — ఇందులో ఏదో తిరకాసుందని! తన భర్త గోవిందయ్య చనిపోలేదు—హత్య కావించబడ్డాడు. ఆ హత్య గురించి ఎంతో కొంత వీరేశానికి తెలుసును.

ఆ క్షణంలో తన అనుమానాలు వీరేశంమీదకు వెళ్ళిన మాట వాస్తవం. కానీ ఇప్పుడు వీరేశం ఈ లోకంలో లేడు. పార్టీ జరిగిన రాత్రే అతను చచ్చిపోయాడు. అందుకు కారణమేమిటి? ఎవరతన్ని చంపారు?

జానకి తల పట్టుకుంది. ఈ పార్టీలకీ—చావులకీ ఏదో సంబంధముంది. మిగిలిన అయిదుగురిలో ఒకరు హంత

పడయి వుండాలి. లేదా? బయటి వ్యక్తి ఎవరో వీరిని పార్టీ సమయంలో హత్య చేస్తూ ఉండివుండాలి. అలా ఎవరు చేస్తున్నారు?...జానకి ఆలోచనలు కొనసాగాయి.

తన భర్త తనకు చెబుతూండేవాడు. చాలా పనుల్లో వాళ్ళ స్నేహం ఒకరికొకరి ఉపయోగపడిందట. లాయర్ చంద్రశేఖరం చెప్పిన కథ తను విన్నది. దాన్నిబట్టి వీళ్ళు డబ్బు కోసం ఏమైనా చేయగల సమర్థులని తెలుస్తోంది. వీళ్ళ కారణంగా ఎంతమందికి అన్యాయాలు జరిగి పోయాయో? అలాంటివారిలో ఏ ఒక్కరికైనా గుండె మండి వుండవచ్చు.

ఎవరికో అన్యాయం జరగ్గా వచ్చిన విజయ సూచనగా జరిగే ఈ పార్టీలు ఆ గుండె మంటనింకా రెచ్చగొడుతూ ఉండివుండవచ్చు. అందువల్లనే హంతకుడు పార్టీ చేసిన వ్యక్తిని చంపేస్తున్నాడు.

ఎవరా వ్యక్తి?

జానకి ఆలోచనలు తెగలేదు. కానీ పేపర్లో ఓ రోజు మొదటి పేజీలో ప్రత్యేకంగా స్క్వేర్‌లో అనగా నాలుగు గీతల మధ్య పడిన వార్త చూసింది. డాక్టర్ మోహనరావు వైద్యపరంగా సాధించిన ఓ కొత్త విశేషానికి ప్రపంచ ప్రముఖ వైద్య సంస్థలనుండి గుర్తింపు లభించింది. బహుశా అతడికి విదేశాలనుండి ఆహ్వానం కూడా లభించవచ్చును.

జానకి ఆశ్చర్యపడింది. విశేషం పోయి అప్పటికి మూడు మాసాలయింది. హఠాత్తుగా ఈ డాక్టర్ కింతటి గుర్తింపు ఎలా లభించింది?

మామూలు ఆచారం ప్రకారం అతను పార్టీ చేయాలి. పార్టీ చేస్తే అతను చనిపోతాడనటంలో సందేహంలేదు.

కానీ పార్టీ చేసే అవకాశాలు ఇంత త్వరగా ఎలా ఏర్పడు తున్నాయి—వీళ్ళకి?

హంతకుడెవరైనా ప్రముఖ వ్యక్తి అయి వుండాలి. అతడికి రాజకీయ రంగంలో చాలా పలుకుబడి వుండాలి. అతనా పలుకుబడి ఉపయోగించి వీరందరికీ గొప్ప గుర్తింపు వచ్చేలా చేస్తున్నాడు. పార్టీ చేసే పరిస్థితులు కల్పిస్తున్నాడు. అప్పుడు పార్టీ చేసిన వ్యక్తిని చంపే స్తున్నాడు. ఎవరా హంతకుడు? అతనేం చేస్తున్నాడు?

ఇప్పటికి ముగ్గురయ్యారు. ఎంతో కొంత విషయం తనకు తెలిసినపుడు ఈ హత్యల గురించి తను హెచ్చ రించక తప్పదు. మోహనరావు పార్టీ యిచ్చేలోగానే తను అతన్ని హెచ్చరించాలి. జానకి బాగా ఆలోచించి మోహనరావు ఊరికి ప్రయాణమయింది.

జానకి అతడింటికి వెళ్ళేసరికి మోహనరావు ఇంట్లో లేడు. జానకి అతడి భార్యను కలుసుకుంది. మోహనరావు భార్య లక్ష్మి ఆమెను ఆప్యాయంగా పలకరించింది.

"మీతో ఓ విషయం రహస్యంగా మాట్లాడాలి!" అంది జానకి.

ఇద్దరూ ఓ గదిలోకి వెళ్ళారు. జానకి పార్టీల గురించీ హత్యల గురించీ చెప్పి తనకు వచ్చిన ఉత్తరం కూడా చూపించి-వీరేశం అన్న మాటలు చెప్పింది.

లక్ష్మి ఆశ్చర్యంగా ఆ ఉత్తరం వంక చూసి—"ఇది నా భర్త దస్తూరీ—వీరేశానికెందుకవుతుంది?" అంది.

జానకి తల తిరిగింది. లక్ష్మి వేరే గదిలోకి వెళ్ళి ఓ చిన్న కాగితంతో తిరిగివచ్చింది. దానిమీద మోహనరావు ఓ పర్యాయం డిస్పెన్సరీ నుంచి భార్యకు పంపిన సందేశం వున్నది. దస్తూరీ అచ్చం తన దగ్గరున్న ఉత్తరంమీద

దానిలాగానే వున్నది.

"ఇదెలా సాధ్యం?" అంది జానకి.

"నా భర్త అంటూండేవాడు—వీరేశానికి ఒకసారి చూస్తే ఎవరి దస్తూరీనైనా అనుకరించే శక్తి వున్నదని! అతనొకసారి నరహరిగారి భార్య దస్తూరీ చూసి ఆవిడ రాసినట్లు నరహరికో ఉత్తరం రాశాడట. అందులో భార్యాభర్తలు అనరాని మాటలన్నీ రాశాడట. అప్పుడు నరహరి భార్య పుట్టింట్లో వున్నది. నరహరి చంద్రశేఖరం దగ్గరకు విడాకుల గురించి సంప్రదించడానికి వెళ్ళాడు. అప్పటికి చంద్రశేఖరానికి వీరేశం తన ఉత్తరానికి నకలు పంపించటం కూడా జరిగింది. అందువల్ల వీరేశం నా భర్త దస్తూరీని అనుకరించాడంటే నేనాశ్చర్యపోను—" అంది లక్ష్మి.

"ఎందుకలా అనుకరించడం?"

"పార్టీ క్షణం ఆగినా సహించలేరు వాళ్ళు. ఆ పార్టీలో ఏం మోజున్నదో కానీ — వాళ్ళకు భార్యాబిడ్డలకంటే కూడా ఆ పార్టీలే ఎక్కువ!" అంది లక్ష్మి.

"ఏదేమైనా ఈసారి పార్టీ జరక్కుండా చూడండి. అది మీవారి ప్రాణాలకే ముప్పు తెస్తుంది-" అంది జానకి.

లక్ష్మి కంగారుగా—"ఈ విషయాలన్నీ మావారికి నేనే స్వయంగా చెబుతాను. మీరు మాత్రం ఆయన్ను కలుసుకుని మాట్లాడకండి. ఆడవాళ్ళ విషయంలో ఆయన బుద్ధి మంచిదికాదు-" అంది. తర్వాత ఆమె గేటుదాకా వచ్చి జానకిని దిగబెట్టింది.

సరిగ్గా అప్పుడే డాక్టర్ మోహనరావు అడుగుపెట్టాడు. కంగారుగా జానకికి వీడ్కోలు చెప్పేసింది

లక్ష్మి. జానకి తనూ మోహనరావును పరిచయం చేసుకోవాలని అనుకున్నది కానీ లక్ష్మికిష్టంలేదని గ్రహించి సంకోచించింది.

ఎర్రగా బుర్రగా వున్న మోహనరావు — సినిమా నటుడు వీరేశం కంటే ఎంతో బాగున్నాడు—"సినిమాల్లోకి పడితే వీరేశంకంటే ఇతడే బాగా రాణించే వాడేమో!" అనుకుంది జానకి. పార్టీ చేస్తే అతడింక బ్రతకడు — అన్న ఆలోచన కలగ్గానే ఆమె మనసు యేదోలాగైపోయింది. నిట్టూరుస్తూ అక్కణ్నించి వెళ్ళిపోయిందామె.

మోహనరావు పై వదులు చేసుకుని యధాలాపంగా అడిగినట్లు—"ఆమె ఎవరు లక్ష్మీ!" అన్నాడు.

"ఎవరైతే మనకెందుకులెండి! యేదో అనాధశరణాలయం చందా పేరు చెప్పి వచ్చింది. నోటితో లేదనే బదులు చేత్తో లేదంటే సరిపోతుందని ఓ రూపాయిచ్చి పంపించాను. చిన్న ముఖం చేసుకుని వెళ్ళింది. మనిల్లు చూసి వందరూపాయలైనా ఇస్తామని అనుకుందట— వంద రూపాయలంటే ఇక్కడ చెట్లకు కాస్తున్నాయనుకుందో యేమో—" అంది లక్ష్మి.

మోహనరావు యేమీ మాట్లాడకుండా — "ఆమెనెక్కడో చూసిన గుర్తు!" అన్నాడు.

"ఈ చుట్టుపక్కల ఆడాళ్ళనందర్నీ మీరు ఎప్పుడో ఎక్కడో ఓ చూపు చూసే వుంటారు—" అంది లక్ష్మి వెటకారంగా.

మోహనరావు నవ్వి—"నీ ఊహలే నిజమైతే నాకెంత బాగుండేది?" అన్నాడు.

# 7

కవరు అందుకుంటూనే ఆశ్చర్యపడింది జానకి. అది గోవిందయ్యను పార్టీకి ఆహ్వానిస్తూ డాక్టర్ మోహనరావు వ్రాసిన ఉత్తరం. జానకినింకా ఎక్కువ ఆశ్చర్యపరచినదేమిటంటే కవరుమీద దస్తూరీ తన దగ్గరున్న ఉత్తరంమీద దస్తూరితో సరిపోవటంలేదు.

"అంతా అయోమయంగా వుంది—" అనుకుంది జానకి.

లక్ష్మిని తను స్వయంగా కలుసుకుని మరీ చెప్పింది—ఈ పార్టీ ఆపమని. లక్ష్మి ఎందుకు ప్రయత్నించలేదు? లేక భర్త ఆమె మాటలు వినలేదా? వినలేదంటే ఎందుకు? ప్రాణాలకంటే పార్టీయే ఎక్కువా? యేమిటా పార్టీలోని విశేషం!

ఇప్పుడు తనేం చేయాలి?

తెలియని మూర్ఖులనైతే తను కాపాడగలదు. కానీ తెలిసిన మూర్ఖుల్ని ఎలా కాపాడటం? వీళ్ళందరికీ ఆత్మహత్య చేసుకోవాలన్న కోరిక బయల్దేరి ఇలా వరుసగా పార్టీలు చేస్తున్నారా? ఒకరు కాదు, ఇద్దరు కాదు—ఇప్పటికి మొత్తం ముగ్గురయ్యారు. అంతా తలో ఊళ్ళో వుండటంవల్ల గానీ లేకపోతే ఈ హత్యలకు వార్తల్లో ప్రథమ స్థానం లభించి వుండేది. అసలు హత్యలెలా జరుగుతున్నాయి?

డాక్టర్లు హత్య అని చెప్పటంలేదు. సహజ మరణమేనని అంటున్నారు. రహస్యమంతా ఆ చార్మినార్ సిగరెట్లలోనే వుంది. ఎవడో కొత్త రకం విషం కని పెట్టాడు.

ఏదియేమైనా జానకి పార్టీకి వెళ్ళలేదు.

పార్టీ అయిన రాత్రి మోహనరావు చచ్చిపోయాడు.

ఈ వార్త చదివి జానకి ఏడుస్తూ కూర్చుంది. తన భర్త ఎలాగూ పోయాడు. కానీ ఇలా వరుసగా ఎనమండుగురు స్నేహితులూ పోవలసిందేనా? ఆమె మనసు పాడైంది.

ఈ ఎనమండుగురూ కలిసి ఏదో మహా పాపం చేశారు. అదేమిటో తెలుసుకుంటే ఇక ముందైనా ఈ హత్యా కాండ ఆగుతుంది.

జానకి మళ్ళీ ఆలోచించింది. ఆగితే తనకేం? ఆగక పోతేనేం?

ఇలాగనుకుని ఆమె ఊరుకోలేకపోయింది. తన భర్తకు డైరీ రాసే అలవాటు లేదు. అదుంటే అతడి రహస్యాలు కొన్ని తెలిసేవి. రాజకీయాల్లో వున్నవాడికి శత్రువు లుండటం సహజం. వాళ్ళలో ఫలానావారీ హత్య చేశారని తెలుసుకోవటం ఎలా?

ఇలా రోజులు గడుస్తూండగానే మరో వార్త జానకిని కలవరపరిచింది. ప్రముఖ పారిశ్రామికవేత్త హరగోపాల్ కు — ఎగుమతుల పేరు చెప్పి — అదనపు విదేశీ మారక ద్రవ్యం ఆర్జించినందుకు — ప్రభుత్వ బహుమతి లభించింది. ఇంతవరకూ అతడికిలాంటి గుర్తింపూ లేదు ప్రభుత్వపరంగా. ఇదే మొదటిసారి. అతడినభినందిస్తూ ఎందరో పత్రికలలో లేఖలు కూడా రాశారు.

అప్పటికి మోహనరావు మరణించి మూడు నెలలు పూర్తికావస్తోంది. అంటే మూడేసి నాలుగేసి నెలకొకరు చొప్పున ఈ స్నేహితులు నలుగురూ కూడా ప్రాణాలు కోల్పోవలసిందేనా?

ఇప్పుడు తనేం చేయాలి?

మోహనరావును తనకుతానై వెళ్ళి హెచ్చరించింది. స్వయంగా అతన్ని కాకపోయినా—అతడికంటే ఎక్కువగా అతడి ప్రాణాలను రక్షించాలనుకునే భార్యకు చెప్పింది. అయినా ప్రయోజనం లేకపోయింది.

అప్పుడు జానకికి ఒక విషయం అర్థమయింది.

ఈ ఎనమండుగురు స్నేహితులదీ — సామాన్యమైన స్నేహంకాదు. బహుశా స్నేహం కోసం ప్రాణాలు కూడా యిస్తారు. ఎవరికి ప్రత్యేక విజయం లభించినా పార్టీ చెయ్యాలన్నది వారి నియమం. ప్రాణ భయంతో వారా పార్టీలు మానరు. అందువల్ల ఈ విషయమై పార్టీలు ఇచ్చేవారిని హెచ్చరించి లాభంలేదు. పుచ్చుకునేవారిని హెచ్చరించాలి.

మోహనరావు విషయంలో ఇదే పొరపాటు తను చేసింది. అతణ్ని బదులు మిగతా స్నేహితులను హెచ్చరించి వుండాల్సింది. పార్టీ తమ స్నేహితుడికి ప్రాణాంతకమైనపుడు అలాంటి పార్టీ తీసుకోవాలని ఏ స్నేహితుడూ అనుకోడు.

జానకి వెంటనే రమేష్, నరహరి, శ్రీనివాసరావులకు అర్జంటుగా రావలసిందిగా టెలిగ్రాంలిచ్చింది. టెలిగ్రాం అందిన వెంటనే వాళ్ళు ముగ్గురూ ఆమె యింటికి వచ్చారు. వారికి ఆమె తనకు తెలిసిన కథ క్లుప్తంగా వివరించింది.

కథ వింటూనే మిత్రులు ముఖముఖాలు చూసుకున్నారు.

"మీరు చెప్పేది నమ్మశక్యంగాలేదు. కానీ జరిగింది చూస్తూంటే నిజమేననిపిస్తోంది. ఏదో మాయ జరుగుతోందని అనుకున్నా ఇంత స్పష్టంగా విషయం ఇప్పుడే

తెలిసింది మాకు. ఇప్పుడు మేము ఏదో ఒకటి చేయాలి" అన్నాడు నరహరి.

"హంతకుడు మీలోనైనా వున్నాడు. లేదా మీ ఎనమండుగురూ కలిసి ఉమ్మడిగా ఎవరికైనా అన్యాయం చేశారేమో గుర్తుచేసుకోండి—" అంది జానకి.

"హంతకుడు మాలో వుంటాడంటే మేమెవ్వరమూ నమ్మలేము—" అన్నాడు రమేష్.

"ఇందులో నమ్మకాల ప్రసక్తిలేదు. మీరంతా మీమీ ప్రాణాలు రక్షించుకోవాలి. ఈ హత్యా కాండను ఆపాలి—" అంది జానకి.

శ్రీనివాసరావు ఆలోచిస్తూ—"చాలా ఆశ్చర్యంగా వుంది నాకు. మీరు వీరేశాన్ని వచ్చి ఈ విషయమై హెచ్చరించి వెళ్ళారు. అయినా వీరేశం మాకా హెచ్చరిక గురించి చెప్పలేదు. అలాగే మోహనరావు భార్యకు కూడా మీరు పార్టీకి ముందే అన్నీ చెప్పారు. అయినప్పటికీ—అతను పార్టీ జరిపించాడు. మాకెవ్వరికీ ఈ హెచ్చరిక గురించి చెప్పలేదు. ఎందుకిలా జరుగుతోంది? ఎవరో బలవంతాన వారిచేత అన్నీ జరిపిస్తున్నారా?" అన్నాడు.

"ఆ వ్యక్తి చాలా పలుకుబడి గలవాడనే అనుకోవాలి. ఎందుకంటే అతను ప్రతి హత్యనూ పార్టీ రోజునే చేస్తున్నాడు. పార్టీ జరగటం కోసం అతను గన పలుకుబడినంతా వినియోగించకపోతే — మీ మిత్రులందరికీ అలాంటి గుర్తింపులు లభించి వుండేవంటారా? ఆ వ్యక్తి ఎవరో మీరు తెలుసుకోవాలి!" అంది జానకి.

"మరి ఆ ఉత్తరంలోని దస్తూరీ సంగతేమిటంటావు? ముందు అది వీరేశానిదనుకున్నారు. తర్వాత అది మోహన

రావుదని తేలింది. కానీ ఆ విషయమూ అనుమానించ వలసిందే నంటున్నారు. ఇప్పుడు మన ముగ్గురిలో ఆ దస్తూరీ ఎవరిదో చూడాలి!" అన్నాడు నరహరి ఆలోచిస్తూనే!

"దస్తూరి ఎవరిదో తెలుసుకోవటం వ్యర్థమని జానకి గారి పరిశోధనవల్ల తేలింది. ఇప్పుడు మనం ఈ విషయమై మన సమయం వృధా చేయవద్దు. ముందుగా మోహనరావు ఇంటికి వెళ్ళి జానకిగారి హెచ్చరికను వాళ్ళెందుకు అశ్రద్ధ చేశారో అతడి భార్య నడిగి తెలుసుకుందాం—" అన్నాడు శ్రీనివాసరావు.

"కొంత నాకు తెలుసు. తన భర్త ప్రవర్తన మంచిది కాదని మోహనరావు భార్యకు అనుమానం. ఆ అనుమానం కసిగా మారి తనూ అక్రమ సంబంధాలేర్పర్చు కుందని మోహనరావు అనుమానం. ఇద్దరూ తమకు ఋజువులున్నాయనేవారు. మొత్తంమీద వారి వైవాహిక జీవితం అంత బాగున్నట్లు లేదు. బహుశా లక్ష్మిగారు జానకిగారి హెచ్చరిక గురించి భర్తకు చెప్పలేదేమోనని నా అనుమానం...." అన్నాడు నరహరి.

"పీరేశంగారి దస్తూరీ అనుకరణ గురించి లక్ష్మిగారొక తమాషా కథ చెప్పింది. అది చెప్పటమే మరిచిపోయాను" అంటూ జానకి క్లుప్తంగా ఆ కథ వివరించింది.

"ఇది అబద్ధం!" అన్నాడు నరహరి చిరాగ్గా.

"ఆవిడ అబద్ధమెందుకు చెబుతుంది?" అన్నాడు రమేష్.

"ఆ విషయం తర్వాత ఆలోచిద్దాం. మీరు గమనించారో లేదో—ఇవి నిజంగా హత్యలే అయినట్లయితే హంతకుడు చాలా తెలివిగా ప్రవర్తించాడనే చెప్పాలి.

ముందు రాజకీయ ప్రముఖుణ్ని తొలగించాడు. తర్వాత నేరపరిశోధనకు అవకాశం లేకుండా లాయర్ని తొలగించాడు. కానీ అసలు హత్యకు అసలు కారణం ఏమిటి? మన గ్రూపునే ఎందుకు చంపాలి? అదీ పార్టీ రోజునే ఎందుకు చంపాలి?" అన్నాడు శ్రీనివాసరావు.

"ఈ హత్యలకు, పార్టీకి ఏదో సంబంధముంది. ఎవరికో తీరని అన్యాయం చేసి మీరు పార్టీ చేసుకుని వుంటారు. అతడు నెమ్మదిగా జీవితంలో పైకి వచ్చి వుంటాడు. పార్టీ రోజునే మిమ్మల్ని చంపాలనుకుంటున్నాడు!" అంది జానకి.

"అసలు హత్య ఎలా జరుగుతోంది!" రమేష్ ప్రశ్న.

జానకి ఉత్తరం చూపించింది.

"చార్మినార్ సిగరెట్టు—" అన్నాడు శ్రీనివాసరావు.

"ఈ దస్తూరి నేనెక్కడో చూశాను—" అన్నాడు నరహరి.

"ఏమో—దస్తూరీలు నాకంత బాగా గుర్తుండవు—" అన్నాడు రమేష్.

"మనం ముగ్గురం ఇప్పటికిప్పుడు ఈ దస్తూరీకి నకళ్ళు తీద్దాం. ఎవరిది సరిపోలితే వాళ్ళు సంజాయిషీ యిచ్చుకోవాల్సి వుంటుంది—" అన్నాడు నరహరి.

"దస్తూరీతో హంతకుణ్ణి సరిపోల్చాలనుకోవటం— కుక్క తోక పట్టుకుని గోదావరీదడం లాంటిది. నిజంగా హంతకుడు మన ముగ్గురిలోనే వుంటే సరిగ్గా ఇదే రకంగా రాస్తాడా? అదీకాక ఈ ఉత్తరంలోది ఒరిజనల్ దస్తూరీ అనడానికి సాక్ష్యమేమిటి?" అన్నాడు శ్రీనివాసరావు. దస్తూరీ పరీక్ష అతడికి బొత్తిగా నచ్చినట్లులేదు.

"దస్తూరీ పోల్చడానికి నిపుణులున్నారు-" అన్నాడు నరహరి.

"ఈ పోటీలో నేను పాల్గొనదల్చుకోలేదు. అసలు మోహనరావింట్లో ఈ ఉత్తరపు దస్తూరీ ఎలా వచ్చిందీ అన్న విషయం తేల్చాలి—" అన్నాడు శ్రీనివాసరావు.

"దస్తూరీ పరీక్ష నీకెందుకు ఇష్టంలేదు?" అన్నాడు నరహరి శ్రీనివాసరావు వంక అనుమానంగా చూస్తూ.

"ఇష్టంలేదు—అంతే!" అన్నాడు శ్రీనివాసరావు.

"సరే—నువ్వు చెప్పినట్లే చేద్దాం. ముందు శ్రీమతి మోహనరావును కలుసుకుందాం. ఆవిణ్ని చాలా అడిగి తెలుసుకోవాలి—" అన్నాడు నరహరి.

ముగ్గురూ జానకి దగ్గర సెలవు తీసుకుని మోహనరావు ఊరు వెళ్ళారు.

అక్కడ లక్ష్మి ఉత్సాహంగానే వున్నది. ఆమె హిందూ సంప్రదాయాన్ని పాటించకుండా చక్కగా బొట్టు పెట్టుకుని, చేతులనిండా గాజులు వేసుకుని, తలలో మల్లెలు కూడా తురుముకుని వున్నది. మిత్రులు చెప్పిన కథ విని ఆమె ఆశ్చర్యంగా—"జానకి ఎవరు? ఆమె ఎవరో నాకు తెలియదు—" అంది.

ఆశ్చర్యపోవడం ఇప్పుడు మిత్రులవంతు అయింది.

ఈ ఆడవాళ్ళిద్దరిలోనూ ఒకరు అబద్ధం చెబుతున్నారు. పనిగట్టుకుని తమను తనింటికి ఆహ్వానించిన జానకి అబద్ధమెందుకు చెబుతుంది?

నరహరి, శ్రీనివాసరావు లక్ష్మిని చాలా ప్రశ్నలు వేశారు. మోహనరావు చావు గురించి ముందుగా తన కెలాంటి హెచ్చరికా అందలేదని లక్ష్మి నొక్కి చెప్పింది.

"మీకు మీ భర్త అంటే యిష్టంలేదు. ఆయన

పోయినా ఫర్వాలేదనుకుని ఈ హెచ్చరిక ఆయనకు చెప్పలేదు. అవునా?" అన్నాడు నరహరి.

ఈ అభియోగానికి లక్ష్మి చలించలేదు—"దేశాన్ని కొల్లగొట్టి బ్రతికే పెద్దమనుషులు మీరు. అందువల్ల మీకు మానవత్వమంటే తెలియదు. చూస్తూ చూస్తూ ఓ నిండు ప్రాణం పోతుందని తెలిసీ ఊరుకోవడం ఎలా సాధ్యమవుతుంది?"

శ్రీనివాసరావు కోపం వచ్చింది — "మిమ్మల్ని చూడగానే ఎవరికీ మీ భర్తపోయి కొద్ది మాసాలే అయిందనిపించదు—" అన్నాడు.

"ఎందుకనిపించాలి? నాకు తెలిసిన ఒకాయన భార్య పోయిన రెండు నెలలకు మళ్ళీ పెళ్ళిపీటల మీద కూర్చున్నాడు. పెళ్ళాం పోగానే మగాళ్ళు కూడా గుండు కొట్టించుకుని, పంచె కట్టుకుని చొక్కా లేకుండా తిరగటం మొదలెడితే — నేనూ అన్ని నియమాలూ పాటిస్తాను. ఈ శతాబ్దంలో ఇంకా మీలాంటివారున్నారంటే...." అని ఆయాసపడుతూ ఆగింది లక్ష్మి.

తన మాటల్లోని లోపం శ్రీనివాసరావుకు వెంటనే తెలిసిరాగా—"అయాం సారీ—ఏదో నోరు జారాను—" అన్నాడు.

"ఇట్సాల్ రైట్!" అంది లక్ష్మి.

అక్కణ్ణించి బయటపడ్డాక — "నాకు లక్ష్మిమీద అనుమానంగా వుంది—" అన్నాడు శ్రీనివాసరావు.

"అది నీకు సహజం—నిన్నావిడ బాగా తిట్టిందిగా" అన్నాడు రమేష్.

"ఏది ఏమైనా ఆవిడ కారణంగా అన్యాయమంటూ

జరిగితే అది మోహనరావుకే జరిగింది. మిగతా మర ణాలకు ఆవిడ బాధ్యురాలని నేననుకోను. అంతేకాదు ఆవిడ మోహనరావును హెచ్చరించి వుండకపోవచ్చు. అంతమాత్రాన ఆవిడే ఈ హత్య చేసిందని అనలేము. అసలిది హత్య అండానికే ఋజువులేదు—" అన్నాడు నరహరి.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు రమేష్.

"మనం హరగోపాల్‌ని హెచ్చరించటంలో అర్థం లేదు. హంతకుడి కన్ను అతడిమీదపడింది. పార్టీ ఆగిపోతే హంతకుడు మరో పథకం వేయవచ్చు. ఇప్పుడున్న పథకం కొనసాగితేనే హంతకుణ్ని పట్టుకునే దారి కనబడు తుంది—" అన్నాడు శ్రీనివాసరావు.

"హంతకుణ్ని హత్యచేశాక పట్టుకుంటామా, చేస్తూండగా పట్టుకుంటామా, ఇంకా ముందే పట్టు కుంటామా?" అన్నాడు రమేష్.

"మనం హత్య ఆపగలం. అంతా ఆ చార్మినార్ సిగరెట్లో వుంది. కాబట్టి పార్టీలో ఈ సారి మనం సిగరెట్ పెట్టి హరగోపాల్‌కు కూడా తెలియకుండా మార్చేద్దాం. తర్వాత పార్టీలోని సిగరెట్ పెట్టెని పరీక్ష చేయిద్దాం—" అన్నాడు శ్రీనివాసరావు.

"నిజంగా పార్టీలు హత్యకు దారితీస్తున్న మాటయితే ఈ సూచన చాలా బాగుంది. మొత్తానికి రచయితనని పించుకున్నావు—" అని మెచ్చుకున్నాడు నరహరి.

# 8

హరగోపాల్ నించి గోవిందయ్య పేరున పార్టీకి ఆహ్వానం వచ్చింది. అది చూసి జానకి కళ్లొత్తుకుంది.

"వీళ్ళందరికీ వరుసగా మూడినట్టుంది. లేనిపక్షంలో

ఇలా వరుసగా పార్టీలివ్వరు" అనుకుందామె.

సుమారు ఒక్క సంవత్సరం వ్యవధిలో ఎనమండుగురు మిత్రులూ ముగ్గురిగా మారిపోతున్నారు. పార్టీకొకరు చొప్పున పోతున్నా పార్టీలు మానెయ్యాలని వాళ్ళను కోవడం లేదు. చావుకు భయపడ్డం లేదు. ఏమిటీ పార్టీలలోని విశేషం? ఎప్పటికీ వాళ్ళు నిజం గ్రహించరేం?

ఇలా ఒకొక్కక్కరే పోతూంటే చివరికి ఎవరు మిగులుతారు?

జానకి అనుకున్నట్టే హరగోపాల్ మరణ వార్త పేపర్లో వచ్చింది. అది జరిగిన మర్నాడే మిగిలిన ముగ్గురు మిత్రులూ జానకి యింటికి వచ్చారు.

"సందేహం లేదు. ఇది నిజంగా హత్యాకాండే! కానీ హత్య ఎలా జరుగుతోందో తెలియదు. హంతకుడెవరో తెలియదు. ఎందుకు జరుగుతోందో తెలియదు. ఈ విషయంలో మీకు చాలా వివరాలు తెలుసును. ఇంక మీదనైనా ఈ హత్యాకాండ ఆపడానికి మీకు తోచిన ఉపాయం చెప్పండి!" అన్నాడు నరహరి.

"మీ ముగ్గురిలో ఒకరికి తప్పకుండా మళ్ళీ ఏదో గొప్ప గుర్తింపు లభిస్తుంది. అప్పుడు పార్టీ చెయ్యడం మానేయండి—" అంది జానకి.

"బ్రతికున్నంత కాలం ఇలా పార్టీలు చెయ్యాలనీ, బ్రతికుండకపోయినా మాలో మాకు ఆహ్వానాలు పంపుకోవాలనీ నియమం పెట్టుకున్నాం. ఇప్పటికి అయిదుగురు పోయారు. మిగతా ముగ్గురం మాత్రం ఈ పద్ధతి ఎందుకు మానాలి? హంతకుడు మమ్మల్ని చంపదల్చుకుంటే ఎలాగూ చంపుతాడు. వాడికి భయపడి ఈ పార్టీలు మానడం నాకిష్టం లేదు...." అన్నాడు నరహరి.

మిగతా యిద్దరూ అతడితో ఏకీభవించారు.

"చార్మినార్ సిగరెట్లు కూడా పరీక్ష చేయించాం. పార్టీకని తెచ్చిన సిగరెట్లు మార్పిడీ చేశాం. అవి ఫ్యాక్టరీలో కూలీలకిచ్చాం తాగమని. వాళ్ళు తాగి నిక్షేపంగా వున్నారు. మేము చేసిన మార్పిడీ విషయం వారగోపాల్‌కు తెలియదు — మేమిచ్చిన సిగరెట్లలో ఒకటి తాగి అతను చనిపోయాడు. అతని మరణానికి సిగరెట్ కారణమని నేననుకోను—" అన్నాడు నరహరి.

"మీ పరిస్థితి చూస్తే నాకు జాలిగా వుంది. ఇందులో నేను చేయగలిగిన సాయమేముంది?" అంది జానకి.

"ఇంతవరకూ మా పార్టీకి మా స్నేహితులం మాత్రమే వస్తున్నాం. ఇంకమీదట మిత్రులకు ప్రతినిధులుగా మిత్రుల భార్యలను కూడా ఆహ్వానించాలనుకుంటున్నాం. దీనికి మీరేమంటారు?" అన్నాడు నరహరి.

జానకి మొహం యెర్రబడింది — "ఇందులో నేననేదేమీ లేదు. అది మన సంప్రదాయానికి విరుద్ధం—" అంది.

ఆమె ముఖకవళికలు గమనించిన నరిహరి—"అయాం సారీ-ఈ విషయమై మీరు అన్యథా భావించినట్లున్నారు. పార్టీకి కొత్త మనుషులు వస్తే హంతకుడి ప్రవర్తన ఎలా గుంటుందీ చూడాలనుంది. మీలాంటివారు వస్తే హంతకుడు బయట పడతాడని మా ఆశ!" అన్నాడు.

"ఈ విషయంలో నేను మీకు సాయపడలేను—" అంది జానకి.

"నిర్ణయం తీసుకునేందుకు తొందరేముంది? మేమెలాగూ మీ భర్త పేరున ఆహ్వానం పంపిస్తాం. ఆయన ప్రతినిధిగా వచ్చే హక్కు మీకు ఎప్పుడూ వున్నది.

మీకు వీలుపడితేనే రండి!" అన్నాడు నరహరి.

తర్వాత ముగ్గురు మిత్రులూ అక్కణ్ణించి బయట పడ్డారు.

"నువ్వు తొందరపడ్డావు. ఆమె అపార్థం చేసుకునే అవకాశముంది—" అన్నాడు శ్రీనివాసరావు. రమేష్ అతడి మాటను బలపరిచాడు.

"అపార్థం చేసుకోవాలనే అన్నాను—" అన్నాడు నరహరి.

"అంటే?" అన్నాడు రమేష్.

"నాకు జానకి మీద చాలా అనుమానంగా వుంది. ఆమెకు హంతకుడు తెలుసని నా అనుమానం" అన్నాడు నరహరి.

"నాకర్థం కాలేదు—" అన్నాడు రమేష్. శ్రీనివాసరావు ఆలోచిస్తున్నాడు.

"హంతకుడు మన ఎనమండుగురికీ బద్ధ శత్రువు. కానీ జానకి అంటే అతడి కిష్టం. ముందు గోవిందయ్యను చంపేశాడు. అందువల్ల జానికికి లాభమే చేకూరివుండాలి. అయితే హంతకుడు ఆ తర్వాత మనలో ఒక్కొక్కరినే చంపాలనుకున్నాడు. అది జానకికిష్టంలేదు. ఆమె అతణ్ణి వారించింది. అతడు వినలేదు. విధిలేక ఏదో కథ కల్పించి మనకు చెప్పింది. మనని హెచ్చరిస్తోంది. మనం జాగ్రత్తలో వుంటామని ఆమె ఆశ. జానకి మనసు మంచిది. ఆమె మనతోపాటు పార్టీలో వున్నదంటే హంతకుడు పని కష్టమవుతుంది. అందుకనే ఆమెను ఆహ్వానించాను—" అన్నాడు నరహరి.

"కానీ ఆమె రాదు—" అన్నాడు శ్రీనివాసరావు.

"జానకిని బయటపెట్టడానికి నేనింకో రిస్కు తీసుకో

దలిచాను—" అన్నాడు నరహరి. చెప్పడానికి సంకోచిస్తున్నట్లు అతడి ముఖం చెబుతోంది.

"ఏమిటది?" ఆత్రుతగా అడిగారు మిగతా ఇద్దరూ.

"మీరు నన్ను తప్పు పట్టకూడదు—" అన్నాడు నరహరి.

"ముందు చెప్పు!" అన్నాడు శ్రీనివాసరావు.

"నేను జానకికి ప్రేమ లేఖ వ్రాస్తాను—" అన్నాడు నరహరి.

రమేష్, శ్రీనివాసరావు మారాలోచించకుండా నరహరిని తిట్టారు—"ఆమె మన స్నేహితుడి భార్య. అందులోనూ స్నేహితుడిప్పుడు జీవించిలేడు. ఆమెకు రక్షణగా నిలవాల్సిందిపోయి కబళించడమా—ఛీ..ఛీ.."

"ఆవేశపడకండి బాబులూ—" అన్నాడు నరహరి—"జానకి స్నేహితుడి భార్య. కాదనను. స్నేహితుడిప్పుడు జీవించిలేడు. కాదనను. కానీ ఆమె కూడా ఆడది. ఆమెలో ఇంకా కోరికలు మిగిలే వున్నాయి. ఆమెను నేను కోరితే—అదామెకు సహాయం చేయడమే అవుతుంది కానీ కబళించడం అనిపించుకోదు. అదలాగుంచండి. నేనిలాగంటే మీరే యింత ఆవేశపడ్డారు కదా—హంతకుడింకెంత ఆవేశపడతాడు. అతడు నన్నే చంపాలనుకుంటాడు. పార్టీ చేసేదాకా ఆగలేడు. ఆ విధంగా నేను రిస్కు తీసుకుంటున్నాను.

"హంతకుడు తెలివైనవాడు. తెగించినవాడు. నన్ను చంపాలనుకుంటే తెలివిగా చంపగలడు. అయినా నేను రిస్కు తీసుకుంటున్నాను. ఈ ప్రయత్నంలో హంతకుడు పట్టుబడ్డాడా సరేసరి! లేని పక్షంలో మీకు జానకిలో ఏదో రహస్యమున్నదని తెలుస్తుంది. నేను పోయినా మీ

ఇద్దరికి రక్షణ్ణ కలుగుతుంది—"

"ఒక వేళ నువ్వనుకున్నట్లు జరక్కపోతే? జానకి నీ ప్రేమ నంగీకరిస్తే?" శ్రీనివాసరావు అనుమానంగా అన్నాడు.

"అందువల్ల నష్టమేముంది? జానకి నా భార్యకంటే అందమైనది. అది నా అదృష్టంగా భావిస్తాను—...." అన్నాడు నరహరి.

"అయితే రిస్కు నే నే తీసుకుంటాను—" అన్నాడు శ్రీనివాసరావు.

"వెర్రివాడా—రెండోది జరిగే పనికాదు. అనవసరంగా నీ ప్రాణం పణం పెట్టకు. రిస్కు నన్నే తీసుకోనీ!" అన్నాడు నరహరి.

శ్రీనివాసరావు మాట్లాడలేదు. అతను నరహరిని పరీక్షించి చూశాడు. అతడి ముఖంలో పట్టుదల కనబడుతోంది. ఏమనుకున్నాడో శ్రీనివాసరావు వెంటనే— "సరే—నువ్వే రాయి—" అన్నాడు.

అప్పుడు నరహరి — "ఒకవేళ నామీద హత్యా ప్రయత్నం జరక్కపోవచ్చు. జానకి నా ఉత్తరం చదివి మండిపడొచ్చు—అప్పుడు నా మనసులోని అసలు అభిప్రాయమేమిటో మీ రామెకు చెప్పి నా పరువు కాపాడాలి. అందుకు సాక్ష్యంగా వుంటారనే ముందుగా మీకిదంతా చెబుతున్నాను—" అన్నాడు.

## 9

జానకి ఆ ఉత్తరాన్ని చదువుకుంది. ముందామె కళ్ళు ఎర్రబడ్డాయి. తర్వాత వళ్ళంతా ఆవేశంతో వణికింది.

"బ్రూట్!" అన్న పదం అప్రయత్నంగా ఆమె నోటినుంచి బయటకు వచ్చింది. తర్వాత ఉత్తరం ఆమె

చేతిలో కసిగా నలిగింది.

కొద్ది క్షణాలు గడిచేసరికి ఆమె ఆవేశం తగ్గింది. నెమ్మదిగా నరహరి గురించి ఆలోచించసాగింది. పార్టీకి రమ్మన్నప్పుడే అతడి పాడుబుద్ధి కొంతవరకూ అర్ధమయింది. కానీ మరీ యింతకు తెగిస్తాడని అనుకోలేదు. ఎంత ధైర్యం అతగాడికి! స్నేహితుడి భార్య అన్న గౌరవమైనా లేకుండా తనకిలాంటి నీచమైన ఉత్తరం రాశాడు!

వీళ్ళ బుద్ధులు మరీ యింత నీచమైనవి కాబట్టే ఓ హంతకుడు వీరిమీద పగబట్టాడు. వారికి తగిన శాస్తే జరుగుతోంది. అసలు తను ఈ వ్యవహారంలో జోక్యం చేసుకోకుండా వుండాల్సింది. తన భర్త మరణించడమూ, ఆ తర్వాత ఒక్కొక్కరే అదే పరిస్థితుల్లో మరణించడమూ చూసి ఊరుకోలేకపోయింది. వారికి సాయం చేద్దామనుకుంది. ఇప్పుడేం చేయాలి?

జానకి ఉత్తరం మళ్ళీ సాపుచేసి మరోసారి చదివింది. మళ్ళీ ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి. మళ్ళీ ఉత్తరం నలిగింది.

తర్వాత జానకి రోజూ పేపరు చూస్తూండేది. ఒక రోజు ఆమె కోరిన వార్త పేపర్లో కనబడింది. నరహరి కాలేజీకి చేసిన సేవ ప్రభుత్వ స్థాయిలో గుర్తించ బడింది. అతడు ప్రిన్సిపాలుగా వున్న కాలేజీ దేశానికే ఆదర్శంగా వున్నదట!

"నరహరీ__నీ పని అయిపోయింది_" అనుకుంది జానకి. ఈ పర్యాయం అతడిపై ఆమెకు ఏ మాత్రమూ జాలికలుగలేదు.

నరహరి నుంచి పార్టీకి ఆహ్వానం గోవిందయ్య పేరున కూడా వచ్చింది. జానకి ఆ ఆహ్వానాన్ని ఓ మూలగా

పెట్టింది.

ఈ పార్టీకి నరహరి తనను భర్తకు ప్రతినిధిగా రమ్మన మన్నాడు. ముందు స్నేహితులు—తర్వాతనే భార్య— అనేవాడు గోవిందయ్య. అటువంటి గోవిందయ్య స్నేహితుడు నరహరి గోవిందయ్య స్థానంలో అతడి భార్యను రమ్మన్నాడు.

"తగిన శాస్తి జరుగుతుందిలే!" అనుకుంది జానకి.

ఆమె అనుకున్నట్లే తగిన శాస్తి జరిగింది. అంతవరకూ పోయిన వారందరికీ లాగే నరహరి కూడా చని పోయాడు.

నరహరి చనిపోయిన నాలుగు రోజులకు రమేష్, శ్రీనివాసరావు కలిసి జానకి యింటికి వచ్చారు.

"మీరు పదేపదే మా యింటికి రావద్దు—" నిర్మొహ మాటంగా అన్నది జానకి.

శ్రీనివాసరావుగానీ రమేష్‌గానీ చిన్నబుచ్చుకోలేదు. "ఒక ముఖ్య విశేషం చెప్పడానికి మీ యింటికి వచ్చాం. హంతకుడి ఆచూకీ దొరింది—" అన్నాడు రమేష్.

జానకి ఆశ్చర్యంగా — "ఎలా దొరికింది?" అంది.

"చనిపోయిన నరహరి అందుకు ఎంతో సాయ పడ్డాడు—" అన్నాడు రమేష్.

"మీ స్నేహితులు పరమ దుర్మార్గులు. గోముఖ వ్యాఘ్రాలు. పయోముఖ విషకుంభాలు. ఆ హంతకుడెవరో గానీ అతణ్ని నేనభినందిస్తున్నాను—" అంది జానకి.

"అయితే హంతకుడెవరో మీకు తెలుసుకోవాలని లేదా?" అన్నాడు రమేష్.

"ఎవరో చెప్పండి. అతణ్ని నేను కూడా స్వయంగా కలుసుకుని అభినందించాలి కదా!" అంది జానకి,

"హంతకుడి క్లూ మీ యింట్లోనే వుంది. మీ వారి సౌండ్ ప్రూఫ్ బెడ్‌రూంలో వుంది—" అన్నాడు శ్రీనివాసరావు.

"ఏమిటా క్లూ!" అంది జానకి.

"మీకు చూపిస్తాను. అదాయన బెడ్డులో వుంది—" అన్నాడు శ్రీనివాసరావు.

"పదండి—" అంది జానకి.

ముందు శ్రీనివాసరావు, వెనుక జానకి, ఆ వెనుక రమేష్ నడిచి బెడ్‌రూం చేరుకున్నారు. రమేష్ తలుపు దగ్గర ఆగిపోయాడు. శ్రీనివాసరావు మంచందాకా వెళ్ళాడు. జానకి అతణ్ని అనుసరించింది.

శ్రీనివాసరావు ఓ పర్యాయం మంచం దగ్గర దిండు ఎత్తాడు. ఆ తర్వాత డన్‌లప్ పరుపు ఎత్తాడు. అప్పుడు గది తలుపు మూసుకున్న చప్పుడు విని వెనక్కు తిరిగింది జానకి. రమేష్ అప్పుడే తలుపు లాక్ చేశాడు.

"ఏమిటిది?" అరిచింది జానకి.

"ఇది సౌండ్ ప్రూఫ్ గది!" గుర్తుచేశాడు శ్రీనివాసరావు.

"ఏమిటి మీ ఉద్దేశం?" అంది జానకి తీవ్రంగా.

"క్లూ ఈ గదిలో ఉందన్నానుగా-అది అబద్ధంకాదు. క్లూ ఇప్పుడీ గదిలోనే నా ఎదురుగా వుంది. చెప్పు—హంతకుడెవరు?" అన్నాడు శ్రీనివాసరావు.

"హంతకుడెవరో నాకెలా తెలుస్తుంది?" అరిచింది జానకి.

"తెలుస్తుంది. ఎందుకంటే హంతకుణ్ని నువ్వే నియమించావు కాబట్టి!" అన్నాడు శ్రీనివాసరావు కర్కశంగా నవ్వుతూ.

"హంతకుణ్ని నేను నియమించడమేమిటి? మీ కేమైనా మతిపోయిందా?" అంది జానకి. ఆమె వాళ్ళిద్దరి వంకా బెదురు చూపులు చూస్తోంది.

"మొట్టమొదటిసారిగా నిన్ను నరహరి అనుమానించాడు. నిన్ను పట్టివ్వడం కోసం తన ప్రాణాలే బలి పెట్టాడు—" అంటూ శ్రీనివాసరావు తమ పథకమంతా వివరించాడు.

"అయ్యో — ఇదంతా నాకు తెలీదు. నరహరి నిజంగా నే పశువాంఛతో వున్నాడనుకున్నాను—" అంది జానకి.

"అనుకునే హంతకుణ్ని అతడి మీదకు పురమాయించావు!"

"లేదు. హత్యల గురించి నాకేమీ తెలియదు—" అంది జానకి.

"పోలీసులు నేరసులచేత నిజం చెప్పడానికి కొన్ని పద్ధతులెన్నుకుంటారు. ఆ పద్ధతులమలు చేయడానికి కర్కశ హృదయముండాలి. మేము నీచేత నిజం చెప్పించడానికి అలాంటి కర్కశ హృదయం కలిగి వుండనవసరం లేదు. రసిక హృదయముంటే చాలు. ఏమంటావ్?" అంటూ శ్రీనివాసరావు ఆమె చేయి పట్టుకున్నాడు. ఆమె విదిలించుకోబోతూండగా రమేష్ ఆమె రెండో చేయి పట్టుకున్నాడు.

"మీ యింట్లో నీ గదిలో నిన్ను బలవంతం చేయబోతున్నాం—మాకు నీమీద మోజులేదు. మా మనసులో కానీ శరీరం కానీ నిన్ను కోరడం లేదు. ప్రాణానికి ప్రాణంగా వున్న ఎనమండుగురు స్నేహితుల ప్రాణాలను ఒకటొకటిగా పుచ్చుకున్న నేరానికి—స్త్రీకి ప్రాణం

కంటే విలువైనదనే మానాన్ని నీనుండి హరించ బోతున్నాం. అందుకు కొన్ని క్షణాలు మాత్రం గడు విస్తున్నాం. ఆలోచించుకో. హంతకుడెవరో చెప్పి నీ మర్యాద దక్కించుకో. మానం కాపాడుకో లేదా— తగిన శాస్తి జరుగుతుంది....” అన్నాడు శ్రీనివాసరావు.

“నిజంగా నాకేమీ తెలియదు....” అంది జానకి.

శ్రీనివాసరావు అంకెలు లెక్కపెట్టడం మొదలు పెట్టాడు. సరిగ్గా పది అంకెలు ఆమెకు గడువిచ్చాడు.

జానకి తనకేమీ తెలియదని వేడుకుంటోంది.

శ్రీనివాసరావు అంకెలు లెక్కపెడుతున్నాడు.... తొమ్మిది....పది....

రమేష్ జానకిని మంచంమీదకు లాగాడు.

ఇద్దరు పురుషులు....ఒక అతివ....

సౌండ్ ప్రూఫ్ గది....

తన యింట్లో తనపైనే దురాచారం ...జానకికి మతి పోతోంది.

“ఏమిటీ దురాగతం?....” ఆమె ఎంత అరిచినా గిలగిలా కొట్టుకున్నా ప్రయోజనం కనబడ్డంలేదు. వాళ్ళకు తను లొంగిపోతోంది.

వాళ్ళు తనను పూర్తిగా స్వాధీనపర్చుకుంటున్నారనీ- తను వారి దురాగతానికి లోబడిపోతున్నాననీ గ్రహించి నపుడు ఆఖరి ప్రయత్నంగా జానకి కెవ్వుమని కేక పెట్టింది—వంట్లోని శక్తినంతా కూడగట్టుకుని.

ఆ కేకకు శ్రీనివాసరావు, రమేష్ ఉలిక్కిపడి మంచానికి అటూ యిటూ పడ్డారు. ఆ కాస్త అవ కాశానికే త్వరత్వరగా బట్టలు సరిచేసుకుంది జానకి. అయితే శ్రీనివాసరావుగానీ, రమేష్‌గానీ లేవలేదు. తన

దగ్గరకు రాలేదు.

ఇప్పుడేం చేయాలి? త్వరగా లేచి పారిపోవాలా?

జానకి మంచం దిగింది. ఇటు పడివున్న శ్రీనివాసరావు కదలడంలేదు. జానకి పరుగున వెళ్ళి తలుపు తీసింది. మళ్ళీ తలుపులు వేసింది. త్వరగా ఫోన్ దగ్గరకు పరుగెత్తింది. పోలీసులకు ఫోన్ చేసింది.

పోలీసులు వచ్చి చూసి—రమేష్, శ్రీనివాసరావు—ఇద్దరూ మరణించినట్లు తేల్చారు. జానకి ఆశ్చర్యానికి అంతులేదు. పోలీసులకామె భర్త పేరున మొదటవచ్చిన ఉత్తరాన్ని నరహరి తనకు రాసిన ఉత్తరాన్ని మినహాయించి క్లుప్తంగా కధ చెప్పింది. పోలీసులామె వాఙ్మూలాన్ని రికార్డు చేసుకున్నారు.

పరిశోధనలో శ్రీనివాసరావు, రమేష్‌లది సహాజ మరణమేనని తేలింది. జానకికి ఏ శిక్షా పడలేదు. పోలీసులామె కథనాన్ని నమ్మారు. నమ్మక వారు చేసేదీ లేదు. ఈ ఎనిమిది చావుల గురించీ పత్రికలన్నీ పెద్ద విశేషంగా రాశాయి.

# 10

ఈ రెండు చావులూ జరిగిన వారం రోజులకు జానకి రాత్రిపూట సరిగ్గా నిద్రపట్టక — భర్త ప్రత్యేకంగా వుంచుకునే గదివైపు నడిచింది. గదిలో ఏదో కలకలంగా వున్నట్లనిపించిందామెకు.

చటుక్కున తెర ఒత్తిగించి గదిలోకి తొంగిచూసింది. వెంటనే ఆమె గుండె గుభేలుమంది. నోట మాటరాలేదు.

అక్కడ ఓ పెద్ద టేబులు చుట్టూ ఎనిమిది కుర్చీల లోనూ ఎనమండుగురు. వాళ్ళు వరుసగా గోవిందయ్య, చంద్రశేఖరం, వీరేశం, మోహానరావు, హరగోపాల్,

నరహరి, రమేష్, శ్రీనివాసరావులు.

జానకి అక్కడికి వచ్చేటప్పటికి గోవిందయ్య గొంతు సవరించుకుని-"మన వీరేశం తమాషాకి బెదిరింపు ఉత్తరం ఒకటి రాశాడు. అది చూడగానే నా గుండె ఆగిపోయింది. చచ్చినంతమాత్రాన మీ స్నేహాన్నెలా వదులుకోగలను? ఒక్కొక్కళ్ళనే నా దగ్గరకు రప్పించుకున్నాను.

మధ్యలో జానకి నా ప్రయత్నాలకు అంతరాయం కలిగించబోయింది. ఆయా మనుషులకు నేనావహించి ఆ ఇబ్బందులు తొలగించుకున్నాను. మోహనరావు భార్య లక్ష్మిని నేనావహించి దస్తూరీ విషయంలో నా భార్యను గజిబిజి చేశాను. చనిపోయేముందు మన స్నేహితులందరికీ గొప్ప గుర్తింపు కలిగించడం కోసం దేశంలోని ప్రముఖ వ్యక్తుల నావహించాను.

మన రమేష్ శ్రీనివాసరావు తొందరపడ్డారు కానీ వాళ్ళకు కూడా దేశంలో మంచి గుర్తింపు లభించినాకనే మరణించి వుండేవారు. చూస్తూ చూస్తూ నా భార్యకు అన్యాయం జరగనిస్తానా? వాళ్ళను కూడా మన దగ్గరకు వెంటనే తీసుకురాక తప్పలేదు. ఇప్పుడు మళ్ళీ మనం ఎనమండుగురం పూర్వంవలెనే కలిసి ఒకే రకం జీవితం అనుభవించవచ్చు—...." అన్నాడు.

"మరి మన కుటుంబాల సంగతి?" అన్నాడు వీరేశం.

"ముందు స్నేహం—తర్వాతనే కుటుంబం అన్నది మన సిద్ధాంతం. మీరు కావాలనుకుంటే మన భార్యలను కూడా తీసుకువద్దాం—" అన్నాడు గోవిందయ్య.

"పాపం-వారికి కూడా ఏదైనా గుర్తింపు లభించేలా చేద్దామా?" అన్నాను నరహరి.

"మీరంతా ఎలాగంటే అలాగే!" అన్నాడు గోవిందయ్య.

జానకి చటుక్కున అక్కణ్నించి పరుగెత్తింది. భయంతో ఆమెకు వళ్ళంతా చెమటలు పట్టింది. ఆమె చటుక్కున పనివాళ్ళుండే గదికి వెళ్ళి వాళ్ళను లేపింది. వాళ్లు మొత్తం ముగ్గురు. ముగ్గురూ లేచారు. జానకికి ముగ్గురు పిల్లలు. వాళ్ళ వయస్సులు పద్దెనిమిది, పదిహేను, పన్నెండు. జానకి వాళ్ళను కూడా లేపింది. తను ఆ గదిలో భర్తతోపాటు చచ్చిపోయిన ఎనమండుగురినీ చూసిన విషయం చెప్పింది.

అంతా అప్పటికప్పుడు ఆ గదిలోకి పరుగెత్తారు. అక్కడ వాళ్ళకేమీ కనిపించలేదు. అప్పుడు జానకి కూడా అక్కడికి వెళ్ళింది. ఆమెకూ ఏమీ కనబడలేదు.

మర్నాడుదయానికి జానకికి వళ్ళు తెలియని జ్వరం వచ్చింది. డాక్టర్ రాగానే పిల్లలాయనకు జరిగింది చెప్పారు. డాక్టరు ఆమెకు ఇంజక్షన్ చేసి ఆమెకు కాస్త తగ్గగానే ఎవరైనా సైకియాట్రిస్టును సంప్రదించడం మంచిదన్నాడు.

నాలుగు రోజుల్లో జానకి కోలుకుంది. సైకియాట్రిస్టు ఆమె యింటికి వచ్చాడు. ఆయన ఆమె చెప్పిందంతా విని—"దెయ్యాలనేవి లేవు. అదంతా మనం కల్పించుకున్న భ్రమ. నువ్వు కూడా అలాంటి భ్రమకేలోనయ్యావు—" అన్నాడు.

"నేను స్పష్టంగా మనుషుల్ని చూశాను. వాళ్ళ మాటలు విన్నాను—అది భ్రమ అని ఎలా అనుకునేది?" అంది జానకి.

"చూడమ్మా! ఆ ఎనమండుగురు స్నేహితుల మనసులూ

విచిత్రమైనవి. పార్టీలో నీ భర్త గోవిందయ్య పోగానే ఏ మూలనో వున్న స్నేహబలం మెదడుమీద విచిత్రంగా తన ప్రభావం చూపించి మిగతావారొక్కొక్కరే మరణించారు. ఒక స్నేహితుడు పోగానే మిగిలిన వారందరికీ ఏ మూలనో మరణవాంఛ ప్రారంభమై జీవితేచ్ఛ నశించింది. అందుకే వారు వరుసగా పార్టీలు చేయడం మానలేదు. చావుకు కూడా భయపడలేదు.

ఇది చాలా విచిత్రమైన కేసు. ఇందులోని మొత్తం రహస్యాన్ని సాధించాలంటే ఎవరికీ సాధ్యంకాక పోవచ్చు. నీ మనసులోనూ ఆ రహస్యం తెలుసుకోవాలన్న కోరిక అంతర్గతంగా వున్నది. నీ కోరిక బలం ఆ భ్రమను సృష్టించింది. నువ్వు చూసేననుకుంటున్నదంతా నీ ఆలోచనా శక్తి ప్రభావం తప్పితే నువ్వేమీ చూడలేదు. ఒక సమస్యకు పరిష్కారం దొరకనప్పుడు మనిషి అతీంద్రియ శక్తులకు అంటగడతాడు. అదే నువ్వూ చేశావు—" అన్నాడు సైకియాట్రిస్టు.

"అదే నిజమైతే—మరి వాళ్ళందరికీ పార్టీ చేయడానికి అనువుగా గుర్తింపులెలా లభించాయి?" అంది జానకి.

"ఏదో ఒక రోజున ఈ ప్రశ్నకు జవాబు చెప్పగలననుకుంటాను. ప్రస్తుతానికి మాత్రం దీనికి నేనేమీ చెప్పలేను—" అన్నాడు సైకియాట్రిస్టు.

జానకి క్రమంగా కోలుకుంది. సుమారు నెలరోజులు గడిచేక ఒక రోజున కొందరు రాజకీయ నాయకులామె యింటికి వచ్చేరు.

"మన పార్టీలో మహిళలు తక్కువగా వున్నారు. వున్నవారిలోనూ ప్రతిభావంతులు తక్కువగా వున్నారు. మీరు విద్యావంతులు. ప్రతిభావంతులు. మిమ్మల్ని రాష్ట్రా

స్థాయిలో పార్టీ కార్యదర్శిగా చేయాలని చాలామంది అభిప్రాయపడుతున్నారు—" అన్నాడో కాయన.

"పాపం—వారికి కూడా ఏదైనా గుర్తింపు లభించేలా చేద్దామా?" అన్న నరిహరి వెయ్యం మాటలు జానకి చెవుల్లో ప్రతిధ్వనించగా ఆమె కెవ్వున కేక పెట్టి—"నాకు పదవులు వద్దు. గుర్తింపు వద్దు. నాకింకా బ్రతకాలని వుంది—" అంది.

ఆమె మాటలకు అర్థం తెలియక వెర్రి ముఖం వేసుకుని చూశాడా రాజకీయనాయకుడు.

—:ఐ పో యిం ది:—

# నాలుగో చక్రం

## సికిందర్

లాల్ ఆ పంతొమ్మిదేళ్ళ ప్రవీల్ కుమార్ ని తదేకంగా చూస్తూ, సిగరెట్ నుసిని ఆష్ ట్రేలో రాల్చాడు.

"వెల్, ఏం కావాలి నీకు?"

"మీ సహాయం."

"ఏమైంది?"

"నా—నాకొ—క్కు, సార్—"

"మరెవరికి?"

"ఒక—ఒక—"

"అమ్మాయికి, అవునా?"

"అవునవును! మీకెలా తెలుసు, సార్?"

"నీ బుగ్గలు కందిపోవటం చూసి చెప్పాను" జాన్ అన్నాడు.

ప్రవీల్ బిడియపడ్డాడు. "కానీ — ఆమె నాకేమీ కాదు, సార్!"

"అయితే నువ్వెందుకొచ్చావ్?" అడిగాడు లాల్.

"మొదట్నుంచీ ఆమె మీద జాలిపడ్డాను సార్."

"మరిప్పుడేమైంది?"

"ఆమె అపాయంలో—ఎక్కడుందో—కన్పించటం లేదు, సార్!"

"ఆమె నీకేమీ కాదన్నావుగా, మర్చిపో!" అన్నాడు జాన్.

లాల్ చటుక్కున తల తిప్పి కసిగా చూశాడు.

జాన్ నాలిక కరచుకుని కిటికీ అవతల చూశాడు.

లాల్ చల్లబడుతూ ప్రసీల్ వైపు తిరిగాడు. "వెల్, నువ్విక వివరంగా చెప్పు, ప్రసీల్."

"సార్, మొదట్నుంచీ చెప్తున్నాను .... నిన్న ఆదివారం ఉదయం నేను మార్నింగ్ షోకెళ్ళాను. అది పాత సినిమా అవడంవల్ల జనం ఎక్కువలేరు. నేను వెళ్ళినవుడు బాల్కనీలో పదిమందికంటే లేరు. అందువల్ల చుట్టూ ఎవరూ లేని చోటు చూసుకుని కూర్చున్నాను. అప్పుడు ఆమె రావడం చూశాను. ఆమె ఎవరో నాకప్పుడు తెలీదు. కానీ నా గుండె జలదరించింది! ఆమె నేరుగా వచ్చి నా ప్రక్క సీట్లోనే కూర్చుంది. సినిమా మధ్యలో ఆమె చటుక్కున జరిగి నా చెయ్యి పట్టుకుంది సార్—"

"వెల్?"

"అలా పట్టుకొని—'నాకో సహాయం చేస్తారా?' అనడిగింది ఆందోళనగా. నాకర్థం గాలేదు. చెయ్యి విడిపించుకున్నాను. తనని సోదరిగా భావించి చిన్న సహాయం చేస్తారా అనడిగింది మళ్ళీ. అప్పటికి నేను సర్దుకున్నాను. అప్పుడు ప్రశాంతంగా ఏమిటని అడిగాను. చెప్పిందామె. అలా పరాయివాడైన నాతో చెప్పుకుం దంటే ఆమె ఎంత దుర్భరస్థితిలోవుందో గ్రహించవచ్చు.

తన ప్రేమలేఖలు ఒక దుర్మార్గుడి చేతిలో పడ్డాయట. అవి ఆమె ప్రేమించిన వ్యక్తికి రాసినవట. ఆమె ఏదో కాలేజిలో డిగ్రీ చదువుతున్నట్లు చెప్పింది .... అతనూ చదువుతున్నాడట. ఆ లేఖలు తమ ఇంట్లోంచి ఆ దుర్మార్గుడి చేతిలోకెలా పోయాయో అర్థం గాలేదట. నిన్న సాయంత్రమే వాడు కాలేజి దగ్గర బస్టాపులో కలిసి, అవి చూపించి వెయ్యి రూపాయలు డిమాండ్ చేశాడట. సార్, వాడి పేరు ఆచారియట."

"చెప్పు."

"వాడెక్కడుంటాడో కూడా ఆమెకు తెలుసునట. ఇవాళ సోమవారం సాయంత్రంకల్లా ఆ వెయ్యి రూపాయలు తెచ్చివ్వకపోతే, మర్నాడుదయం ఉత్తరాలు కాలేజిలో పంచిపెడ్తానన్నాడట."

"సార్, దురదృష్టవశాత్తూ ఆమె ప్రేమిస్తున్న వ్యక్తి ఊళ్ళో లేడు. స్వగ్రామం వెళ్ళాడట. వారందాకా రాడంది. ఉత్తరం రాసి అతనికి తెలియపర్చే వ్యవధి లేదు. వాడు చాలా తక్కువ గడువు పెట్టాడు. పెంచ నన్నాడట. ఆమె దగ్గర అంత డబ్బులేదు. ఇంట్లో అడగలేదు. బయట ఎవరూ ఇవ్వరు. నన్నూ డబ్బు సహాయం కోరలేదు. కానీ మరో రకంగా సాయపడ మంది."

"వెల్, ఏమిటది?"

ప్రసీల్ అన్నాడు, "ఆ దుర్మార్గుడు—ఆచారి దగ్గర్నుంచి ఉత్తరాలు తెచ్చుకోవాలంది. అదొక్కటే అప్పటి పరిస్థితిలో చేయదగింది. అందులో నన్ను తోడ్పడమంది. ఈ గండం తప్పిస్తే నాకేం కావాలన్నా ఇస్తానంది బహుమానం. ఆమె కథ విని ఉద్రేకపడ్డాను

సార్. సహాయానికి నేనెప్పుడూ రెడీయే! కానీ ప్రతి ఫలం కోసం కాదు. ఏమీ ఆశించను. మీలా నేను డబ్బు సంపాదన వృత్తిగా బ్రతికే డిటెక్టివ్‌ని కాను. నాకు సంపాదనే లేదు. నేను విద్యార్థిని. ప్రజాసేవయే నా ధ్యేయం. దేశాన్ని బాగుపర్చాలి. దేశంలో...."

"దేశం సంగతి తర్వాత ఆలోచిద్దాం, ముందు నీ సంగతి చెప్పు!"

"అలాగే, సార్. అప్పుడు వెంటనే ఆమె కోరికను అంగీకరించాను. ఆట మధ్యలో లేచివచ్చేశాం. క్యాంటీన్‌లో కూర్చుని వివరంగా మాట్లాడుకున్నాం. ఆమె చాలా తేలికపడిందప్పుడు... నన్ను చూసి గర్వ పడింది. తనకూ ఓ తమ్ముడున్నాడట. కానీ వాడికి నా అంత ఉత్సాహం, చురుకుదనమూ లేవంది.

ఆ బ్లాక్ మెయిలర్ అడ్రసు అడిగాను. ఆమె చెప్పింది, రాంనగర్‌లో వుంటాడు. ఆమె ఆ రోజే చాలా సాహసంగా వెంటాడి తెలుసుకుందట. ఆ ఉత్తరాలు ఇంట్లోనే వుండవచ్చని అంది. వాడెక్కువగా ఇంట్లో వుండడట. వీధిలో వాకబు చేసింది రహస్యంగా. అర్థరాత్రి దాటాక ఎప్పుడో వస్తాడట. ఇంట్లో ఒంటరిగా ఉంటున్నాడట.

"కాబట్టి బాగా చీకటయ్యాక రహస్యంగా వాడింటి కెళ్ళి, ఆ ఉత్తరాలు వెతికి పట్టుకొచ్చేయాలంది. నాకది బాగానే తోచింది. ఆమాత్రం నేను సాయపడగలను. తర్వాత చేయవల్సింది జాగ్రత్తగా ఆలోచించుకున్నాం. రాత్రి పదకొండు గంటలకి అంతా నిద్రపోయాక వెళ్ళాలని నిశ్చయించుకున్నాం.

"రాత్రి సరిగ్గా పదిగంటలకి అదే థియేటర్ దగ్గరికెళ్ళి,

అక్కడ ఎదురుచూస్తున్న ఆమెతో ఆటో ఎక్కాను. ఆటో బయల్దేరింది. ఆమె బ్యాగు పట్టుకొని నిశ్శబ్దంగా ఆలోచిస్తూ కూర్చుంది. నేనూ మౌనంగా కూర్చున్నాను. రాంనగర్ ఆచారి ఇల్లున్న వీధిలో దిగి ఆటోని పంపించేశాం. అప్పుడు కాస్సేపు అక్కడే నిలబడి అటూ ఇటూ చూశాం. ఒక ఇంట్లోంచి ఎవరో బయటికొచ్చి మాముందునుంచి పట్టించుకోకుండా గబగబా సాగిపోయాడు.

"ఆ వీధిలో మొత్తానికీ ఒకటే లైటు స్తంభంవుంది. ఆచారి ఇంటిముందు చీకటిగా వుంది. మేం వేగంగా నడిచివెళ్ళి గుమ్మంలో నిలబడి చూశాం. ఇంటికి తాళం వుంది. ఆలస్యం చేయకుండా తలుపు దగ్గరికెళ్ళి తాళాన్ని పరిశీలించాం. ఆమె పెన్ టార్చితీసి వెలిగించింది.

"అయిదు నిమిషాల్లో కష్టపడి తాళం తీసేసి తలుపు తెరిచాం. లోపల రెండు గదులకీ తాళాలు లేవు. మధ్య గదిలో మూడు ట్రంకు పెట్టెలున్నాయి. వాటిలో ఒక్కొక్కదానికీ తాళం వేసివుంది. మూడు నిమిషాల్లో దాన్ని కూడా తెరిచేసి మూతలేపాం. లోపల బట్టలూ, చాలా కాగితాలూ ఉన్నాయి. అందులో ఉత్తరాల్లేవు. నేను ఒక్కో కాగితం తీసి చూస్తున్నాను, అవన్నీ ఏవో రసీదులు. ఆమె పొడవాటి కవరొకటి తీసి అందులో కాగితాల్ని చూడసాగింది శ్రద్ధగా, టార్చి వెలుగులో—అప్పుడే సార్, అంతా అప్‌సెటయింది!"

"ఏమైంది?"

"ఆచారి ఊడిపడ్డాడు, సార్! గుమ్మడికాయలా దొర్లుకుంటూ వచ్చి, 'ఎవరు మీరు! ఎవరు మీరు!' అన్నాడు. అది మేం ఊహించలేదు. ఎలా వచ్చాడో మా అంచనా

ఎక్కడ తప్పిందో అర్థంగావటం లేదు. నా రక్తం గడ్డకట్టుకు పోయింది. ఇక అయిపోయిందనుకున్నాను మా పని.

"కానీ సాక్, ఆమె మెరుపులా చెయ్యి ముందుకు విసిరి అతని పొట్టలో గుద్దింది. దాంతో ఏదో అరుస్తూ ముందుకొచ్చిన ఆచారి మెలికలు తిరిగి కిందపడ్డాడు దబ్బుమని. నేను తేరుకొని లాగిపెట్టి డొక్కలో తన్నాను! దొర్లుకుంటూ వెళ్ళి దేనికో కొట్టుకున్నాడు! మేం దాడుతీశాం అక్కణ్ణుంచి! కాలి సత్తువకొద్దీ ఉరికాం వీధిలోకి! అదృష్టంకొద్దీ బయట ఎవరూ లేరు. ఆగకుండా మెయిన్ రోడ్డు వరకూ పరుగెత్తి వెనక్కి తిరిగి చూశాం. ఆచారి రావటం లేదు! ఆ దెబ్బలకి ఏమయ్యాడో! వెంటనే వీలయినంత నిదానంగా రిక్షా ఆపి అందులో ఎక్కి త్వరగా పోనివ్వమన్నాం.

"చార్మినార్ క్రాస్ రోడ్స్‌లో దిగిపోయి, అప్పుడే ఇంటర్వెల్‌కు బయటకొచ్చిన సంధ్య థియేటర్ జనంలో కలిసిపోయాం. ఆచారి మా వెనక రానే లేదు. కాస్సేపు చూసి ఏం చేయాలో ఆలోచించాం. ఆమె విపరీతంగా భయపడిపోయింది. ఆ ఉత్తరాలు దొరకలేదు. పైగా ఆమె ప్రయత్నం వాడికి తెలిసిపోయింది! ఆ కోపంలో ఉత్తరాల్ని బయటపెట్టేయవచ్చు!

"ఆమె ఇంటికెళ్ళనందిక! వాడికామె ఇల్లు తెలిసి వుంటే వెంటనే వెళ్తాడు. వాడ్ని ఎదుర్కోలేనందిప్పుడు! ఎక్కడైనా తలదాచుకుంటానంది ఆ రాత్రి. సినిమాకెళ్తున్నట్టు ఇంట్లో చెప్పివచ్చిందట. సినిమా చూసి ఫ్రెండ్ ఇంట్లో పడుకున్నట్లు ఉదయం వెళ్ళి చెప్తానంది. కానీ రాత్రి ఉండేదెక్కడ? ఏ ఫ్రెండ్ ఇంటికెళ్ళినా అనుమానిస్తారు.

"అందుకని ఆ రాత్రి హోటల్‌లో ఉంటానంది, సార్. అయితే కూడా నేనూ ఉంటానన్నాను. ఇద్దరం బయల్దేరాం. నాంపల్లిలో జెట్ హోటల్‌లోకెళ్ళి గది అడిగాం. వాళ్ళేదో అనుమానించారు. మేం అక్కా తమ్ముళ్ళమని చెప్పుకున్నాం. వాళ్ళు పోలికల్లేవు పొమ్మన్నారు. ఎంతకీ ఒప్పుకోలేదు. చివరికి నేను ఆమెనే ఒంటరగా ఉండమని చెప్పి ఇంటికెళ్తానన్నాను. ఆమె అయిష్టంగానే అంగీకరించింది. ఆచారి అక్కడికొచ్చే ప్రమాదం లేదు. కాబట్టి నిర్భయంగా ఉండమన్నాను. తిరిగి ఉదయం వస్తానని చెప్పి వెళ్ళిపోయాను.

"అంతే, సార్. అక్కడ్నుంచి తిన్నగా మా యింటికొచ్చేశాను. ఇంకా నా భయం పోలేదు. ఉదయం ఆమెని కలుసుకున్నప్పుడు ఆచారిని ఎదుర్కొనే ఉపాయం ఆలోచించాలనుకున్నాను. అంత రాత్రి ఇంటికి రావటం చూసి డాడీ నిలదీశారు. ఆయన మేల్కొనే ఉన్నారు, ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతూ. నేనేదో కారణం చెప్పి తప్పించుకున్నాను.

"రాత్రంతా నిద్రపట్టలేదు. తెల్లవారుతోండగానే ఆమెకు ఫోన్ చేసేశాను. కానీ ఆమెనుంచి రెస్పాన్స్ లేదంది ఆపరేటర్. ఇంకా నిద్రలేవలేదేమో అనుకున్నాను. గంట ఆగి మళ్ళీ చేసినా రెస్పాన్స్ లేదు! మూడోసారి ఎనిమిది గంటలకీ అలాగే జరగడంతో ఇక వుండలేక పోయాను. ఆమె గదిలో ఏం చేస్తోందో చూడమని వత్తిడిచేశాను. వాళ్ళు చూసి ఆమె గదిలో లేదన్నారు."

"మరి?"

"ఏమో సార్, నాకర్థం గాలేదు. ఎక్కడికెళ్తుంది? వెళ్ళటం కూడా వాళ్ళు చూడలేదట! వెంటనే

అక్కడికి పరుగెత్తాను. హోటల్ వాళ్ళేమీ చెప్పలేక పోయారు. ఎవరికీ తెలియకుండా మాయమైంది, అంతే. ఎందుకు? ఆ అవసరం ఎందుకు వచ్చింది? మళ్ళీ ఏదైనా కొత్త ఆపద వచ్చిందా? ఆచారి ఆమెని కనుక్కున్నాడా? అసంభవం. ఆమె ఇంటికెళ్ళి పోయుంటే ఇల్లెక్కడో తెలీదు. కాలేజీ కూడా తెలీదు. అసలామె నాతో చెప్పకుండా మామూలు పరిస్థితిలో వెళ్ళదు. ఆమెకేదో జరిగింది—ఎవరో ఏదో చేశారు—ఈ ఆచారీయే చేసి వుంటాడు — కానీ ఆమె ఆచూకీ వాడెలా తెలుసుకున్నాడో—అర్థంగావటం లేదు!"

ప్రనీల్ క్షణం ఆగి, అన్నాడు. "ఏమీ తోచక ఇంటికొచ్చేశాను, సార్. ఈ సంగతి ఇంట్లోగానీ, బయటగానీ ఎవరికీ చెప్పలేదు. ఇంట్లో చెప్తే తిడతారు. డాడీ కట్టి పడేస్తాడు. బయట ఎవరికి చెప్పుకోవాలి? పోలీసులైతే చాలా గొడవవుతుంది. మీరు గుర్తొచ్చారు. మీ సహాయమే కోరాలని నిశ్చయించుకున్నాను. ఇక ఆలోచించకుండా బ్యాంకుకు వెళ్ళి డాడీ ఇవ్వగా అప్పుడు కొంతా అప్పుడు కొంతా దాచుకున్న డబ్బంతా పట్టుకొచ్చేశాను. అయిదువందల అరవైయేడు రూపాయలు—"

ప్రనీల్ జేబులోంచి కొన్ని వంద నోట్లూ, పది రూపాయల నోట్లూ తీసి లెక్కపెట్టి చెయ్యి ముందుకు చాచాడు.

"ఇది మీ ఫీజు, సార్. అయిదువందలయాభై. సరిపోతుందనుకుంటాను, ఇంకా కావాలన్నా ఇస్తాను. కానీ ఆమెని గాలించండి. ఎక్కడికెళ్ళిందో తెలుసుకోండి. ఆమె సరిగ్గా ఏమైందో తెలిసేవరకు స్థిమితపడలేను."

లాల్ నవ్వుతూ చూశాడు అతన్ని. "ఆ డబ్బు ఉంచుకో, ప్రసీల్. నీ పాకెట్ మనీ ఇలా ఖర్చుపెట్టకు. నువ్వు సంపాదించినప్పుడు మాకు ఫీజు పంపు."

ప్రసీల్ కలవరంగా చూశాడు.

"మేం ఆమె జాడ తెలుసుకుంటాం" అన్నాడు లాల్, "ఫీజు గురించి నువ్వు బెంగపడకు. ఆమె పేరు నువ్వు చెప్పనేలేదు."

"ఓహ్, జయ—సార్" ప్రసీల్ అన్నాడు, డబ్బుని సంకోచంగా చూస్తూ.

"అవి జేబులో పెట్టుకో" అన్నాడు లాల్ మళ్ళీ. "ఆమె బాయ్ ఫ్రెండ్ వివరాలు కూడా చెప్పలేదా?"

"లేదు, పేరు కూడా చెప్పలేదు."

"మిమ్మల్ని ఆచారి పోల్చుకొని వుంటాడా?"

"లేదు, అప్పుడు చీకటి. ఆమె గుద్దినపుడు ఆమెని జయగా ఊహించి వుంటాడేమో, నన్నుగుర్తించినా నేనెవరో అతనికి తెలీదు."

"పద, వెళ్దాం."

"ఎక్కడికి?"

"ఆచారివద్దకి."

ప్రసీల్ అయోమయంగా చూశాడు.

లాల్, జాన్ వైపు తిరిగాడు. "పార్టనర్, కేసు విన్నావు. ఇక బీటు కెళ్ళు. జెట్ హోటల్ లో మిస్టరీ తెలుసుకో!"

"ఓ.కే, సర్."

లాల్ లేచి ప్రసీల్ ని చూశాడు. "కమాన్ ప్రసీల్ నాతో రా!"

# 2

రాంనగర్‌లో ఆ ఇంటిముందు కారాపి లాల్ ప్రసీల్‌ని చూశాడు.

"ఇదే ఇల్లు, సార్" ప్రసీల్ అన్నాడు.

ఇద్దరూ దిగి ఆ ఇంటి గుమ్మంలోకెళ్ళారు. లాల్ తలుపు కొట్టిన నిమిషం తర్వాత అది చటుక్కున తెరుచుకుంది. ఒక యాభై ఏళ్ళ మనిషి కనిపించాడు. అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

"డిటెక్టివ్ లాల్!" అని అరిచాడతను ఉద్రేకంగా, "ఏమిటిలా వచ్చారు? ఎవరైనా అసిస్టెంట్ కోసం చూస్తున్నారా?"

లాల్ అతన్ని తేరిపార చూశాడు. "ఒక అమ్మాయి కోసం చూస్తున్నాను" అన్నాడతను.

ఆ మనిషి పగలబడి నవ్వాడు. "పోండి లాల్ జోక్ చేయకండి! అమ్మాయి మీకెందుకు? మీకు పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యం లేదని విన్నాను."

లాల్ కోపంగా చూశాడు. "జయ, ఆమె కావాలి. ఆమె నీకు తెలుసు, ఆచారీ."

అతను ఉలికిపాటుని వెంటనే కప్పి పుచ్చుకున్నాడు. బలహీనంగా నవ్వాడు.

"జయా? ఎవరామె? నాకెలా తెలుసు? నా పేరు మీకెలా తెలుసు?"

"నాకు నీ గురించి అంతా తెలుసు. జయ నీకు కొంత కాలంగా తెలుసు. రాత్రి ఇక్కడకొచ్చింది. ఇంకా సరిగ్గా గుర్తుచేయాలంటే నీ పాట్లలో గుద్దింది."

అతను ఊపిరి బిగబట్టాడు అప్పుడు ప్రసీల్‌ని చూసి.

"వెల్, అతను నీకు తెలుసు కదూ?" అన్నాడు

లాల్.

"ఎవరితను? ఏమిటి మీర నేది? నే నేం చేశాను?" అన్నాడు ఆచారి, ప్రసీల్ని శంకా ఆశ్చర్యంగా చూస్తూనే.

"ఆచారీ, నువ్వు బ్లాక్ మెయిలర్ వి" లాల్ అన్నాడు, "వెయ్యి రూపాయల కోసం ఆమెని వేధించావు. ఉత్తరాలు దొంగిలించి బెదిరించావు. ఆమె రాత్రి నువ్వు లేని సమయంలో ఇక్కడకొచ్చింది, ఈ ప్రసీల్ తో, ఆ ఉత్తరాలు కాజేయడానికి. కానీ మధ్యలో నువ్వు వచ్చావు. వాళ్ళు నిన్ను కొట్టి పారిపోయారు—"

"ప్లీజ్, లోపలికి రండి!" అన్నాడు ఆచారి దారి ఇస్తూ.

"దట్స్ గుడ్!" అన్నాడు లాల్ లోపలి కెళ్తూ. వెనుక ప్రసీల్ వెళ్ళాడు.

"మిస్టర్ లాల్, మీరు వింతగా మాట్లాడుతున్నారు. మర్యాదగల వాళ్ళమీద మీరిలాంటి ఆరోపణలు చెయ్యటం బాగుండదు. నేనిక్కడ గౌరవంగా బ్రతుకుతున్నాను. అడగండి ఎవరైనా నా బ్రతుకు ఎలాంటిదో? మీరు నన్ను నేరస్తునిలా చూస్తున్నారు. ఆ చూపులు మానండి. నా సలహా తీసుకోండి. మీమీద గౌరవంకొద్దీ సహించాను. ఇంకొకరు ఇలా మాట్లాడితే నే నేం—సరే—ఇక దయచేసి వెళ్ళిపోండి. ఆ అమ్మాయి ఎవరో, ఈ కుర్రాడెవరో, ఆ ఉత్తరాలేమిటో నాకేమీ తెలీదు, నిజంగా!"

లాల్ రివాల్వర్ తీశాడు, "నీకేమీ తెలీదా, ఆచారీ.. ఇప్పుడు కూడా?"

"మిస్టర్ లాల్, ఇది జులుం!"

"ఐ డోంట్ కేర్. నువ్వు కదలకుండా ఇక్కడే నిల్చో, నీ జేబులో తాళాలుంటే ఇలా ఇవ్వు. వెరీగుడ్! ప్రసీల్, నువ్వు ఇంట్లో గాలించు. పెట్టెలు, బీరువాలు వెతుకు. ఆ ఉత్తరాలు దొరుకుతాయేమో చూడు!"

"అలాగే, సార్!" ప్రసీల్ తాళాలు తీసుకొని నడిచాడు.

"మీరిలా చేయలేరు, లాల్! మీ డిటెక్టివ్ దర్పం ఇలా చూపించలేరు!" ఆచారి అన్నాడు.

"ఆచారీ, నువ్వు పోలీస్ కంప్లయింట్ ఇచ్చుకో!" అన్నాడు లాల్.

ఆచారి కలవరంగా చూశాడు.

"నువ్వు, తేలుకుట్టిన దొంగవని నాకు తెలుసు" లాల్ అన్నాడు మళ్ళీ, "అందుకే రాత్రి నువ్వు వాళ్ళని తరుముకు వెళ్ళలేదు. కనీసం అరవలేదు. పొరుగువాళ్ళని లేపలేదు. వాళ్ళెందుకొచ్చారో నీకు తెలుసు. కానీ వాళ్ళు వచ్చిన పని కాలేదు. ఆ ఉత్తరాలు భద్రంగా ఉన్నాయని తెలుసుకున్నావు. అందుకే వాళ్ళవెంట పడలేదు.

"కానీ — ఇప్పుడామె మాయమైంది. రాత్రినుంచీ కనిపించడంలేదు. అర్థమవుతోందా, దాని భావమేమిటో? ఆమె భయపడి వుంటుంది, నువ్వా ఆ ఉత్తరాలు బయట పెడ్తావని. అందువల్ల నిన్నింక ఎదుర్కొనే ధైర్యంలేక, ఆమె ప్రేమ అభాసుపాలయ్యే పరిస్థితిని చూడలేక, ఆమె ప్రాణాలు తీసుకునివుంటే నీ మెడకి పెద్ద లంపటమే చుట్టుకుంటుంది, ఆచారీ!"

"అలా జరగదు, నేను నిర్దోషిని."

"డబ్బు కోసం అమ్మాయిల్ని వేధించటం నీచం

ఆచారీ. శ్రేయం. ఇంకేదైనా దుర్మార్గం చేసి సంపా దించు. ప్రేమికుల జోలికి పోకు, వాళ్ళని విడదీయకు."

"నేను నిర్దోషిని."

"నీ వృత్తి ఏమిటి? ఏం చేసి తింటున్నావు?"

"ప్రస్తుతం ఏమీ లేదు. ఉద్యోగం కోసం ప్రయ త్నిస్తున్నాను. నేనిక్కడకొచ్చి నెలరోజులే అయింది. అడగండి ఎవరైనా."

"పూర్వం ఎక్కడున్నావు? నీదేవూరు?"

"ఖమ్మంలో వున్నాను. ఖమ్మం మా వూరు."

"భార్యా పిల్లలు?"

"భార్యని తరిమేశాను, పుట్టింట్లో వుంది. పిల్లల్లేరు. పిల్లలు పుట్టేదాకా రావొద్దన్నాను."

"అక్కడేం చేసేవాడివి?"

"అప్రస్తుతం."

"ఓహ్, అక్కడ నీ బిజినెస్ బెడిసి వుంటుంది. పోలీసులు పంపించేసి వుంటారు."

"నాకు పోలీస్ రికార్డులేదు, పొలాలు మానుకు నే వాడ్ని."

"ఓహ్, నువ్వెంత పవిత్రుడివి ఆచారీ! రైతుబిడ్డవన్న మాట?"

ప్రసీల్ తిరిగి వచ్చాడు, "సార్, ఎక్కడా లేవు. అంతటా వెతికాను. ఏ ఉత్తరాలూ దొరకలేదు. మరెక్కడో దాచివుంటాడు."

"అందుకే సులువుగా తాళాలిచ్చాడు" అన్నాడు లాల్, "వెల్, నా అభిప్రాయం నీకు చెప్పాను ఆచారీ, ఆమె ఆత్మహత్య చేసుకుంటే దానికి నువ్వే కారకు డవుతావు."

"ఆమె చేసుకోదు."

"నీకెలా తెలుసు?"

"నేను బెదిరించలేదు."

"ఖమ్మంలో ఉండేవాడివి, రైతు వీరుడివి, నెల రోజుల క్రితమే ఇక్కడకొచ్చిన వాడివి, నా పేరు నీకెలా తెలుసు? నన్నెలా గుర్తుపట్టావు?"

"నేను రైతునైనా పేపర్లు చదివే అలవాటుంది. ప్రపంచ రాజకీయాలు మాట్లాడతాను. డింపుల్ హోటల్‌లో మీరు బ్యాంకు దొంగలతో ఫైట్ చేసినప్పుడు మొన్న రాత్రి నేనక్కడే వున్నాను. అప్పుడే మీ గురించి తెలుసుకున్నాను."

"నువ్వక్కడెందుకున్నావు?"

"ఒక పెద్దమనిషికోసం వెళ్ళాను, ఉద్యోగం విషయంలో."

లాల్ అతని కళ్ళలోకి తీక్షణంగా చూసి, చటుక్కున ప్రసీల్ వైపు తిరిగాడు.

"కమాన్, ఈ ఆచారి నిజం చెప్తున్నాడు. నువ్వు పొరబడ్డావు."

ప్రసీల్ కలవరంగా లాల్‌తో బయటికి నడిచాడు.

ఆచారి సాగనంపుతూ గుమ్మం దగ్గర అన్నాడు. "నేను నిర్దోషిని."

లాల్ కారు స్టార్టుచేసి వేగంగా పోనిచ్చాడు.

"జయ పొరబడదు, సార్!" ప్రసీల్ అన్నాడు ఆందోళనగా.

"ఇప్పుడే తెలుస్తుంది."

క్రాస్ రోడ్స్‌లో కారాపి లాల్, ఒక క్యాంటీన్‌లో కెళ్ళి ఫోన్ చేసి తిరిగివచ్చాడు. పావు గంటలో ఒక

మోటార్ సైకిల్ వచ్చి కారు ప్రక్కన ఆగింది. సార్జెంట్ నవీన్ దిగి విష్ చేశాడు. లాల్ గబగబా అతనికి వివరించాడు. కొన్ని సూచనలిచ్చి, కారు స్టార్టుచేసి వేగంగా దూసుకుపోయాడు.

“మీ ఇల్లెక్కడ?”

“సోమాజిగూడాలో” ప్రసీల్ గుర్తులు చెప్పాడు.

“నిన్ను డ్రాప్ చేస్తాను. నిశ్చింతగా వుండు. ఏ విషయం త్వరలో తెలియచేస్తాను.”

# 3

మధ్యాహ్నం రెండు గంటలకి జాన్ తిరిగివచ్చాడు ఆఫీసుకి.

“బ్రదర్! గంపెడు మిస్టరీ మోసుకొచ్చాను, నెత్తిని కొట్టనా?”

“కొట్టకు, కూర్చుని కక్కు!” అన్నాడు లాల్.

జాన్ కూర్చున్నాడు అలసటగా. “నీ చేత కొన్ని అలవాట్లు మాన్పించడం కష్టం, నాకు తెలుసు. విను! ఈ జయ నిన్న రాత్రి ఒంటిగంటకు జెట్ హోటల్లో దిగింది, నాంపల్లిలో. ఆమెకూడా ప్రసీల్ ఉంటానికి హోటల్ వాళ్ళు అనుమతించలేదు. ఒక రోజు అద్దె అడ్వాన్సుగా ప్రసీల్ స్వయంగా చెల్లించాడు. అతను కొన్ని జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాక, ఆమె పైన తన గదిలోకి వెళ్ళింది. రూం 21. చాలా ఆందోళనగా కన్పించింది హోటల్ వాళ్ళకి.

“అరగంటయ్యాక ఆమె గదిలోంచి ఫోన్ చేసింది. ఆ కాల్ — ప్రతీ కాల్ — హోటల్ స్విచ్ బోర్డుగుండా వెళ్ళాలి. ఆపరేటర్ జయ చెప్పిన నెంబర్ని కలిపింది. హోటల్ నుంచి వెళ్ళే కాల్స్ని వాళ్ళు రికార్డు చేసు

వుంటారట, కస్టమర్స్ బిల్లు నిమిత్తం. రికార్డు అంటే టేప్ చేయటం కాదు, బుక్‌లో నోట్ చేసుకుంటారు; ఆ కాల్ నెంబర్, కస్టమర్ గది నెంబర్, టైములతో సహా. జయ ఒకటీ ఇరవై అయిదుకి ఫోన్ చేసింది—"

"ప్రొసీడ్!"

"ఆ ఫోన్ చేసిన వెంటనే ఆమె కిందకువచ్చి ఆపరేటర్‌ని బ్రతిమాలింది. అప్పుడు కౌంటర్‌లో క్లర్క్ లేడు. ఆ ఫోన్ కాల్ గురించీ, తను వెళ్తున్నట్టూ ఎవరికీ చెప్పవద్దంది. అప్పుడు బ్యాగు తెరిచి ఇరవై రూపాయలు తీసింది. అలా తీస్తున్నప్పుడు మన ఆపరేటర్‌కి బ్యాగులో నల్లగా మెరుస్తూ ఏదో కన్పించిందట...."

"రివాల్వర్?"

"రివాల్వర్. కానీ అప్పుడు ఆపరేటర్ సరిగా గుర్తించలేదు. మరో పది డిమాండ్ చేసింది. జయ ఇచ్చింది. ఈ సంగతి ఎవరికీ చెప్పొద్దని మరీ మరీ చెప్పి వెళ్ళిందట. దట్సాల్ పార్ట్నర్. నేను ఆమె చేసిన ఫోన్ నెంబర్ అడిగాను. అప్పుడు మన ఆపరేటర్ తన తియ్యటి కంఠంతో—"

"ఆ కంఠం వదిలెయ్, అదెంత తియ్యగుందో నా బుర్ర కెక్కింది!"

"సరే, అలాగే పార్ట్నర్. ఆమె నెంబర్ చెప్పింది. నేను ఎక్స్ఛేంజిని కాంటాక్టు చేశాను. అతను మిస్టర్ కె. నందనరావ్, బిల్డింగ్ కాంట్రాక్టర్, భారత్ కన్‌స్ట్రక్షన్స్, బషీర్ బాగ్. అరమైందా? అతనికి రెండు నెంబర్లున్నాయి. ఒకటి ఆఫీసుకి, మరొకటి ఇంటికి. రాత్రి జయ ఇంటికి ఫోన్ చేసింది. నేను ఆఫీసు

కళ్ళాను."

"చెప్పు."

"అక్కడ నందనరావ్ విచిత్రంగా ప్రవర్తించాడు. అసలు జయ ఎవరో తనకు తెలీదన్నాడు. రాత్రి ఎవరూ తనకు ఫోన్ చేయలేదన్నాడు. అతనికి నలభై ఏళ్ళుంటాయి. ఆరోగ్యంగా, దృఢంగా వున్నాడు. ఆ పర్సనాలిటీతోనే నన్ను బెదిరించాడు. తక్షణం చెక్కేయమన్నాడు. లేకపోతే బయటికి విసిరేస్తానన్నాడు. ఇతనికి ఒక కాలేజీ విద్యార్థినితో సంబంధమేమిటా అని ఆలోచించాను. ఎంత అడిగినా అలాంటి అమ్మాయి ఎవరూ తనకు తెలీదన్నాడు. రాత్రి తనకెవరూ ఫోన్ చేయలేదన్నాడు....

"అతనితో లాభంలేదనుకొని బైటికొచ్చాను. స్టాఫ్ రూంలో టైపిస్టు సీటు ఖాళీగా వుంది, పార్ట్‌నర్! ప్రక్క సీట్లో అతన్ని రెండు ప్రశ్నలు అడిగాను. ఆ టైపిస్టు జయేనట! ఉదయం నుంచీ ఆఫీసుకి రాలేదట! వింటున్నావా, పార్ట్‌నర్?"

"వింటున్నాను, జాన్. చెప్పు!"

"అయితే బాస్ ఎందుకు అబద్ధం చెప్పాడని అతన్ని అడిగాను. అతను ముందు నేనెవరో చెప్పమన్నాడు. చెప్పాను. సంకోచించాడు. బయట ఏకాంతంగా కలుసుకుందామన్నాడు. నేను క్రింద హోటల్లో వుంటానన్నాను. అయిదు నిమిషాల్లో వచ్చి కలుస్తానన్నాడు.

"అతని పేరు శివరాం. ముప్ఫై ఏళ్ళుంటాయి. హోటల్లో నన్ను కలుసుకుని చెప్పాడు — జయ ఆర్నెల్లుగా తమ ఆఫీసులోనే పని చేస్తోందిట. ఆమె బాస్‌ని ప్రేమిస్తోందిట. వాళ్ళిద్దరు తరచూ రహస్య సమా

వేశాలు జరుపుతుంటారట. ఈ సంగతి ఆఫీసులో ఎవరికీ తెలీదు, ఈ శివరాంకు తప్ప. మొదట శివరాం ఆమెని ప్రేమిస్తే తిరస్కరించిందట. అతని ప్రేమను హేళన చేసి కొట్టి పారేసిందట....అప్పట్నుంచీ బాస్ ఆకర్షణలో పడింది. బాస్‌కి వివాహమైంది, రెండోసారి. పిల్లలేరు.

"నేను జయ బ్లాక్ మెయిల్ వ్యవహారం గురించి చెప్తే, అతనేమీ చెప్పలేకపోయాడు. వాళ్ళమధ్య ఉత్తరాలకి ఆస్కారం లేదన్నాడు. బాస్‌కి అవి రాసే నేర్పూ, ఓపికా లేదన్నాడు. జయ వివరాలడిగాను. ఆమె సంతోష్‌నగర్‌లో అద్దె ఇంట్లో ఒంటరిగా వుంటోందిట. నేను ఇంటి అడ్రసు తీసుకుని, ఆమె రివాల్వర్ వుంచుకుంటుందా అనడిగితే నివ్వెరపోయి లేదన్నాడు. అయితే బాస్‌కు రివాల్వర్ వుందన్నాడు. కానీ, ఆ ఉత్తరాలు ఆధారంగా ఎవరో బ్లాక్ మెయిల్ చేస్తే, బాస్ ఆమెకి రివాల్వర్ ఇచ్చి పంపేంత తెలివి తక్కువ పని ఎలా చేస్తాడని సందేహం వెలిబుచ్చాడు.

"జయ ఎక్కడున్నా బాస్‌కు తెలిసినచోటే వుంటుందన్నాడు శివరాం. బాస్‌కు మరో ఇల్లుగానీ, రహస్యంగా గడిపే చోట్లుగానీ ఉన్నాయా అనడిగితే, అదేమీ తనకు తెలీదన్నాడు. నేను వెళ్ళకముందు గంటక్రితమే ఆఫీసుకు ఫోన్ వచ్చిందట."

"ఎక్కడ్నుంచి?"

"అది చెప్పలేకపోయాడు. రావ్ కోపంగా ఉద్రేకంగా అరిచాడట ఫోన్‌లో....తిట్లు కూడా దొర్లాయట. అవి ఇంగ్లీషులో ఫూల్, స్టుపిడ్ వంటివి కావడంవల్ల అవతల వున్నది ఆడో మగో చెప్పలేనన్నాడు. అదేదో కంపెనీ గొడవ అయివుంటుందన్నాడు. ఈమధ్య ఒక

కాంట్రాక్టర్‌తో విభేదాలొస్తున్నాయట....

"నేను శివరాంని పంపించేసి జయ ఇంటికెళ్ళాను. తాళం వేసివుంది. పక్కింటివాళ్ళనడిగితే ఆమె రాత్రి నుంచీ లేదన్నారు. ఈ ఊళ్ళో ఆమెకెవరూ లేరట. షాద్‌నగర్ ఆమె స్వంత ఊరట. తల్లిదండ్రులు అక్కడే వుంటారట. దట్సాల్, లాల్. నేనక్కడ్నుంచి తిరుగు ముఖం పట్టాను."

"అయితే ఆమె ఊరికెళ్ళి వుంటుందా?" అన్నాడు లాల్.

"ఏమో! ఆమె హోటల్ నుంచి ఫోన్ చేసి రావ్‌కి పరిస్థితి చెప్పివుండాలి. అతను వచ్చి ఆమెను తీసుకెళ్ళిపోయాడు—నిజానికి హోటల్‌లో ఆమెకి ప్రమాదంలేదు. ఆమె అక్కడున్నట్టు ఆచారికి తెలీదు. కానీ రావ్ ఎందుకో భయపడి ఆమెని తరలించాడు. బహుశ, ఊరికే పంపించేసివుంటాడు."

"అంత రాత్రా? ఎలా?"

"తన కార్లోనే వదిలిపెట్టి వుంటాడు. షాద్‌నగర్ నలభై కిలోమీటర్లు, హైద్రాబాద్—కర్నూలు హైవే మీద. గంటసేపు ప్రయాణం."

"అయితే ఇది వెయ్యిరూపాయల వ్యవహారంకాదు, జాన్. కొన్ని వేలరూపాయలకి చెందిన పెద్ద కుట్ర. జయ ప్రసీల్‌తో అన్నీ అబద్ధాలే చెప్పింది — అసలు రావ్ ఆ ఉత్తరాల కోసం జయనే ఎందుకు పంపాడో ఆశ్చర్యంగా వుంది. ఆమె ఆడది. ఆమెలో అంత సాహసం ఎలా వూహించాడు? పైగా రివాల్వర్ ఇచ్చి పంపాడు."

హఠాత్తుగా ఫోన్ మోగింది. లాల్ రిసీవరెత్తాడు.

"నేను నవీన్‌ని, సర్!" అంది అవతలి గొంతు.

"ఎస్, ఏమిటి సార్జెంట్?"

"ఆచారి తప్పించుకుపోయాడు, సర్!"

"ఏమిటీ!"

"అయాం సారీ, సర్. నేనొక్కడ్ని. ఇంటికి రెండు ద్వారాలు. ఎలా కనిపెట్టను? చాలా సేపటికి అనుమానం వచ్చి చూస్తే పెరటి తలుపు ఓరగా వేసివుంది. లోపల ఆచారి లేడు—"

లాల్ చటుక్కున జాన్ వైపు తిరిగాడు. "రావ్ ఇంటి నెంబరేమిటి?"

జాన్ కలవరం చెందుతూ చెప్పాడు.

లాల్ ఫోన్‌లో అన్నాడు. "ఓ.కే, నవీన్, నెవర్ మైండ్. అతడెప్పుడొస్తాడో కనిపెట్టు. వెంటనే ఈ నెంబర్‌కి తెలియచెయ్...." నెంబర్ చెప్పాడు.

ఫోన్ పెట్టేసి వెంటనే లేచాడు, "కమాన్, జాన్! నన్ను రావ్ ఇంటికి డ్రైవ్ చెయ్. నువ్వక్కడ్నుంచి షాద్‌నగర్ వెళ్ళి ఆమె గురించి కనుక్కో!"

"నువ్వు రావ్ ఇంటికెందుకు?"

"మిసెస్ రావ్ ఎంతవరకు తోడ్పడుతుందో చూద్దాం!"

# 4

ఆమె నవ్వుతూ ఆహ్వానించింది. "డిటెక్టివ్‌లు మా యింటికి వచ్చారంటే ఆనందించాలో, భయపడాలో తెలియకుండా వుంది!" అందామె.

"భయమెందుకు?" అన్నాడు లాల్ సోఫాలో కూర్చుంటూ. ఆమెని పరిశీలనగా చూశాడు. ఆమెకు ముప్పై ఏళ్ళుంటాయి. ఆమె అంతటి అందమైన స్త్రీని

లాల్ ఎప్పుడూ చూడలేదు. రెప్ప వేయకుండా అలాగే చూస్తూండిపోయాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" నవ్వుతూ అడిగిందామె, ఎదురుగా కూర్చుని.

లాల్ తేరుకున్నాడు. "మీలాగే పేరు కూడా ఎంత అందమైనదై వుంటుందాని...."

"అయితే మీరు నిరుత్సాహపడతారు."

"ఎందుకు?"

"నాది సాధారణమైన పేరు, రేణుక."

"మనిషి సౌందర్యమే పేరుకు అందాన్నిస్తుంది, మిసెస్ రేణుక."

ఆమె మరోసారి నవ్వింది. "కానీ మీరిలా వచ్చిన కారణం నన్నేదో అందాల పోటీకి యెన్నిక చేయడం కాదుకదా?"

"కాదు, కాదు. అంతకంటే ప్రధానమైనవి చర్చించడానికి."

"అంతకంటే ప్రధానమైనవా....?"

"మీ వైవాహిక జీవితం భవిష్యత్తు."

"దానికేమైంది?"

"మీవారి గురించి—ఒక అమ్మాయి అంతర్ధానంలో ఆయన భాగం వుంది."

ఆమె కలవరంగా చూసింది, "మీరేమంటున్నారో నాకర్థంగాకుండా వుంది!"

లాల్ జయ గురించి అంతా చెప్పాడు.

ఆమె ఆందోళనగా చూసింది అంతా విని.

"ఇప్పుడు చెప్పండి. మీ అభిప్రాయమేమిటి?" అన్నాడు లాల్.

ఆమె తేరుకొని అంది. "ఆశ్చర్యంగా వుంది, లాల్. ఆయన అలా ఎందుకు చేస్తారో తెలియకుండా వుంది! ఆయనకు ఒకర్ని ప్రేమించే తీరికా, ఓపికా యెక్కడివి? ఆయన తత్వం నాకు బాగా తెలుసు. సంపాదన మనిషి. వేరే ధ్యాస వుండదు. వ్యాపకాల్లేవు. నేనెలా సహిస్తున్నానో నాకే ఆశ్చర్యంగా వుంటుంది. ఆయన్ను చేసుకునేముందు నా జీవితం ఇలా అవుతుందనుకోలేదు. నేను ఆయన డబ్బుచూసి చేసుకోలేదు, మిస్టర్ లాల్. అక్కయ్యమీద సానుభూతి-అభిమానంకొద్దీ తలొంచాను. అక్కయ్య మా యిద్దర్నీ చేతులు కలిపింది, తను పోతూ. పిల్లల్లేని ఆయన్ను జాగ్రత్తగా చూసుకోవాలని మాట తీసుకుని శ్వాస విడిచింది...."

లాల్ తలూపాడు మౌనంగా.

"ఆయన్ని నేను బాగానే చూసుకున్నాను. కానీ రానురాను నేనంటే ఆయనకు అయిష్టం, నిర్లక్ష్యం పెరిగిపోయాయి. నేనేమీ చేయలేని స్థితికొచ్చాను. అక్కయ్య ఎంత బాధపడుతుందో! నాకు డబ్బు కాదు కావల్సింది, మిస్టర్ లాల్. నన్ను మనిషిగా చూసే మనిషి. నా సేవల్ని, నాలో స్త్రీత్వాన్ని గుర్తించే భర్త."

లాల్ మళ్ళీ తలూపాడు.

"సరే, అలవాటుపడిపోయాను ఈ జీవితానికి, ఈ అయిదేళ్ళు. ఇప్పుడు బాధపడి ప్రయోజనమేమిటి? కానీ జయ వ్యవహారం నన్నాందోళన పరుస్తోంది. వాళ్ళిద్దరి మధ్య అదెలా సాధ్యమో అంతుపట్టకుండా వుంది! ఆమెని నేనొక్కసారే చూశాను...."

"ఆఫీసులోనా?"

"కాదు, ఆఫీసులో కాదు. నేనాఫీసుకెళ్ళను. అది

మర్యాదకాదు. స్త్రీలు కొన్ని మర్యాదలు పాటించాలి. ఒకరోజు ఆమె ఇంటికొచ్చింది .... నెలరోజులక్రితమనుకుంటాను. వాళ్ళిద్దరు ఆఫీసు విషయాలు మాట్లాడుకున్నారు. వాళ్ళమధ్య అప్పుడు నాకేదీ విపరీత మనిపించలేదు. నాకే అనుమానమూ కలగలేదు. మీరు ప్రేమలేఖలంటున్నారు. ఇదింకా విచిత్రంగా వుంది! ఆయన వ్రాసివుండరని — వ్రాయలేరని నా నమ్మకం. ఆమె వ్రాసివుంటే అటువుంటి లేఖలేవీ ఇంట్లో లేవు. అవును, రాత్రి ఆయనకు ఫోన్ వచ్చింది. ఒంటిగంటన్నర కనుకుంటాను. ఆయన వెంటనే బట్టలేసుకుని వెళ్ళారు. ఎక్కడికో చెప్పలేదు. తిరిగి ఎప్పుడొచ్చారో నేను టైము చూడలేదు."

"సుమారుగా చెప్పండి."

"గంట కావచ్చు రెండు గంటలు కావచ్చు. చెప్పలేను. రివాల్వర్ విషయంలో మీరన్నది నిజమే. ఆయనకుంది. కానీ ఉదయం నేను బీరువాలో చూసినప్పుడు లేదు. అడిగితే ఆఫీసులో పెట్టానన్నారు. ఇదంతా నాకేమీ అర్థంగాకుండా వుంది! ఆ ఉత్తరాల కోసం ఒక అమ్మాయిని నమ్ముకుని రివాల్వర్ ఇచ్చి పంపుతారా! ఆమె దాంతో ఏదైనా చేస్తే.... ఓహ్, వూహించలేను!"

లాల్ నిట్టూర్చి టెలిఫోన్ కేసి చూశాడు. తర్వాత టైము చూసుకున్నాడు.

"సరే, ఆయన జయని ఎక్కడ వుంచారో చెప్పగలరా?"

"ఎక్కడ వుంచుతారు? మరేదైనా హోటల్ కి మార్చారేమో? ఆచారి ఒకవేళ ప్రసీల్ ని పట్టుకుంటే తెలియకుండా వుండటానికి ..."

"ప్రసీల్ ఎవరో ఆచారికి తెలీదు. అప్పుడు చీకటి. మీకు మరో ఇల్లు ఏదైనా వుందా?"

ఆమె భుజాలెగరేసింది. "లేదు."

లాల్ ఆమెని సూటిగా చూశాడు, "ఆలోచించండి ..."

"లేను, మాకు మరో ఇల్లు లేదు."

లాల్ నవ్వాడు. "మీ కళ్ళు అలా చెప్పడంలేదు, మాటలు నిజం కావంటున్నాయి."

ఆమె తీక్షణంగా చూసింది. "నేనెందుకు అబద్ధం చెప్పాలి? ఆయన చెడుపేరు తెచ్చుకుంటోంటే చూస్తూ వూరుకుంటానా? మీ సహాయంతో నే అదుపు చేస్తాను."

"మేం లేకుండా కూడా చేయగలరు."

ఆమె ఆలోచించింది. "ఎలా చేయగలనో తట్టకుండా వుంది.... లేదు, మీరు లేకుండా నేనేమీ చేయలేను. కానీ మీరు నమ్మరు, ఏం చేయాలి?"

"బాగా ఆలోచించండి. ఇందులో లాభనష్టాలు విమర్శించుకొని నాకు ఫోన్ చేయండి, ఆఫీసులో నే వుంటాను!"

లాల్ లేచి మరోసారి ఫోన్నీ, వాచీనీ చూశాడు.

"ఇక్కడ నాకో ఫోన్ కాల్ రావాలి. ఇంతవరకు రాలేదు. ఒకవేళ వస్తే ఆఫీసుకు చేయమని చెప్పగలరా?"

ఆమె తలూపింది వెంటనే, ఆలోచనల్లోంచి తేరుకొని.

## 5

లాల్ ఆఫీసుకు చేరుకున్న పదినిమిషాలకి సార్జెంట్ ఫోన్ చేశాడు.

"నవీన్ ని, సర్."

"ఎస్, ఏమిటి సార్జెంట్?"

"ఆచారి వచ్చాడు, సర్!"

"ఎప్పుడు?"

"ఇప్పుడే, అతనితోపాటు ప్రనీల్ కూడా వున్నాడు, సర్! ఇద్దరూ చెట్టాపట్టాలేసుకు వచ్చారు—"

"ఏమిటీ!"

"అవును, సర్! వాళ్ళిద్దరు నవ్వుకుంటూ పోయారు ఇంట్లోకి!"

లాల్ బిగుసుకుపోయాడు క్షణంపాటు. "ఆల్ రైట్, నేనిప్పుడే వస్తున్నాను. నువ్వక్కడే వుండు!" అని గబుక్కున రిసీవర్ పెట్టేస్తూ లేచాడు.

ఒక అజానుబాహుడు విసురుగా వచ్చాడు లోపలికి. అతనికి యాభై ఏళ్ళుంటాయి. నవ్వుతూ ముందుకొచ్చి, లాల్ తో కరచాలనం చేశాడు చొరవగా. లాల్ అసహనంగా గడియారం చూసుకున్నాడు. "సారీ, నేనిప్పుడు—"

"మీరిప్పుడు ఆచారిమీద నిఘా తీసేయండి, మిస్టర్ లాల్."

లాల్ చటుక్కున తలెత్తి చూశాడు, "మీరెవరు?"

"కామేశ్వరరావు నా పేరు. డెక్కన్ కన్స్ట్రక్షన్ ప్రొప్రయిటర్ ని. ఇంకా—"

"ఇంకా—?"

"ప్రనీల్ తండ్రిని."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "ఐసీ..కూర్చోండి."

"థాంక్స్. మిస్టర్ లాల్, ఆచారిని మీరు అపార్థం జేసుకున్నారు. పొరబడ్డారు. మీరనుకుంటున్నట్లు అతను

నేర స్తుడు—దుర్మార్గుడు—బ్లాక్ మెయిలర్ కాడు."

"కాడా?"

"కానే కాదు!"

"అదృష్టవంతుడు."

"ఎందుకు?"

"ఆమె రివాల్వర్ తీసి కాల్చలేదు, ఆ అమ్మాయి జయ. పొట్టలో గుద్దింది. మీ వాడు డొక్కలో తన్నాడు. మైనర్ గాయాలతో బ్రతికిపోయాడు మీ ఆచారిని!"

"ప్లీజ్, మిస్టర్ లాల్! ఇప్పుడు మీ అభిప్రాయం మార్చుకోండి. ఆచారిని గురించి అలా మాట్లాడకండి. అతనిమీద నిఘా తీసేయండి. భరోసా నేనిస్తాను. అతను నా పాత స్నేహితుడు. ఖమ్మంలో పొలాలు కౌలుకు చేసుకు నేవాడు. ఒకనాడు ఆ జీవితంతో విసుగుచెంది ఇక్కడకొచ్చాడు. నెలరోజుల క్రితం నన్ను కలిసి ఏదైనా పని ఇప్పించమన్నాడు. నేను ఆలోచిస్తానన్నాను. నా ఫర్మ్‌లో నే తీసుకోవాలనుకుంటున్నాను. ఇంతలో ఇలా జరిగింది—"

"చెప్పండండి."

"ఇవాళ ఉదయం మీరు మావాడితో—అతనింటికి వెళ్ళారట. మావాడు—వాడు త్తి స్టుపిడ్! చదువబ్బలేదు వాడికి! చచ్చు సాహసాలు చేస్తూంటాడు. మీతో వాడు కాల్పోస్తే ఆచారి ఆశ్చర్యపడ్డాడు. వాడ్ని ఆచారి గుర్తు పట్టగలడు గానీ, వాడు ఆచారిని ఎప్పుడూ చూడలేదు. అతనెవరో వాడికి తెలీదు. రాత్రి వాడు ఆ అమ్మాయితో ఆచారి ఇంటికి వెళ్ళింది నిజమే. అయితే అది పూర్తిగా పొరబడి వెళ్ళారు, ఆమె పొరబడింది. నా భరోసా సుకోండి లాల్, ఆచారి ఆమెని బ్లాక్ మెయిల్

చేయలేదు. అసలు ఆమె ఎవరో కూడా తెలీదు."

"ఎంత విచిత్రంగా వుంది!"

"ఏమిటి?"

"ఆమె మీ స్నేహితుడిని బ్లాక్ మెయిలర్ గా పారబడి మీ వాడితోసే వెళ్ళడం!"

"అదే నాకూ అంతుపట్టడంలేదు. అది కాకతాళీయం ఎందుకాక్కూడదు?"

"అలాటి కాకతాళీయం నేనంగీకరించలేను."

"ఎందుకంగీకరించలేరు? మీ మనసులో ఏముంది?"

"చాలా వుంది. నందనరావ్ గురించి మీకేం తెలుసు?"

"ఎవరతను?"

"మీకు తెలిసే వుండాలి, కంట్రాక్టర్ ... మీరూ కంట్రాక్టర్. ఇద్దరూ ఒకే లైనులో వున్నారు. ఇది కూడా కాకతాళీయం అంటారా? ఆ అమ్మాయి నందనరావ్ దగ్గర పనిచేస్తోంది."

"మీరు చెప్పే విషయాలు నాకు కొత్తగా వున్నాయి."

"వెల్, నాకేమనిపిస్తోందో తెలుసా ఇప్పుడు?"

"ఏమనిపిస్తోంది?"

"మీరూ నందనరావ్ దేనికో పోటీపడుతున్నారని-"

"పోటీయా? దేనికి, మిస్టర్ లాల్? గమ్మత్తుగా వుంది!"

"లేదూ?" అన్నాడు లాల్ సిగరెట్ వెలిగించుకుంటూ, "ఆ పోటీ దేనికో మీకు తెలుసు, ఎక్కడో ఏ కట్టడానికో ప్రభుత్వం టెండర్లు పిలిచివుంటుంది. దానికి ఇంకా గడువు వుండొచ్చు. ఈలోపు మీరేం

సమర్పిస్తున్నారో తెలుసుకోవాలని నందనరావ్ కి కుతూహలం కలిగి వుంటుంది. మీ టెండర్ పత్రాలు ఏదో కారణంచేత మీరు ఆచారివద్ద వుంచారు. అది రావ్ తెలుసుకున్నాడు. రావ్ మీగురించి చాలా తెలుసుకున్నాడు....ఆచారి యెవరో మీవాడికి తెలీదని రావ్ కు తెలుసు. ఈ అవకాశంతో మిమ్మల్ని ఫూల్ చేయాలనుకున్నాడు —

"వెల్, జయకో కథ అల్లి ఇచ్చి మీవాడు ఆమెతో వెళ్ళేలా చేశాడు—వాళ్ళిద్దరు ఆచారి ఇంట్లో గాలిస్తున్నారు. ప్రసీల్ ఆమె మాటలు నమ్మి ఉత్తరాల కోసం చూస్తోంటే, జయ తన స్వంత పని మీ టెండర్ కాయితాల కోసం వెతుకుతోంది. ఆమె ఏవో కాయితాలు కాస్సేపు శ్రద్ధగా పరిశీలించినట్లు ప్రసీల్ చెప్పాడు, పెన్ టార్చి వెలుగులో. అవే ఆమెకావల్సిన పత్రాలయి వుంటాయి.

"అప్పుడు — అనుకోకుండా ఆచారి రావడంతో అతన్ని గాయపర్చి ఇద్దరూ పారిపోయారు. ఆమె ఉత్తరాలకోసం రాలేదు కాబట్టి, తను వచ్చిన పని పూర్తయింది కాబట్టి, రివాల్వర్ తీసి బెదిరించే అవసరం రాలేదు. మీవాడితో సింపుల్ గా పారిపోయింది, అంతే. ఆచారి తేలుకొని మీకు ఫోన్ చేశాడు. ప్రసీల్ ఇంటికొచ్చినపుడు అంత రాత్రి ఫోన్ లో మీరెవరితోనో మాట్లాడుతున్నారు....ఆచారి మీకు సంగతి చెప్పాడు. కానీ ప్రసీల్ ని గుర్తించలేదు ఆ చీకట్లో. జయని ఊహించాడు."

లాల్ నవ్వి మళ్ళీ అన్నాడు. "వెల్, మీకు రావ్ ప్రయత్నం తెలిసిపోయింది. లేకపోతే, ఆచారి ఆ సమ

యంలో వెళ్ళకపోతే మీకేం తెలిసేదికాదు. నందనరావ్ తన టెండర్ గెలిచేవాడు. తర్వాతెప్పుడో ఆచారి మీ స్నేహితుడని ప్రసీల్ కు తెలిస్తే యెంత హాస్యంగా వుంటుంది! మీ జీవితంలో అది గొప్ప జోక్ గా వుండిపోతుందని రావ్ అలా హ్యూమరస్ గా జంపించాడు. ఏమంటారు?"

కామేశ్వర్రావు ముఖం ఎర్రబడింది. కోపంతో చూశాడు.

"మీరు అసంభవాలు మాట్లాడుతున్నారు, లాల్. అవాస్తవాలు పలుకుతున్నారు. టెండర్ ఏమిటి! నేను ఆచారి దగ్గర వుంచడమేమిటి! అంత అవమానానికి గురయ్యే అసమర్థుడనుకున్నారా నన్ను?"

"వెల్, ఈ హాస్యాస్పదమైన వాస్తవాన్ని అంగీకరించడానికి మీకు అభిమానం అడ్డొస్తోంది...."

"షటప్!" అరిచాడు రావ్ వెంటనే లేస్తూ, "నన్ను అవమానించాలని చూస్తున్నారా? ఇటువంటి మాటలు ఇంకెక్కడైనా చెప్పారంటే మీమీద చర్య తీసుకుంటాను! డిఫమేషన్ ఛార్జి అని ఒకటి వుంది—"

"వదలండి! ఈ అవమానానికి ప్రతీకారంగా మీరేం చేస్తారో చూడాలని నాకు కుతూహలంగా వుంది!"

"ప్లీజ్ షటప్, మిష్టర్ లాల్!"

"అందుకే ఉదయం మీరిద్దరూ ఫోన్ లో నిందించుకున్నారు. అతను మిమ్మల్ని ఫూల్, స్టుపిడ్ అంటూ తిట్టాడు—"

రావ్ ఆవేశంతో ముందుకి వంగాడు. "మిమ్మల్ని కోర్టుకీడుస్తాను, చూడండి!"

లాల్ తల పైకెత్తి నవ్వాడు. "ఈ సంభాషణకు

సాక్షులెవరూ లేరు, గమనించండి!"

రావ్ పళ్ళు నూరాడు. పిడికిళ్ళతో బల్లమీద గుద్ది, గిరుక్కున వెనక్కు తిరిగి, విసురుగా వెళ్ళిపోయాడు.

లాల్ నవ్వుకుంటూ చేతులు చూసుకున్నాడు.

ఫోన్ మోగింది.

"సర్, నవీన్‌ని. మీరొస్తారని—"

"నేనిప్పుడు రావడంలేదు. సార్జెంట్, నువ్వెళ్ళిపో!" అన్నాడు లాల్.

"కానీ, సర్! ఆచారి ఇక్కడ—"

"ఏం చేస్తున్నాడు?"

"ప్రసీల్‌ని ఫోటోలు తీస్తున్నాడు సర్, ఎండలో నిలబెట్టి!"

లాల్ ఒక్క క్షణం కలవరపడ్డాడు. "వెల్.... నెవర్ మైండ్, లెట్ దెమ్ ఎంజాయ్" అన్నాడతను రిసీవర్ పెట్టేస్తూ.

# 6

సాయంత్రం నాలుగున్నరకు జాన్ తిరిగి వచ్చాడు.

"పార్ట్‌నర్, పిట్ట గూడు వదిలి ఎగిరిపోయింది!"

"వివరంగా చెప్పు."

"ఓ.కే. ఆమె తల్లిదండ్రులతో తెగతెంపులు చేసుకుంది. మళ్ళీ యింటి గడప తొక్కనని వెళ్ళిపోయింది. రెండు నెలల క్రితం ఆమె పెళ్ళి గురించి భేధాభిప్రాయాలొచ్చాయి. వాళ్ళు చూసిన సంబంధం కాదని భీష్మించుకుంది. తనొకరికి మనసిచ్చినట్టూ, అతన్ని కాదని ఎవర్నీ చేసుకునేది లేదనీ ఖండితంగా చెప్పేసింది. దానికి పెద్దలు ఒప్పుకోలేదు. ఈ గొడవ చాలా రోజులు సాగింది. చివరికి విషమించి ఆమె యిల్లు వదిలేసింది. ఆమెతో

అక్కా, తమ్ముడూ వున్నారు."

"ఎవర్ని ప్రేమిస్తోందో చెప్పిందా?"

"చెప్పింది. ఆఫీసులోనే ఒక సహోద్యోగిని అని. కానీ ఆమె ఉద్దేశంలో ఆమె బాస్ నందనరావ్ అని మనం అనుకోవాలి."

"మళ్ళీ యింటి ముఖం చూళ్ళేదా?"

"లేదు. మళ్ళీ వచ్చి నచ్చజెప్పనూ లేదు, రాజీకొచ్చే ప్రయత్నమూ చేయలేదు. కూతుర్నలా మర్చిపోయారంతే."

"ట్రాజెడీ. కానీ జాన్, ఇప్పుడు పరిస్థితి మలుపు తిరిగింది."

"ఎలా?"

లాల్ కామేశ్వరరావ్ గురించీ, రేణుక గురించీ చెప్పాడు.

జాన్ విని పగలబడి నవ్వాడు. "అంత పరాచికమా! నందనరావ్ కు అంత సాహసమా! తర్వాత అది బైట పడితే టెండర్ రద్దు కామా? బ్రదర్ రావ్ అండ్ రావ్ ల మధ్య టగాఫ్ వార్ అన్నమాట యిప్పుడు! ఓ.కే, వ్యవహారాల్లో—అవెంత సీరియస్సైనా—వాటిలో హ్యూమర్ ని జొప్పించేవాళ్ళని మెచ్చుకుంటాను! మాత్రం నేను..." హార్షిస్తాన్నను!"

లాల్ అన్నాడు. "నందనరావ్ ప్రయత్నాన్ని అభినందించాల్సిందే! కానీ అది ఫలించలేదు. కామేశ్వర్రావుకి తెలిసిపోయింది .... అతడేం చేస్తాడోనన్న భయంతో జయని దాచేశాడు. ఉదయం నీకు శివరాం చెప్పినట్టు ఆ ఫోన్ లో తిట్లు కామేశ్వర్రావ్ కి. ఆ కాంట్రాక్టర్ కామేశ్వర్రావే. వెల్, జయ ఎక్కడుందో మనకి తెలీదు. రేణుక చెప్పడంలేదు. ఆమె అభ్యంతరాలు

మోటివ్స్ ఆమెకున్నాయి. కాగా మనం ఇప్పుడు చేయ వల్సింది—"

"నందనరావ్‌ని కని పెట్టి ఆఫీసు వదిలాక అతన్ని వెంటాడుట."

"దటీజ్ రైట్, వెళ్తావా?"

జాన్ తలూపాడు. "కానీ లాల్, ఇందులో మన ధ్యేయం ఏమిటో అర్థంగావడంలేదు. నయాపైసా ఫీజు లేకుండా యెవరి కోసం ఈ పాట్లన్నీ? రావ్‌లిద్దరూ టెండర్ కోసం జుట్లు పట్టుకుంటే మధ్యలో మనకెందుకు తలనొప్పి? రావ్‌ని జయతో పట్టుకుంటే మనకేం వస్తుంది?"

లాల్ అన్నాడు, "ఆమె భద్రత, క్షేమం చూడటం మన ధ్యేయం. ఇప్పుడు మనల్ని యెవరూ కోరడంలేదు. ప్రనీల్ ముఖం చాటేస్తాడు. అయినా మనం ముందుకు సాగుతాం. ఆమెకు ప్రమాదం వుంది గనుకనే రావ్ దాచేశాడు. తన కుబుద్ధి ఎక్కడ బైటపడ్తోందోనని ఉదయం నిన్ను బుకాయించాడు. యిప్పటి పరిస్థితిలో అతడు జయను రక్షించగలడనుకోను. ఆమె ఎక్కడుందో తెలిస్తే కామేశ్వర్రావ్ చేతులు కట్టుకొని కూర్చోడు— ఇంత అవమానమూ పొంది."

"ఓ.కే, వెళ్తాను. రావ్‌కి బుద్ధి చెప్పి జయను తీసుకొస్తాను. కానీ నువ్వు ఆచారిమీద అలాగే నిఘా వుంచాల్సింది...."

"లాభంలేదు, వాళ్ళకి తెలిసిపోయింది. ఒకసారి తప్పించుకున్నాడు. జయ ఎక్కడుందో వాళ్ళకి తెలిసి వుండదు. ఆ ధైర్యంతోనే ఆమెని రావ్ అక్కడ

వంటరిగా వుంచాడు.

జాన్ చిన్నగా నవ్వాడు. "ఆమె దగ్గర రివాల్వర్ వుంది."

"యెంతైనా ఆమె అబల" అన్నాడు లాల్.

"ఆల్ రైట్ నేనిక వెళ్తాను" అన్నాడు, జాన్ లేస్తూ.

అతను వెళ్ళిపోయాక లాల్ రిసీవరెత్తి ఫోన్ చేశాడు.

"నేను లాల్‌ని, మిసెస్ రేణుక" అన్నాడతను.

"ఓహ్, ఏమిటి సంగతి?"

"మీరే చెప్పాలి, ఏం ఆలోచించుకున్నారు?"

"లాల్, నేను అబద్ధం చెప్పడంలేదని మీకెలా చెప్పాలి?"

"చెప్పలేరు, మీరు అబద్ధమే చెప్తున్నారు కాబట్టి."

"సరే, యెవరి నమ్మకం వాళ్ళది. ఈ విషయంలో నన్నింక మాట్లాడించకండి!"

"ఈ విషయం వదలండి, ఆ విషయం చెప్పండి."

"ఏ విషయం?"

"మీరేం ఆలోచించుకున్నారు?"

"మళ్ళీ....అంటే!"

"జయ గురించి...."

"ఓహ్, ఇంకేమీ ఆలోచించలేదు. ముందు ఋజువు కావాలి కదా?"

"ఎలాటి ఋజువు?"

"వాళ్ళిద్దరు ప్రేమికులని."

"అప్పుడేం చేస్తారు?"

"తగిన చర్య తీసుకుంటాను!"

"విడాకులా?"

"ఏమిటిది? మీా తేరకంగా నన్ను కమిట్ చెయ్యాలనుకొంటున్నారు? ప్లీజ్ షటప్ యువర్ మౌత్ అండ్ మైండ్ యువర్ ఓన్ బిజినెస్!"

పిడుగులు పడ్డట్లుయి హఠాత్తుగా లైను కట్ అయింది.

లాల్ కంగారుపడి చూశాడు ఫోన్ని.

## 7

ఆరు గంటలకి మొదలైన వర్షం ఇంకా కురుస్తోనే వుంది.

రాత్రి ఏడున్నరకి జాన్ ఫోన్ చేశాడు గాభరాగా.

"పార్టనర్! కొంప మునిగింది, ఫినిష్!"

"ఏమిటి, ఏమైంది?" అరిచాడు లాల్.

"రావ్—నందనరావ్ తప్పించుకున్నాడు!"

"ఏమిటీ!"

"నన్ను కనిపెట్టేశాడు! మువ్వలిప్పలు పెడుతూ డొంకలన్నీ చుట్టి మాయమయ్యాడెక్కడికో!"

"నువ్వెలా పోనిచ్చావు ఫూల్? ఎంత సేపయింది తప్పిపోయి?"

"గంట! అయిదున్నరకి ఆఫీసునుంచి బయల్దేరాడు. ఆబిడ్స్ వెళ్ళి, అక్కడ్నుంచి నాంపల్లి, పబ్లిక్ గార్డెన్స్ తిరిగి టాంక్ బండ్ గుండా వచ్చి మళ్ళీ బషీర్ బాగ్ వైపు దూసుకుపోయాడు. అక్కడ్నుంచి సైకిలైన్ రోడ్డుపట్టి ఆబిడ్స్లో తేలాడు మళ్ళీ. అక్కడ్నుంచి తిన్నగా కోఠీ వెళ్ళి, ఆ తర్వాత బేగం బజార్ వైపు ఉరికించాడు. ఫైనల్ గా గోషా మహల్ వెళ్ళి—వెళ్తూ సరిగ్గా గాంధీ భవన్ దగ్గర అదృశ్యమయ్యాడు!"

"నువ్వెలా పోనిచ్చావు, ఫూల్!"

"షటప్, నన్ను తిట్టకు! ఏం చెయ్యమంటావు? హెవీ ట్రాఫిక్! చీకటి! పైగా వెధవ వర్షం ఒకటీ! గంటసేపూ ఎలాగో తప్పిపోనివ్వలేదు. కానీ గాంధీభవన్ దగ్గర ఎలా మాయమయ్యాడో అర్థంగావడంలేదు. ఏ సందులో దూరాడో తెలియడంలేదు. యింతసేపూ వెతికి నీకు ఫోన్ చేస్తున్నాను...."

"సరే....నువ్వొచ్చేయ్."

"ఎక్కడికి?"

"అతనింటికి, నేనక్కడుంటాను."

లాల్ లైను కట్ చేసి, నందనరావ్ యింటికి ఫోన్ చేశాడు. రెస్పాన్స్ లేదు. టైము చూశాడు. 7-40. పది నిమిషాలాగి మళ్ళీ చేశాడు. అప్పుడూ సమాధానంలేదు. ఫోన్ పెట్టేసి విసురుగా లేచి, రెయిన్ కోటు నందుకొని బయటికి దారితీశాడు.

ఆఫీసుకు తాళం వేసి, కోటు తొడుక్కుంటూ వేగంగా కిందికి ఉరికాడు. కనిపించిన టాక్సీలో ఎక్కి అడ్రసు చెప్పి వేగం పోనివ్వమన్నాడు. పన్నెండు నిమిషాలకి చేరుకుంది టాక్సీ. లాల్ దిగి ఫేర్ చెల్లించి పంపేశాడు. గడియారం చూసుకుని, రోడ్డు వారగా ఆగి వున్న ఫియట్ కారు వద్దకి నడిచాడు. సమయం ఎనిమిది దాటి పదమూడు నిమిషాలైంది.

"నువ్వెంతసేపయింది వచ్చి?" అడిగాడు కారులోని జాన్‌ని.

"ఇప్పుడే—రెండు నిమిషాలైంది వచ్చి!" అన్నాడు జాన్.

"ఆమె లోపల వుందా?"

"వుండాలి. లైట్లు వేసివున్నాయి."

"కానీ నేను ఫోన్ చేస్తే ఎందుకు పలకలేదు?"

"ఏమో, నాకు మాత్రం ఇంట్లో కదలిక కనిపించడం లేదు."

"వెళ్ళి చూద్దాం కమాన్!"

జాన్ కారు దిగాడు. ఇద్దరూ గేటు తీసుకొని లోపలికెళ్ళారు. వర్షం పూర్తిగా వెలిసిందిప్పుడు....లాల్ కోటు జేబులోంచి టార్చ్ తీసి నేలమీద వేశాడు.

"ఏం చూస్తున్నావు?"

"రావ్ వచ్చాడేమోనని — లేక వచ్చి వెళ్ళాడేమోనని—"

"వెల్, టైర్ ప్రింట్స్ వర్షంలో కొట్టుకుపోతాయి."

ఇద్దరూ మెట్లెక్కి వెళ్ళి బెల్ నొక్కారు. రెండు నిమిషాలు అసహనంగా కాచుకున్నారు. నెట్టబోతే తలుపు తెరుచుకోలేదు. లోపల అలికిడిలేదు. ఇంతలో తలుపుతీసి ఆమె గాభరాగా చూసింది.

"మీరు....మీరా! ఇంత రాత్రి....?" ఆమె మాటలు ముద్దుగా వెలువడ్డాయి.

లాల్ వెనక్కి తగ్గాడు. "అవును, మీతో అత్యవసరంగా మాట్లాడాలి."

"ఏం మాట్లాడాలి?"

లాల్ చొరవచేసి లోపలికెళ్ళిపోయాడు. "చలి పెడుతోంది, తలుపు వేయండి."

జాన్ చటుక్కున లోపలికి అడుగు పెట్టాడు.

ఆమె ఇంకా గాభరాగా చూసింది, "ఎందుకు? ఏం జరిగింది?"

అప్పుడు గమనించాడు లాల్ ఆమెని పరిశీలనగా,

ఆమె అప్పుడే హడావుడిగా దుస్తులు కట్టుకున్నట్టు కనిపిస్తోంది. వంటి మీద అక్కడక్కడా నీటి బిందువులున్నాయి. శిరోజాలు కూడా పచ్చిగా వున్నాయి. కళ్ళు తీక్షణంగాలేవు.

"మీరెక్కడికెళ్ళారు?" అడిగాడతను వెంటనే.

"ఎక్కడికీ లేదు."

"ఇందాక రెండుసార్లు ఫోన్ చేశాను, మీరు పలకలేదు."

"బహుశా స్నానం చేస్తూంటాను."

"ఈ వేళప్పుడు స్నానమా....?"

"సాధారణంగా ఆరు గంటలకే చేస్తాను. ఇవాళ ఆలస్యమైంది. ఈ వర్షంవల్ల బద్ధకమేసింది...."

డిటెక్టివ్‌లు ఒకర్నొకరు చూసుకున్నారు.

"కానీ మీరు దుస్తులెందుకు హడావుడిగా కట్టుకున్నారు?" జాన్ అడిగాడు.

"మీరు బెల్ కొట్టినప్పుడు కంగారులో...."

"మీ ఆరోగ్యం బాగాలేదా, మాడమ్?"

ఆమె ఫకాలున నవ్వింది. "ఏం మనుషులు! ఆరోగ్యం బాగాలేకపోతే స్నానం చేస్తానా?"

"మీ గొంతులో మార్పు వచ్చింది" అన్నాడు లాల్ ముందుకు జరిగి.

ఆమె మళ్ళీ నవ్వింది అదోలా. లాల్ వాసన పసిగట్టాడు. జాన్ కూడా పసిగట్టాడు. తిరిగి యిద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు.

"క్షమించాలి, మీరు తాగారా?" అడిగాడు జాన్.

"ఏమిటిది, జాన్? ఏమిటీ ప్రశ్నలు? నేను తాగితే మీకెందుకు?"

లాల్ అన్నాడు. "ఉదయం మిమ్మల్ని కలిసినప్పుడు వేరే అభిప్రాయం కలిగింది. మీరు తాగుతారనుకోలేదు."

ఆమె నిర్లక్ష్యంగా భుజాలెగరేసింది.

"ఇంట్లో తాగుతాను, వంటరిగా తాగుతాను, తప్పా?"

"నో, ఓ..కే! మీవారిక్కడకొచ్చారా?"

"లేదు, రాలేదు."

"వెల్, ఆయన తప్పించుకున్నారు. ఎక్కడికెళ్ళారో మీకు తెలుసా?"

"మీరు ఆయన్ని వెంటాడారా?"

"జాన్ వెంటాడాడు. కానీ ఆయన తప్పించుకున్నారు—"

"సారీ, నేనేమీ చేయలేను."

"చూడండి ఇప్పుడు సమయంలేదు. జయ అవతల అపాయంలో వుంది. మీరింకా బుకాయిస్తూ కూర్చోలేరు. ఆయన ఎక్కడికెళ్ళారో చెప్పండి. మేం ఆమెని కాపాడకపోతే అందుకు మీదే బాధ్యత అవుతుంది—"

"ఊరుకోండి, లాల్. ఆమెకు అపాయమేమిటి? వారిద్దరు ప్రేమించుకున్నారు. కలిసి తిరుగుతున్నారు. మధ్యలో మీకేమిటి అభ్యంతరం? నాకుండాలిగాని—"

"మీకు లేదా?"

"ఎందుకు లేదు? వుంది, వుంటుంది, వుండదా? కానీ మీరు నాకెలా తోడ్పడుతారా అని ఆలోచిస్తున్నాను ఉదయంనుంచీ!"

"అంటే?"

"ఏమీలేదు లాల్, నా షరతు ఒప్పుకోండి. ఆయనెక్కడున్నారో చెప్తాను."

"ఏమిటది?"

"వాళ్ళిద్దరు రహస్యంగా కలుసుకుంటారని నాకు సాక్ష్యం కావాలి."

"ఏం చేస్తారు?"

"విడాకులు తీసుకుంటాను."

"వెల్ వెల్, ఈ ఆలోచన సాయంత్రం నేనన్నప్పుడు వచ్చిందేమో!"

"ఈ ఆలోచన నాకు చాలా రోజులుగా వుంది."

"వెల్, ఏ విధమైన సాక్ష్యం కావాలి?"

"ఫోటోలు, మీరు ఫోటోలు తీసి నాకివ్వాలి. కెమేరా నేనే ఇస్తాను. మీరు అక్కడికెళ్ళండి. ఆపదా గీపదా ఏమీలేదు. వాళ్ళిద్దరు ఒకరి బాహువుల్లో ఒక రుంటారు. చక్కగా కొన్ని ఫోటోలు తీసి తిరిగిరండి, అయిదు వేలిస్తాను."

"పటవ్! పటవ్, యూ సిల్లీ ఫూల్!"

"నన్ను మీరు తిడుతున్నారా, మిస్టర్ లాల్?"

"లుక్ మిసెస్ రేణుక, మీరు వేళాకోళం చేయ దల్చుకుంటే మరోసారి వస్తాం. ఇప్పుడు సందర్భంకాదు. సమయం లేదు. మీరు వెంటనే చెప్పకపోతే పోలీసుల్ని పిలవ్వాలసి వస్తుంది."

ఆమె నిస్సహాయంగా సోఫాలో కూలబడింది. "మీ మీద ఎంత ఆశ పెట్టుకున్నాను.... ఈ అభాగినిమీద మీకు జాలిలేదా, మిస్టర్ లాల్? ఈ రేణూమీద? ఏ సుఖ సంతోషాలకూ నోచుకోని ఈ పిచ్చిదానిమీద?"

"వుంది. కానీ మీ రనుమానిస్తున్నట్లు వారిద్దరు ప్రేమికులు కారు!"

"కారా.... నిజమా?"

"ఇది నిజం. ఇది లవ్ ఎఫైర్ కాదు, వాళ్ళ బిజినెస్ గొడవ!"

"అంతేనా, లాల్?"

"మమ్మాటికీ అంతే! మీరిప్పుడు సరైన స్థితిలో లేరు. తెలివిలోకొస్తే అంతా బోధపడుతోంది."

"సరే. లాల్....మిమ్మల్ని నమ్ముతాను, మీరు నాకు అన్యాయం చెయ్యరు. అయితే వెళ్ళండి, కంచన్ బాగ్‌లో ఆయనకు గెస్టుహౌస్ వుంది. పెద్ద మనుషులకు విడిది ఏర్పాటు చేస్తూంటారు....జయని అక్కడే వుంచి వుంటారు."

"థాంక్స్, పూర్తి అడ్రసు యివ్వండి."

ఆమె చెప్పింది.

"వెల్, జాన్, నువ్వొంటనే వెళ్ళు! నేనిక్కడే వుంటాను. రావ్ నిరాకరిస్తే నాకు ఫోన్ చెయ్!"

"ఓ.కే, పార్టనర్" జాన్ కదిలాడు.

లాల్ కోపం అణుచుకుంటూ ఆమెవైపు తిరిగాడు.

"మీకెవరూ లేరా?"

"ఎందుకు లేరు, మావారున్నారుగా?"

"ఆయనతో మంచి సంబంధాలు లేవుగా?"

"అయితే?"

"అలాంటపుడు బయట స్నేహాలుండాలి. మీరు వాళ్ళ సలహాలు పొందుతూండాలి. సాయంత్రం మీరు వాళ్ళని కలుసుకుని వచ్చారు. అక్కడే తాగారు. వర్షంలో తడిసివచ్చారు కాబట్టి వొళ్ళు తుడుచుకొని దుస్తులు మార్చుకున్నారు. కానీ స్నానం చేసినట్టు మీరు బుకాయించారు. ఈ విషయంలో మీరు పూర్తిగా అబద్ధాల కోరు."

ఆమె తలెత్తి కోపంగా చూసింది.

"స్నేహితుల్ని అంత రహస్యంగా వుంచే అవసరమేమిటి, మిసెస్ రేణుక?"

ఆమె ఇంకా కోపంగా చూసింది. కానీ జవాబు చెప్పే అవసరం కలగలేదు.

ఫోన్ మోగింది హఠాత్తుగా.

లాల్ గబుక్కున వెళ్ళి రిసీవరెత్తాడు.

"హాలో, లాల్!" అరిచింది జాన్ గొంతు.

"ఎస్, జాన్?"

"మర్డర్స్."

లాల్ రిసీవర్ తీసి కుడిచేతికి మార్చాడు, "మళ్ళీ చెప్పు?"

"మర్డర్స్."

"డబుల్?"

"ఎస్."

"ఎవరు?"

"నందనరావు, జయ."

"ఎక్కడ?"

"గెస్టుహౌస్‌లోనే."

"ఎలా?"

"బుల్లెట్ గాయాలతో పడి వున్నారు, అతనికి గుండెలో, ఆమెకు తలలో. నేలమీద పడివున్నారు. అంతా రక్తం. ప్రక్కనే రివాల్వర్ వుంది. రెండుగుళ్ళు ప్రేల్చబడ్డాయి అందులో. గంట దాటివుండాలి జరిగి ... శవాలు ఇప్పుడిప్పుడే చల్లబడుతున్నాయి. ఇప్పుడు టైం తొమ్మిది కావస్తోంది....గదంతా చిందరవందరగావుంది. చాలా ఘర్షణ జరిగింది. దుస్తులు చినిగాయి, వస్తువులు

విని శేసుకున్నారు ..."

"ఆ దృశ్యంలో ఒరిజినాలిటీ కనిపిస్తోందా నీకు?" అడిగాడు లాల్.

"అవును, వారిద్దరి మధ్య తీవ్ర పోరాటం జరిగింది. సందేహంలేదు, ఇందులో అ స హ జ ం ఏమీ లేదు పార్ట్‌నర్."

"వెల్, నువ్వతన్ని వెంటాడుతున్నప్పుడు మధ్యలో మరో వాహనం ఏదైనా కనూవుండటం గమనించావా?"

"లేదు, అలాంటిదేమీ లేదు."

"టైర్ ప్రింట్స్? అడుగుజాడలు?"

"అవేవీ యిక్కడ లేవు. సంఘటన జరిగినపుడు వర్షం కురుస్తోండాలి. వర్షంలో ఏర్పడిన గుర్తులన్నీ ఎప్పటి కప్పుడు కొట్టుకు పోతాయి."

"వెల్ నువ్వు కృష్ణన్‌ని పిలువ్."

"నువ్వు రావా?"

"నేను రాను" లాల్ ఫోన్ పెట్టేసి ఆమె వైపు తిరిగాడు. "వెల్, అనుకున్నదంతా అయింది!" అన్నా డతను.

"ఏమైంది?"

"మీకు తెలుసు, రేణుక! మీరు అవకాశవాది, అబద్ధాలకోరు, చక్కటి నటి! మొదట మీ మనసులో విడాకుల ఆలోచన. పిదప పరిస్థితిని చూసి ధనాశ! మీ రెవర్ని ప్రేమిస్తున్నారో నాకు తెలీదు. కానీ ఒకర్ని ప్రేమిస్తున్నారు బయట. అతనితో ఈ సాయంత్రం మీరు గెస్టుహౌస్‌కి వెళ్ళారు. అక్కడ మీ వారినీ, జయనీ శాశ్వతంగా వదిలించుకుని తిరిగి వచ్చారు."

"నో, లాల్, నో! ఓహ్, ఏమిటి మీరనేది!"

"సింపుల్. ఉదయం మీరు బీరువాలో రివాల్వర్ కోసం చూశానన్నారు. యెందుకు చూడవలసి వచ్చింది అంత ప్రత్యేకంగా? అదేమీ కాదు, అలా చెప్పి మిమ్మల్ని ముందుగానే రక్షించుకోవాలనుకున్నారు. రాత్రి మీ వారు జయని హోటల్ నుంచి గెస్టుహౌస్‌కి మార్చాక, ఆమె కిచ్చిన రివాల్వర్ యింటికి తీసుకొచ్చారు. ఉదయం మీరు బీరువాలోంచి తొలగించారు. పరిస్థితుల్ని జాగ్రత్తగా గమనించారు, అవకాశం చూశారు. సాయంత్రం మీ వారు గెస్టుహౌస్‌కు వెళ్ళారని తెలిసి, మీ బాయ్‌ఫ్రెండ్‌తో హుటాహుటిన వెళ్ళి వాళ్ళిద్దర్నీ షూట్ చేసి రివాల్వర్ అక్కడ పడేసి వచ్చారు—"

ఆమె చటుక్కున లేచి లాల్ మీద దాడిచేయబోయింది. లాల్ వెంటనే తప్పుకొని, "ఐ హేట్ యూ!" అన్నాడు రెయిన్‌కోటును అందుకొంటూ.

# 8

తలుపు తీసి వాళ్ళు ముగ్గురు త్రుళ్ళిపడి చూశారు—

లాల్ నవ్వాడు. "హలో గ్యాంగ్!" పలకరించాడు. ముందు కామేశ్వరరావు తేరుకొని, "మిస్టర్ లాల్, యింత రాత్రి....?" అన్నాడు.

లాల్ తలూపాడు కోటు విప్పుకుంటూ.

ఆచారి, ప్రసీల్ లు అలాగే కలవరంగా చూస్తున్నారు. వాళ్ళ బట్టలు తడిసి వున్నాయి.

"అడ్వెంచర్?" అడిగాడు లాల్.

వాళ్ళు వెంటనే కాదన్నట్టు తలూపారు.

"మీ జంట బాగుంది!" అన్నాడు లాల్, రావ్ వైపు తిరుగుతూ. "మీకు మంచి శిష్యులే దొరికారు, మిస్టర్ రావ్."

రావ్ చట్టుపక్కన కొడుకుని చూశాడు. "ప్రసీల్! నువ్వెళ్ళు, బట్టలు మార్చుకో, జలుబు చేస్తుంది!"

"అలాగే డాడీ!" ప్రసీల్ లోపలికి పరుగుతీశాడు.

లాల్, ఆచారిని పరిశీలనగా చూశాడు. "మీరిద్దరెలా తడిశారు?"

"తోటలో నీరు మడుగు కట్టి నిలిస్తే తవ్వి కాలువ తీశారు" అన్నాడు రావ్.

"ఓహ్, మంచి పనులే చేస్తాడు మీ ఆచారి! అవును కాలువ తీశాడు, రైతు వీరుడు కదూ?"

"మీ రెక దుకొచ్చారింతకీ?"

"మీ ప్రత్యర్థి ట్రాజెడీ గురించి."

"నా ప్రత్యర్థా? ఎవరతను?"

"ప్లీజ్, బుకాయించకండి. ఈ బుకాయింపులతో నా తల వాచిపోయింది. సూటిగా విషయానికొద్దాం. మీరు ఏడు—ఎనిమిది ప్రాంతాల ఎక్కడున్నారు?"

"ఆఫీసులో! ఎందుకు?"

"ఎలిబీ యివ్వగలరా?"

"ఇవ్వగలను! ఎందుకు?"

"ఎందుకో మీకు తెలుసు. మీకు రివాల్వర్ వుంది కదూ?"

"వుంది—"

"ఏది?"

"లోపల వుంది—దేనికి? ఏం జరిగింది?"

"మీకంతా తెలుసు."

"నాకేం తెలీదు!" అరిచాడు రావ్ కోపంగా, "లాల్, మళ్ళీ నామీద ఏం ఆరోపిస్తున్నారు?" మధ్యాహ్నం నేను ఏమని హెచ్చరించాను?"

"ఓహ్, బోర్! మీ హెచ్చరికని మీరే నమిలి మింగేస్తారిప్పుడు. మిమ్మల్ని రెండు హత్యల్లో అనుమానిస్తున్నాన్నేను—"

"ఏమిటీ, హత్యలా!"

ఆచారి గబుక్కున ముందుకొచ్చాడు. "మీరిలా చేయలేరు, లాల్! మీ డిటెక్టివ్ దర్పం ఇలా చూపించలేరు!"

"నే నేమైనా చేయగలను. గెటవుట్, రివాల్వర్ కావాలి నాకు!"

"సరే, భయమెందుకు? మేమేం చేశామనీ! మీకు నా రివాల్వర్ చూడాలి, అంతే కదా? అయితే చూడండి, తెస్తాను—"

రావ్ వేగంగా అవతలి గదిలోకి కదిలాడు. ఆచారి జాలిగా చూశాడు లాల్‌ని. అలా వెళ్ళినవాడు రెండు నిమిషాల్లో పరిగెత్తి వచ్చాడు రావ్, గాభరాగా. "పోయింది!" అరిచాడతను చేతులెత్తి.

"గుడ్, నటించండి!" అన్నాడు లాల్, "గో ఎహెడ్, మోర్ డైలాగ్!"

రావ్ నిస్సహాయంగా ఆచారివైపు చూశాడు.

"ఎలా పోయింది, రావుగారూ!" అరిచాడు ఆచారి.

"ఏమో! ఆ సొరుగులో నే పెట్టాను, తాళం కూడా వేశాను!"

"ప్రసీల్‌ని అడిగారా?"

"తెలీదట! తీయలేదట!"

"అందులో గుళ్ళున్నాయా, రావుగారూ?"

"అందుకే కదా ఈ కంగారు! అర్థంకావడంలేదు, ఎలా పోతుంది?"

లాల్ అన్నాడు, "నేను చెప్తాను, కావాలని పోగొట్టేశారు."

"కావాలని పోగొట్టేశామా!"

"లేక అలా నటిస్తున్నారు, ఎక్కడో దాచేసి."

"మీరు అవాస్తవాలు పలుకుతున్నారు!"

"ఇది కూడా వినండి — దాన్ని ఆచారి పట్టుకెళ్ళి మీ ఆదేశం మేరకు నందనరావ్‌నీ జయనీ షూట్ చేశాడు. వాళ్ళిద్దరప్పుడు ఎందుకో మర్షణ పడుతున్నారు. ఆచారి వాళ్ళని చంపేసి, అక్కడ వున్న రావ్ రివాల్వర్‌లో రెండు గుళ్ళు పేల్చి, వేలిముద్రలు చెడకుండా జాగ్రత్తగా వదిలి వచ్చేశాడు. చూసిన వాళ్ళకు అది వాళ్ళిద్దరి పెనుగులాట ఫలితమని తెలుస్తుంది—అందుకు తగినట్టు గదిని చిందరవందర చేశాడు."

"నో, లాల్! నో! వాళ్ళని ఎందుకు చంపుతాం?"

"మీ మోటివ్ మాకు బాగా తెలుసు."

"అది పూర్తిగా అబద్ధం! నిరాధారం!"

"అయితే వీళ్ళు తోటలో కాలువ తీసింది నిజమా?"

రావ్ తృళ్ళిపడ్డాడు. తిరిగి ఆచారిని చూశాడు నిస్సహాయంగా.

లాల్ అన్నాడు "ప్రాణాలు తీశారు, కాలువకాదు. ప్రసీల్ కూడా ఆచారితో వెళ్ళి వుంటాడు. మీరింకా బుకాయించలేరు. మీరు నిజంగా నిర్దోషి అయితే ఆ రివాల్వర్ స్వాధీనం చేయండి—మీ రివాల్వర్, అది ఎంతో వుపయోగపడుతుంది."

"నిజం లాల్. దాన్ని మేం దాచలేదు, మాయం చెయ్యనూ లేదు. అదెలా పోయిందో తెలియడంలేదసలు!"

"ఐ పిటీయూ!"

"మమ్మల్ని — మమ్మల్ని ఖ్రూసికోర్ల ముఠా అనుకుంటున్నారా మీరు మిస్టర్ లాల్?"

లాల్ నవ్వాడు కోటు తొడుక్కుంటూ, "అదే నిజమైతే — మీ అంతటి వరస్టు ముఠా నే నెక్కడా చూడలేదు!"

## 9

మర్నాడుదయం పదకొండున్నరకి డిటెక్టివ్ లు ఇన్స్పెక్టర్ బాలకృష్ణన్ ని కలుసుకున్నారు. అతను బిజీగా, అలసటగా కనిపించాడు.

"ఫ్రెండ్స్ అన్నీ జెట్ స్పీడులో పూర్తయ్యాయిగానీ, ఇంకా ఏదీ లిఖితపూర్వకంగా అందలేదు" అన్నాడతను.

"ఫ్లాష్ పాయింట్స్ వినిపించండి. ఆటోప్సిస్టు ఎవరు?"

"డాక్టర్ రఘునాథ్. తెల్లారి లేస్తూనే శవాల్ని కోశాడాయన. రెండు బుల్లెట్స్ తీశాడు, చెరో శవం లోంచి. వాటిని ఇస్కిందర్ కిచ్చాను. టెస్టు పూర్తి చేసుకుని అతనిందాకే అందించాడు వాటిని—ఆ రెండు బుల్లెట్స్‌లో ఒకటి ఆ రివాల్వర్ లోంచి — హత్యాస్థలంలో దొరికిన నందనరావ్ రివాల్వర్ నుంచి వెలువడలేదట."

"మరి?"

"మరో రివాల్వర్ లోంచి వెలువడిందట. రెండు రివాల్వర్స్ పాత్ర వహించాయి." కృష్ణన్ డెస్కులో నుంచి రెండు చిన్న కార్డుబోర్డు బాక్సులు తీసి, వాటిలో దూదిలో చుట్టివున్న రెండు బుల్లెట్లు తీసి ముందు

పెట్టాడు.

"ఈ A మార్క్ చేసిన బుల్లెట్ రావ్ శవం లోనిది—" అన్నాడతను ఒకదాన్ని చూపిస్తూ, "ఈ B మార్క్ బుల్లెట్ జయ శవంలోనిది. A బుల్లెట్ నందనరావ్ రివాల్వర్ లోంచి వెలువడలేదు. ఇక ఈ B బుల్లెట్ రివాల్వర్ని నిర్ధారించడం సాధ్యం కాలేదు."

"ఎందుకు?" అడిగాడు లాల్, వాటిని పరిశీలిస్తూ.

"దానిమీద రేఖాకృతులు — స్ట్రియేషన్స్ చెరిగి పోయాయి" కృష్ణన్ రెండు మైక్రో ఫోటోగ్రాఫులుతీసి ముందు పరేశాడు. జాన్ వాటిని అందుకున్నాడు.

"అవును, ఈ B బుల్లెట్ మీద స్ట్రియేషన్స్ దెబ్బ తిన్నాయి. బుల్లెట్ బాగా డామేజి అయింది" అన్నాడతను.

"ఎలా?" అడిగాడు లాల్ కృష్ణన్ని.

"రాపిడికి గురయిందంటున్నాడు ఇస్కెందర్, గోడతోనో, మరో గరుకుతలంతోనో."

"ఒకవేళ రివాల్వర్ మజిల్ లోపల గ్రూవ్స్ చెడి పోయాయేమో?" అన్నాడు జాన్.

కృష్ణన్ అడ్డంగా తలూపాడు. "ఫోటోగ్రాఫ్ చూడండి. టెస్టు బుల్లెట్ మీద స్ట్రియేషన్స్ స్పష్టంగా ఏర్పడ్డాయి. నందనరావ్ రివాల్వర్. ఈ రెండు బుల్లెట్లు ఒకే క్యాలిబర్వి. నందనరావ్ రివాల్వర్ కూడా అదే క్యాలిబర్ది. గ్రూవ్స్ అరిగిపోలేదు. అరిగిపోతే బుల్లెట్ పలాయనం కష్టమవుతుంది. వేగం వుండదు."

"ఓ.కే, రావ్ని చంపింది అతని రివాల్వర్ కాదు. జయని చంపింది కూడా అతని రివాల్వర్ అని తేలలేదు.

కానీ ఆ రివాల్వర్‌లో రెండు గుళ్ళు తక్కువ వున్నాయి. ఏమిటి దీని అర్థం? అవెప్పుడు పేల్చబడ్డాయి?"

"రాత్రే, ఫౌల్ గేమ్, మిస్టర్ లాల్."

"అవును, రెండు రివాల్వర్స్ పాత్ర అక్కడ మూడో వ్యక్తి ఉనికిని సూచిస్తోంది. కామేశ్వరరావు తన రివాల్వర్ పోయిందంటున్నాడు. ఈ బుల్లెట్లు ఆ రివాల్వర్ నుంచే వచ్చి వుండాలి. రావ్—జయ ఘర్షణ పడుతున్నప్పుడు మరో వ్యక్తి యెవరో పొంచివుండి కాల్పులు జరిపాడు—అది స్త్రీ అయితే—జరిపింది.

"వెల్, వాళ్ళు చనిపోయాక అది వాళ్ళిద్దరి మధ్య ఘర్షణ ఫలితమని సూచించడానికి, నందనరావ్ రివాల్వర్ లో రెండు గుళ్ళు గాల్లోకి పేల్చి అక్కడ పడేసి వెళ్ళిపోయారు. ఆ రివాల్వర్ మీద యెవరి వేలిముద్ర లున్నాయి?"

"అతనివీ, జయవీ, కానీ లాల్, ఆ స్త్రీ యెవరని మీ వుద్దేశం?"

"ఇంకెవరు, అతని భార్య. ఆమెతో ప్రేమిక ఉంటాడని నా అనుమానం. చావులెప్పుడు సంభవించాయని డాక్టర్ సూచన?"

"రాత్రి ఏడూ యెనిమిదీ మధ్య."

"ఐసీ, ఆమె ఏడూ యాభైవరకూ యింట్లో లేదు. 7-50—8-10 మధ్య యింటికొచ్చింది. ఆ తర్వాత మూడు నిమిషాలకి మేం వెళ్ళాం."

"కానీ ఆమె కామేశ్వరరావ్ రివాల్వర్ తో వెళ్తుందా? లేక ఆమె బాయ్‌ఫ్రెండ్‌కు రివాల్వర్ వుందా?"

"వెల్, అక్కడే వస్తోంది చిక్కు. మొదట ఆమె

భర్త రివాల్వర్‌తోనే వెళ్ళిందనుకున్నాను. కానీ మరో రివాల్వర్ పాత్ర, కామేశ్వర్రావ్ తన రివాల్వర్ పోయిందని చెప్పడం చూస్తే—యిద్దరూ కూడబలుక్కున్నారనిపిస్తోంది. ఒకరికి తెలియకుండా ఒకరు వెళ్ళి వుంటారు. యిద్దరికీ మంచి మోటివ్స్ వున్నాయి. ఘర్షణ జరిగినప్పుడు రేణుక—లేక ఆమె బాయ్ ఫ్రెండ్ కాల్చి వుంటాడు. కానీ అనుభవం లేకనో, మరెందుకో బుల్లెట్ అడ్డదిడ్డంగా గోడకో, మరి దేనికో రాసుకుంటూ వెళ్ళి, జయ తలలో దూరి వుంటుంది—

"అప్పుడు మరోవైపునుంచి కామేశ్వర్రావో, లేక అతని అనుచరుడో నందనరావు మీదికి కాల్చివుంటాడు. అతను కూడా నేలకూలడంతో, హంతకులిద్దరు ఒకర్నొకరు పసిగట్టి వుంటారు. అంతే—అప్పుడు కూడ బలుక్కుని అక్కడ తగిన విధంగా దృశ్యాన్ని సృష్టించి ఉడాయించి వుంటారు."

"ఆమె భాయ్‌ఫ్రెండ్‌కు రివాల్వర్ ఉండొచ్చా?"

"ఆ బాయ్‌ఫ్రెండ్ ఎవరో, అతని స్థితిగతులేమిటో నాకు తెలీవు."

"సరే, అయితే ఈ మైక్రోఫోన్ సంగతేమిటి?" అంటూ ఒక పొడవాటి తీగలో వున్న మైక్రోఫోన్‌ని టేబిల్ మీద పెట్టాడు కృష్ణన్.

లాల్ దాన్ని తికమకగా చూశాడు. "అదెక్కడిది?"

"అక్కడే వరండావైపు కిటికీలో వుంది, లోపలికి వ్రేలాడుతూ. తీగ బయట వ్రేలాడుతోంది...."

జాన్ దాన్ని తీసుకొని, తీగ రెండో చివర జాక్ పిన్‌ని చూశాడు.

"ఇదేవో టేప్ రికార్డర్ కి అమర్చి వుండాలి" అన్నాడతను.

"ఇదెక్కడి గొడవ!" కసురుకున్నాడు లాల్.

"ఎవరో రావ్-జయుల మాటలు రికార్డు చేసి వుంటారు. హడావుడిలో దీన్నిక్కడే వదిలేసి వెళ్ళి పోతారు."

"అప్పుడు కిటికీలన్నీ మూసివున్నాయా?"

"లేవు. తోటవైపూ, వరండావైపూ అభిముఖంగా వున్న రెండు కిటికీలూ తీసే వున్నాయి. వర్షపు జల్లు ఆ దిశలో పడ్లేదు. గాలి తూర్పుదిక్కుగా వీచింది. కిటికీలు ఉత్తర-దక్షిణ దిక్కుల్లో వున్నాయి. అందుకే మూయ లేదనుకుంటాను."

"అయితే ఈ టేప్ రికార్డర్ మనిషి మరొకడా?"

"లేకపోతే మాటలు రికార్డు చేసి చంపే అవసరం యేమిటి?"

"కిటికీలమీద వేలిముద్రలు?"

"వున్నాయి. వరండావైపు కిటికీమీద వేలిముద్రలు, ఈ మైక్రోఫోన్ మీద వేలిముద్రలతో కలుస్తున్నాయి. అవి ఎవరివో ఇంకా తెలుసుకోలేదు."

"అడుగు జాడలు? టైర్ ప్రింట్స్?"

"లేవు, అప్పుడు వర్షం కురుస్తోంది. అదే వర్షంలో హంతకులు పారిపోయి వుంటారు. ఆ గుర్తులన్నీ కొట్టుకు పోయాయి."

"మేం ఆ గెస్టుహౌస్ కి వెళ్తాం."

"ఎందుకు?"

"ఈ B బుల్లెట్ ఎలా డ్యామేజి అయిందో తెలుసుకోవాలి. తిరిగి వచ్చి మీకు చెప్తాం."

"అలాగే, కానీ కామేశ్వరరావుకి ఇందులో ఎటువంటి భాగం లేకపోతే, సరిగ్గా ఈ పరిస్థితుల్లో నే రివాల్వర్ పోయిందనడం సమంజసంగా లేదు."

"అతను నిర్దోషి అని ఎవరన్నారు? చర్య తీసుకోండి. ఆ రివాల్వర్ వైనం తెలుసుకోండి. ఏమిటి సందేహం?"

"మరి ఆమె బాయ్‌ఫ్రెండ్?"

"అన్నీ తెలుస్తాయి, కృష్ణన్. ఈ B బుల్లెట్ రివాల్వర్‌ని నిర్ధారిస్తే, అనుమానితులందర్నీ లాక్కొచ్చి దోషిని యేరి పారెయ్యొచ్చు!" అన్నాడు లాల్ పైకి లేస్తూ.

# 10

ఫోరెన్సిక్ లాబ్ డైరెక్టర్ ఖాదిల్కర్ అనుమతితో, బాలిస్టిక్స్ ఎక్స్‌పర్టు ఇస్కిందర్, డిటెక్టివ్‌లతో బయలుదేరి వచ్చాడు.

వారి వెంట ఒక ఫోటోగ్రాఫర్ కూడా వచ్చాడు.

అంతా గెస్టు హౌస్‌లోని ఆ గదిలోకి ప్రవేశించారు.

ఇస్కిందర్ భూతద్దం తీసుకుని, వేగంగా తోటవైపు కిటికీ దగ్గరికి కదిలాడు. దాని ఫ్రేము, రెక్కలు, చుట్టూ గోడ అంచులూ, చకచకా పరీక్షిస్తూ రెండు నిమిషాల్లో తల విదిలించాడు. "నో సర్, ఈ కిటికీ కాదు" అన్నాడతను.

డిటెక్టివ్‌లు వరండావైపు కిటికీని పరిశీలిస్తున్నారు. ఇస్కిందర్ వెనక్కి వచ్చి గదిలో గోడల్ని చూడసాగారు. డిటెక్టివ్‌లు కిటికీ దగ్గర్నుంచి కదిలి గదిలో వస్తువుల్ని చూడసాగారు. అప్పుడు లాల్ చటుక్కున

తల పైకెత్తి సీలింగ్‌ని చూశాడు. అతని కళ్ళు మెరిశాయి. "లుక్! అదేమిటి?" అరిచాడతను.

ఇస్కిందర్ గబుక్కున వెనక్కి తిరిగాడు. అందరూ పైకి చూశారు.

ఇస్కిందర్ పెదవులపై చిరునవ్వు మెరిసింది. "అదే, మిస్టర్ లాల్!" అన్నాడతను.

వెంటనే అక్కడోక బల్లను లాగి, దానిమీద స్టూలు పెట్టి ఎక్కాడు. సీలింగ్‌లో ఆ నల్లటి మరకను భూతద్దంలోంచి చూశాడు.

సీటింగ్ తలానికి కొంచెం ఏటవాలుగా, అరంగుళం పొడవులో, పావుఅంగుళం లోతులో, ఒక గాడి ఏర్పడి వుంది. దానికి ఇరుప్రక్కలా నల్లటి మసి వుంది. ఇస్కిందర్ తలూపాడు. "నో డౌట్, యిది బుల్లెట్ తాకిడి."

"కానీ సీలింగ్ కెలా తగిలింది? కింద మనిషికి గురి పెడితే?" అన్నాడు జాన్.

"రికొషెట్ బుల్లెట్, మిస్టర్ జాన్" ఇస్కిందర్ అన్నాడు దిగుతూ, "బుల్లెట్ ఇక్కడ తగిలి పరావర్తనం చెందింది."

"ఎలా?"

"రివాల్వర్ నాసిరకం అయినప్పుడు, లేదా బుల్లెట్ వేగం తక్కువ వున్నప్పుడు, దాని అంత్యదశ సమీపించే దూరంలో, భేదించలేనంత దృఢమైన లక్ష్యాన్ని ఢీకొంటే బుల్లెట్ పరావర్తనం చెందుతుంది.

"వాళ్ళిద్దరు పెనుగులాడుతున్నప్పుడు ఒకరివద్ద రివాల్వర్ ఉందనుకోండి, అప్పుడు చేతిలో ప్రమాదవశాత్తున పేలితే బుల్లెట్ వెళ్ళి సీలింగ్‌కి తగిలి, చొచ్చుకుపోయే

శక్తి లేక తిరిగివచ్చి ఆ ఇద్దర్లో ఒకరికి తగిలే అవకాశం వుంది. తగిలింది కూడా. ఎవరికో మీకు తెలుసు, ఆ అమ్మాయికి తలలో. నేను శవాన్ని చూశాను. ఆమె తల వెనుక పై నుంచి ఏటవాలుగా పాయింట్ ఆఫ్ ఎంట్రీ వుంది. గాయం చుట్టూ గన్ పౌడర్ అవశేషాలు లేవు. బుల్లెట్ మొదట సీలింగ్ కి తగిలింది కాబట్టి అక్కడ ఏర్పడ్డాయి.

"అంతే, మిస్టర్ లాల్, అది రికోషెట్ బుల్లెట్, అందుకే బాగా డ్యామేజి అయింది. స్ట్రియేషన్స్ చెడిపోయాయి. ఆ బుల్లెట్ నమ్మకంగా మర్డర్ ప్లేస్ లో వున్న రివాల్వర్ లోనిదేనని నే నిప్పుడు చెప్పగలను."

ఫోటోగ్రాఫర్ బల్లమీదెక్కి ఆ గాడిని ఫోటోలు తీయసాగాడు.

## 11

డిటెక్టివ్ లు ఆఫీసుకు తిరిగివచ్చి మెల్లెక్కుతోంటే, కారిడార్ లో బెంచిమీద కూర్చుని ఆచారి ప్రసీల్ లు కనిపించారు.

డిటెక్టివ్ లు ఆగిపోయి చూశారు అనుమానంగా.

వాళ్ళిద్దరు ఏదో సీరియస్ గా చర్చించుకుంటున్నారు.

డిటెక్టివ్ లు వాళ్ళని సమీపిస్తోంటే అది గమనించి వెంటనే లేచి నిల్చున్నారు.

యిద్దరూ నమస్కారం చేశారు.

ప్రసీల్ ముసిముసిగా నవ్వాడు, "సార్, నిన్న పొరపాటు జరిగింది....ఆచారిగారిని నేనపార్థం జేసుకున్నాను. వీరు మా డాడీకి ముఖ్య స్నే...."

"అవన్నీ మీ డాడీ చెప్పాడు. నువ్వేం చెప్పదల్చుకున్నావిప్పుడు?"

"మేము చాలా చెప్పదల్చుకున్నాం, ముందు లోపలికి పోదాం" అన్నాడు ఆచారి.

జాన్ తలుపు తీశాడు. అందరూ లోపలికెళ్ళి కూర్చున్నారు.

"వెల్, ఇప్పుడు చెప్పు ఆచారీ!" అన్నాడు లాల్.

ఆచారి అన్నాడు, "మిస్టర్ లాల్, ఈ వ్యవహారం ఇలా పరిణమిస్తుందని మేమనుకోలేదు. మా ప్రయోజనాల కోసం పడ్డ తాపత్రయమంతా వృధా అయింది. అయినా మాకిప్పుడు ఏమీ ధోకా లేదు. యిప్పుడు మా టెండర్‌కు ముప్పులేదు. ఈ పరిస్థితిని మేం ఏ విధంగానూ వాడుకునే అవసరమే లేదు కాబట్టి, మీతో సహకరించడం చట్టబద్ధంగా తలచాం. పైగా మా నిర్దోషిత్వం కూడా రుజువవుతుంది."

"అవును, చెప్పు."

"మిస్టర్ లాల్, రాత్రి మేం ఇద్దరం చెరో పనిమీద వెళ్ళాం. నందనరావ్ మా టెండర్‌ని దెబ్బతీయాలని ప్రయత్నిస్తోంటే, మేమూ ఎదురుదెబ్బ తీయడానికి పూనుకున్నాం. అందుకు రెండు మార్గాలాలోచించాం. ఆ రెండిట్లో ఏ ఒక్కటి సఫలమైనా మాకు వుపయోగమే. మొదటిది. అతను మా టెండర్‌లో రహస్యాలు తెలుసుకున్నట్టు సాక్ష్యం సేకరించి తద్వారా అతని టెండర్ చెల్లకుండా చేయడం. రెండోది అసలతడు తన టెండర్‌ని స్వయంగా ఉపసంహరించుకునేట్లు చేసే టైంబాంబుని సృష్టించడం. ఈ రెండింట్లో మొదటిది మైనర్ బాబు, రెండోది నేను చేశాం—మైనర్ బాబు తనేం చేశాడో వినిపిస్తాడు—" అని ఆచారి ప్రసీల్ వైపు తిరిగి "మైనర్ బాబూ, ఇక మొదలెట్టు!" అన్నాడు.

ప్రసీల్ చేతులు కట్టుకుని చెప్పసాగాడు. "సార్, నేను డిక్కీలో సరిపోతాను. నందనరావ్ ఎక్కడో రహస్యంగా వుంచిన జయని కలుసుకున్నట్లయితే, వాళ్ళు మా టెండర్ గురించి ఏం మాట్లాడుకుంటారో సేకరించాలని మా డాడీ చెప్పినప్పుడు, నాకో అయిడియా మెరిసింది, సార్.

"నిన్న సాయంత్రం నేను రావ్ ఆఫీసు పార్కింగ్ ప్లేస్‌లోని అతని కారు డిక్కీలో ఎక్కి కూర్చున్నాను. దాన్ని మారు తాళంతో తీశాను, సార్. వెంట ఏర్ బ్యాగులో ఒక టేప్ రికార్డర్ కూడా తెచ్చుకున్నాను. సార్, దానికి ఎక్స్‌టర్నల్ మైక్రోఫోన్ కూడా అమర్చుకున్నాను. అందులో ఓ కేసెట్ వేసుకున్నాను....

"అతను ఆఫీసునుంచి బయల్దేరితే నమ్మకంగా జయని కలుసుకుంటాడని నాకు తెలుసు. అయితే గంటసేపటికి వరకూ యెక్కడెక్కడో తిప్పుతోంటే అందోళన పడ్డాను. ఎందుకలా చేశాడో తెలియలేదు. చివరికి వర్షం పడుతున్నప్పుడు, చీకటయ్యాక ఒకచోట ఆపాడు. అక్కడ చప్పుళ్ళులేవు. నిశ్శబ్దంగా వుంది, వర్షం తప్పితే. ట్రాఫిక్ శబ్దాలు కూడా లేవు, సార్.

"అతను దిగి వెళ్ళిపోయాక, నన్నెవరూ గమనించడం లేదని నిర్ధారించుకుని బైటికొచ్చాను. అప్పటికే అతను ఆ చిన్న యింట్లోకి వెళ్ళిపోయాడు. నేను జాగ్రత్తగా, అడుగుజాడలు పడకుండా వెళ్ళి వరండాలో ఎక్కానుశాండల్స్ విప్పి మెట్లదగ్గరే వదిలేశాను. లేకపోతే వరండాలో బురద మరకలవుతాయి.

"ఆ ముందు గదిలో లైటు వెలుగుతోంది.... నేను జాగ్రత్తగా కిటికీని చేరుకుని లోపలికి చూశాను.

వరండాలో లైటు వేయలేదు, సార్. చీకటిగా వుంది. వాళ్ళు గదిలో ఏదో మాట్లాడుకుంటున్నారు. ఆమె మంచంమీద కూర్చునుంది—ఆమె నన్ను మోసం చేసింది సార్."

లాల్ జాలిగా తలూపాడు.

ప్రసీల్ మళ్ళీ అన్నాడు, "వాళ్ళ మాటలు వర్షంవల్ల స్పష్టంగా వినిపించలేను. నేను బ్యాగులోంచి నా సరంజామా తీసి సిద్ధం చేసుకున్నాను. మైక్రోఫోన్ని కిటికీ లోపల కనిపించకుండా రెక్క చాటున వుంచి, ఇవతల నేలమీద టేప్ రికార్డర్ పెట్టుకుని అక్కడ కూర్చున్నాను. మీట నొక్కాను.

"అప్పుడు సార్, హెచ్చు స్వరంలో మాటలు రాసాగాయి. నా రికార్డర్‌లో టేప్ తిరుగుతోంది.... మాటలు చక్కగా ఎక్కుతున్నాయి. కానీ యెంతకీ వాళ్ళు టెండర్ విషయం ఎత్తలేదు. యింతలో హఠాత్తుగా అరుపులు వినిపించడంతో అదిరిపడి లేచి నిలబడ్డాను, సార్! వాళ్ళిద్దరు లోపల అరుచుకుంటున్నారు! ఆమె అతన్ని పట్టుకుని నిలదీస్తోంది! అతను ఏదో కాదన్నట్టు వేగంగా తల వూపేస్తున్నాడు! సార్, ఆమె తల్లిని కాబోతున్నానని చెబుతోంది.... ఆ విషయం ఆ రోజే తెలిసిందని అంటోంది. ముందు నమ్మించి ఇలా చెయ్యడం న్యాయం కాదంటోంది....తనని పెళ్ళిచేసుకుని తీరాలని అతన్ని వారిస్తోంది—

"అప్పుడతను విరగబడి నవ్వి, ఒకే ఒక్క మాట అన్నాడు సార్—'పెళ్ళి నా జీవితంలో పెద్ద ఫార్స్! సంఘంలో గౌరవం కోసం చేసుకున్నాను తప్పితే ఐ హేటిట్!' అని."

"అప్పుడు—?"

"అప్పుడామె రెచ్చిపోయింది. ఇంత వంచన కూడ దంది. అతన్ని నమ్ముకొని తనవాళ్ళనందర్నీ వదిలి వచ్చా నంది. అతను మరోసారి నవ్వి, మోజుకీ ముడికీ లంకె పెట్టొద్దన్నాడు. మోజుకొద్దీ వాగ్దానాలు. అవన్నీ నిజ మనుకోవడం ఆమె లోకానుభవ లోపమే అన్నాడు. అప్పుడామె చచ్చిపోతానంది. ఈ అవమానాన్ని భరించ లేనంది. అప్పుడు కూడా అతడు నవ్వి, అలాటి బెది రింపులు చాలా మంది చేసారని అన్నాడు. ఆమె గబుక్కున మంచం దగ్గరికి దూకి, బ్యాగులోంచి రివాల్వర్ అందుకుంది, సార్—"

"చెప్పు, ఏం జరిగింది?"

ప్రసీల్ ఊపిరి తీసుకున్నాడు. "దాన్ని ఆమె తనకి గురిపెట్టుకుని, తన ఒక్కరి చావు చూస్తే అతనికి కను విప్పవుతుందంది. భవిష్యత్తులో యిలా యింకెవరి జీవి తాలతోను ఆడుకోకుండా గుణపాఠ మవుతుందంది— రోషంతో రివాల్వర్‌ని తల కానించుకుని కాల్చుకో బోయింది.

"అతడామె చెయ్యిపట్టి లాగాడు. పిచ్చిపట్టిందని తిడుతూ రివాల్వర్ తీసుకోబోయాడు. ఆమె ఇవ్వలేదు, సార్. యిద్దరూ పెనుగులాడారు, గింజుకున్నారు. దాని కోసం తీవ్రంగా పోట్లాడుకున్నారు. కిందా మీదా పడ్డారు. ఎంతకీ అది అతనికి అందలేదు—అప్పుడు దాని దిశ పైకి వుంది. ఆ చెయ్యి ఆమె వెనుక పెట్టుకుంది. మరో చేత్తో అతనితో పెనుగులాడుతోంది.

అదే సమయంలో ఆమె చేతిలో రివాల్వర్ ప్రేలింది, సార్. గుండు పైకి దూసుకెళ్ళింది. అతను కంగారుపడి

అవతలకి దూకేశాడు. ఇంతలో ఏమయిందో, ఆమె హఠాత్తుగా రివాల్వర్ వదిలేసి తల పట్టుకుంది. ఆమె తలలోంచి జివ్వుమని రక్తం! అది ఆమె ఒంటినంతా తడిపేస్తోంది! ఆమె కళ్ళు మూతబడుతున్నాయి....అంతే సార్, ఆమె కిందపడిపోయింది."

"అప్పుడు?"

"నేను కొయ్యబారిపోయాను. ఆమె నేలమీద పడి వుంది రక్తపు మడుగులో. అతను తేరుకుని ఆమెని సమీపించాడు. ఆదుర్దాగా పిలుస్తూ పరీక్షించాడు. ఆమె యెప్పుడో చనిపోయింది, సార్. అతను బెంబేలుపడిపోయి లేస్తున్నాడు, సరిగ్గా అప్పుడే అవతల కిటికీ దగ్గర ఒక ఆకారం ప్రత్యక్షమైంది—"

"ప్రొసీడ్!"

"అతన్ని చూసి నేను అరవాలనుకున్నాను—రావ్‌ని హెచ్చరించాలనుకున్నాను. కానీ నా గొంతు పెగిలితే కదా! అంతే సార్, నేనలా చూస్తున్నాను, ఆ మనిషి చెయ్యి లోపలికి పెట్టి రివాల్వర్‌తో రావ్ మీదికి కాల్చాడు. రావ్ గుండె పట్టుకుని అక్కడికక్కడే కూలిపోయాడు! బిక్కచచ్చిపోయాను. ఓహ్, ఆ అనుభవం చెప్పలేను సార్! ఆ మరుక్షణంలో హంతకుడు అక్కడ లేడు! నన్నిక చూసేస్తాడనే ఆలోచనకి నా భయం రెట్టింపయింది. పరిగెత్తాను అక్కడ్నుంచి—టేప్ రికార్డర్ ఎత్తుకుని, మైక్రోఫోన్ కనెక్షన్‌ని పీకేశాను ఆ కంగారులో. మెట్ల దగ్గర కాండల్సు పట్టుకుని శక్తికొద్దీ ఉరికాను బయట వరండాలో!

"అప్పుడు వెనుకనుంచి మళ్ళీ పాట వినిపించింది. వాడు నా వెంట పడ్డాడనుకున్నాడు. కానీ కాదు. అది

యింట్లోంచి వచ్చింది. రావ్ ఇంకా ప్రాణాలతో వుండి తన రివాల్వర్‌తో హంతకుడిమీద కాల్చాడనుకొన్నాను. ఏమైనా నేనక్కడ వుండదల్చుకోలేదు. అలాగే పరుగెత్తుతూ, బస్టాప్ వస్తే అక్కడాగి బస్సెక్కేశాను. ఇంటికొచ్చిపడ్డాను. అంతే. సార్."

డిటెక్టివ్‌లు చాలాసేపు అతన్ని విస్మయంగా చూశారు.

తర్వాత లాల్ అడిగాడు. "వెల్, అయితే ఆ మనిషి ఎవరో నీకు తెలుసా?"

"తెలీదు సార్, అతన్నెప్పుడూ చూడలేదు."

"ఎలా వున్నాడు?"

"నల్లగా, బక్కగా వున్నాడు. ముఖ్యంగా ఏళ్ళుంటాయి."

"మళ్ళీ చూస్తే గుర్తుపడతావా?"

"తప్పకుండా సార్. అప్పుడు గదిలో వెలుగు అతని మీద పడుతోంది. ముఖాన్ని స్పష్టంగా చూశాను. జన్మలో మరిచిపోలేను."

"గుడ్, ఆ కేసెట్ ఏం చేశావు?"

"తెచ్చాను, సార్" అన్నాడు ప్రసీల్. జేబులోంచి ఒక క్యాసెట్ తీసిచ్చాడు.

లాల్ దాన్ని కొన్ని క్షణాలు చూసి, ఆచారి వైపు తిరిగాడు.

"ఇప్పుడు నీ అడ్వెంచర్ ఏమిటి, గూఢచారీ?"

ఆచారి నొచ్చుకున్నాడు. "మిస్టర్ లాల్, నన్నలా పిలవకండి. నేను గూఢచారిని దుర్మార్గుణ్ణీ కాను. నల్లి కూడా హాని చెయ్యలేదు నేను. నా పక్కలో నల్లుంటే తీసి నేలమీద వదిలిపెడతాను....

"రావుగారు నన్ను ఫోటో సాక్ష్యం సేకరించ మన్నారు. నందనరావ్ భార్య బయట యెవరో్న ప్రేమిస్తోందిట, భర్త ఆదరణ కొరవడి. రోజూ సాయంత్రాలు అతనింటికి దర్శనం చేసుకుంటుందట. ఈ సంగతి భర్తకు తెలీదు. అతను కూడా సాయంత్రాలు గెస్టు హౌస్‌కి పాపల్ని రప్పించుకుని పావనం చేసుకుంటాడట. యెవరి దారి వారు చూసుకున్నారు.

"రేణుకని ఆమె ఫ్రెండ్‌తో ఓ నాలుగు ఫోటోలు తీస్తే, నందనరావ్‌కి మంచి బుద్ధి నేర్పవచ్చన్నారు మా రావుగారు. ఆ ఫోటోలు అతని పరువుకే సవాలుగా నిలుస్తాయి. చచ్చినట్టు ఈ టెండర్ విరమించుకుంటాడు. మళ్ళీ యెప్పుడూ అడ్డురాకుండా ఆ ఫోటోలు గుర్తు చేస్తుంటాం. ఈ ఆలోచన బాగానే వుంది. వెంటనే పూనుకున్నాను. నిన్న మధ్యాహ్నం ఫోటోలు తీయడం నేర్చుకున్నాను. మైనర్ బాబు నేర్పాడు. సాయంత్రం ఫ్లాష్‌బల్బు తగిలించుకు బయల్దేరాను. అప్పుడే వర్షం మొదలైంది. అది నాకు బాగానే సహకరించింది.

"ఆరు గంటలకి రేణుకను ఆమె యింటి దగ్గర్నుంచి ఆమె ఫ్రెండ్ ఇంటివరకు వెంటాడాను. అతను సోమాజి గూడలో వుంటున్నాడు. ఇంట్లో ఒక్కడే వున్నాడు. నేను రహస్యంగా ప్రవేశించి, మేడమీద బాల్కనీలోకి చేరుకున్నాను. ఆ కిటికీ తెరిచే వుంది. లోపల యిద్దరూ ప్రక్క ప్రక్కనే కూర్చుని తాగుతున్నారు.

"వాళ్ళ మాటలు విడాకుల గురించి సాగుతున్నాయి. జయతో తన భర్త వ్యవహారం గురించి చెపుతోందామె. మంచి సమయం చూసి గెస్టు హౌస్‌లో వాళ్ళిద్దర్నీ ఫోటోలు తీస్తే సాక్ష్యానికి బాగా పనికొస్తాయం

టోందామె... నేను కెమేరా సిద్ధం చేసుకున్నాను. తాపీగా ఓసారి నొక్కి, పక్కకు తప్పుకున్నాను. మొదట వాళ్ళు కంగారుపడ్డా, తర్వాత ఆకాశంలో మెరుపని సర్ది చెప్పుకున్నారు. తిరిగి కబుర్లలో పడ్డారు—

“అప్పుడు ఆమె పెదవులు అతని చెంపల్ని తాకుతోంటే మరో ఫోటో! ఆ తర్వాత అక్కడ వుండాలనిపించలేదు. ఆ రెండు ఫోటోలే చాలనిపించింది. చూడండి, ఈ ఫోటోలు మా స్తే రావ్ తారె త్తిపోదూ?”

ఆచారి జేబులోంచి రెండు ఫోటోలు తీసి చూపించాడు.

లాల్ అందుకుని చూశాడు. తలూపాడు.

“వెల్, నువ్వు ఫోన్ చేసి కృష్ణన్‌ని పిలువ్, జానీ” అన్నాడతను.”

“ఎందుకు?”

“ఈ కేసు ఇప్పుడు తేలిపోయినట్లనిపిస్తోంది....”

ఆచారి, ప్రనీల్ కంగారుపడుతూ చూశారు.

## 12

ఇన్స్పెక్టర్ కృష్ణన్ వచ్చాడు హడావుడిగా, “ఏం జరిగింది, లాల్?” అంటూ.

“కూర్చోండి, కృష్ణన్. ఇప్పుడు పరిస్థితి మలుపు తిరిగింది. కొత్త విషయం వెలుగులోకొచ్చింది. మనం పూర్తిగా మూడు చక్రాలమీదే ఆధారపడి ఒడిదుడుకులుగా సాగుతున్నాం. కామేశ్వర్రావ్ అండ్ పార్టీ, రేణుక ప్రేమజంట, రావ్—జయల పెనుగులాట. కానీ ఇప్పుడు మరో చక్రం కూడా తోడయితే మనం గమ్యం చేరుకుంటాం.”

“చెప్పండి.”

"వెల్, మొదటి మూడు చక్రాలకి వారి వారి ప్రయోజనాల దృష్ట్యా మోటివ్స్‌ని ఆపాదించి చూశాం. కానీ వారిలో ఇద్దరి ఎలిబీలు నిజమని ఋజుయ్యాయి. అవి ఐరన్ కాస్టు ఎలిబీలు. రేణుక ఆమె బాయ్ ఫ్రెండ్ కామేశ్వర్రావ్ అండ్ పార్టీల ఎలిబీలలో సందేహం లేదు. మిగిలిన చక్రం—రావ్, జయల పెనుగులాట. ఫలితం రెండు చావులు కాదనీ, ఒక్కటేననీ తెలుసుకున్నాం. ఇప్పుడు—నాలుగడుగులు వెనక్కి వేసి, తప్పిపోయిన ఆ నాలుగో చక్రాన్ని కూడా తెచ్చి తగిలిస్తే, మిస్టర్ కృష్ణన్, మన రథం సాఫీగా చేరుకుంటుంది...."

"యెవరా నాలుగో చక్రం?"

"శివరాం" అన్నాడు లాల్.

"శివరాం!" అరిచాడు జాన్ ఆశ్చర్యంగా.

"అవును, శివరాం!" లాల్ అన్నాడు మళ్ళీ, "ఈ శివరాంని మనం పూర్తిగా విస్మరించాం. జాన్,మన దృష్టికి రాకుండ మరుగున వుండిపోయాడు. నిన్న వుదయం అతడు పూర్తిగా సహకరించాడనుకుంటున్నావా? లేదు, కొన్ని వాస్తవాల్ని ఎగవేశాడు. తన ప్రయోజనాల్ని ముందే ఊహించి జాగ్రత్తపడుతూ వాటిని మింగుల్చుకున్నాడు.

"ఇన్స్‌పెక్టర్, ఈ శివరాం నందనరావ్ ఆఫీసులో ఉద్యోగి. ఇతను జయని ప్రేమించాడు. కానీ ఆమె హేళనచేసి తిరస్కరించింది. తిరస్కరించి వూరుకోలేదు. అతని కళ్ళెదుటే తన బాస్‌తో ప్రణయం ప్రారంభించింది—ఇది శివరాంకి కన్నెర్రజేసింది. క్రోధం, ఈర్ష్య, ప్రతీకారం రగిలాయి. ప్రేమ విఫలమైతే పరిణామం విపరీతంగానే వుంటుంది...."

"అంటే, ఈ రెండు హత్యలూ అతను చేశాడా?"

"పొరపాటు. హత్యలు కాదు, హత్య. జయ ప్రమాద వశాత్తు మరణించిందని మరువకండి. నిజానికి శివరాం వాళ్ళిద్దర్నీ చంపాలనుకున్నాడు. మొదట్నుంచి పరిస్థితుల్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. వాళ్ళ రహస్య సమావేశాల్ని గమనిస్తున్నాడు.... వాళ్ళ ఆలోచనలు పథకాలు తెలుసుకుంటున్నాడు.

అలా ఎప్పుడైతే నందనరావ్, కామేశ్వర్రావు టెండర్‌ని దెబ్బతీయాలని ప్రయత్నాలు ప్రారంభించాడో అప్పుడే శివరాం తనకు తగిన అవకాశం దొరికిందనుకున్నాడు. ఒక అనువైన రాత్రి కామేశ్వర్రావ్ ఇంట్లో రివాల్వర్ దొంగిలించాడు. ఈ హత్యలు కామేశ్వర్రావ్ మీదికిపోతే కన్విన్సివ్‌గా వుంటుందని అతని ఉద్దేశ్యం.

"ఇక నిన్న సాయంత్రం అతను రావ్ కంటే ముందుగెస్టు హౌస్‌కు చేరుకున్నాడు. రావ్ వచ్చేటప్పటికి చీకటిపడింది. వర్షం కూడా పడుతోంది. శివరాం తెరిచి వున్న తోటవైపు కిటికీ దగ్గర బయట కాచుకున్నాడు. కానీ యింతలో పరిస్థితి మారింది.

"వాళ్ళిద్దరికీ పెళ్ళి విషయంలో మాటామాటా పెరిగి ఘర్షణకు దారితీసింది. ఆమె గర్భవతి. రావ్ పెళ్ళికి నిరాకరించడంతో ప్రాణాలు తీసుకోబోయింది. బ్యాగులోంచి రివాల్వర్ అందుకుంది. అది క్రితం రాత్రి రావ్ ఇచ్చినప్పట్నుంచీ ఆమె దగ్గరే వుంది. ఆమె కాల్చుకోబోతే, రావ్ నివారించబోయాడు. ఇద్దరూ పెనుగులాడారు. ఇంతలో జయ చేతిలో రివాల్వర్ పేలింది. వెల్, ఆ తర్వాత ఆమె ఎలా చనిపోయిందో మీకు తెలుసు."

కృష్ణన్ తలూపాడు. "ఇంకా చెప్పండి."

"అప్పుడు శివరాం వెంటనే తన ఆలోచనలో మార్పు చేసుకున్నాడు. కామేశ్వర్రావుని అనవసరంగా ఇరికించడం యెందుకనుకున్నాడు. రివాల్వర్‌తో కిటికీలోంచి నందనరావ్‌ని కాల్చాడు, గుండెలో. అతను చనిపోవడంతో గదిలోకి దూకి, బాగా పెనుగులాట జరిగిందని సూచించడానికి గదిని చిందరవందర చేశాడు. కిందపడివున్న నందనరావ్ రివాల్వర్‌ని వేలిముద్రలు చెడకుండా తీసుకొని, ఒక బుల్లెట్‌ని శూన్యంలోకి షూట్ చేసి అక్కడ పడేశాడు. దట్సాల్, అప్పుడు పలాయనం చిత్తగించాడు. అంతే, ప్రేమ పగ రగిలితే పర్యవసానం ఇదే!"

"కానీ దీనికి రుజువు?" అడిగాడు కృష్ణన్.

లాల్ నవ్వుతూ ప్రసీల్‌ని చూశాడు, "ఈ ప్రసీల్ ప్రత్యక్ష సాక్షి. ఇతనొక ధ్యేయంతో అక్కడికి వెళ్ళాడు, అలాగే ఆచారి రేణుక, ఆమె బాయ్ ఫ్రెండ్‌కి ఎలిబీలు కల్పించాడు. ఈ టేప్, ఈ ఫోటోలు. వీళ్ళు సమర్పించుకున్న కానుకలు. వీళ్ళు సామాన్యులు కారు, కృష్ణన్, వీళ్ళ జాయింట్ వెంచర్ మీకు తెలీదు. ఈ కేసుని వీళ్ళే పరిష్కరించారు. సన్మానించాలి సభపెట్టి."

ఆచారి, ప్రసీల్‌లు నవ్వుకున్నారు గర్వంతో.

"వెల్, ప్రసీల్ ఇప్పుడు శివరాంని చూస్తే తప్పక గుర్తుపడతాడనుకుంటున్నాను. అలా జరిగితే ఈ కేసుకి తెరపడుతుంది. మీ రితనితో వెళ్ళండి, కృష్ణన్. కామేశ్వర్రావు రివాల్వర్ ఇంకా శివరాం దగ్గరే వుంటుంది. తిరిగి పెట్టేయడానికి అవకాశం కోసం చూస్తుంటాడు.

మీరు మీ అవకాశం చూసుకోండి, ఇన్స్పెక్టర్. విష్యూ గుడ్ లక్!"

శివరాం ఇల్లు కనుక్కొని వెంటనే కృష్ణన్, ప్రనీల్ తో బయల్దేరి వెళ్ళాడు.

వారిస్ గూడలో ఆ ఇంటిముందు దిగి, తలుపు కొట్టిన వెంటనే వచ్చి తీశాడు శివరాం. అప్పుడు ప్రనీల్ వెంటనే గుర్తుపట్టి, "అవును సార్, ఇతడే!" అనరిచాడు వుద్రేకంగా.

కృష్ణన్ గబుక్కున లోపలికెళ్ళి, వేగంగా సోదా చేసి, పెట్టెలోంచి రివాల్వర్ని స్వాధీనం చేసుకున్నాడు.

వెంటనే సంకెళ్ళు తీసి శివరాంని సమీపిస్తూ, "యూ, ఆర్ అండర్ అరెస్టు!" అని కసిరాడు.

—:ఐ పో యిం ది:—

# విగ్రహం ఇచ్చిన క్లూ

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

"వైజాగు ఉత్తరం వచ్చింది" అంది రజని.

శ్రీకాంత్ అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటున్నాడు.

"ఎక్కడినుండో చూడు" అన్నాడు శ్రీకాంత్.

రజని కవర్ మీది పోస్టలు స్టాంపును పరిశీలించింది.

"వాల్తేర్ ఆర్. ఎం. ఎస్."

"వాల్తేరు నుండా? అంటే విశాఖపట్నం సిటీ నుండన్నమాట! అక్కడ మనకు ఉత్తరం రాసేవాళ్ళు" శ్రీకాంత్ ఆభినయంలో వున్నాడు.

చర్ చర్ ర్ ర్ మని శబ్దమయింది. రజని కవరు చింపింది. తెల్లటి పాల రంగులో వున్న కాగితం బయట పడింది.

"హుఁ! మీ వూహ చాలు! చదవండి!" మడిచివున్న కాగితం అందించింది.

దువ్వెన డ్రెస్సింగ్ టేబులుమీద పెట్టాడు శ్రీకాంత్. ఉత్తరం అందుకున్నాడు. అలవోకగా మడత విప్పాడు.

ఉత్తరం లెటర్ పేడ్ మీద రాసినది.

"చదువుతాను విను" అన్నాడు శ్రీకాంత్.

వి. శోభనాద్రి,
డోర్ నెంబర్ 20బి—16/2,
అమర్ నగర్, విశాఖపట్నం—16.

ప్రియమైన మేనల్లుడు శ్రీకాంత్!

శుభాకాంక్షలు. త్వరలో నీకు పుట్టిన రోజు వస్తోంది. ఏ నీడా నీమీద సోకదు. పుట్టిన రోజు క్షణాలలో నీకు అదృష్టం కలిసి వస్తుంది. నయనానందకరమైన వాతావరణం. పెద్దమనిషిని కలుసుకో. ఈ రోజుల్లో డబ్బు వున్నవాడే పెద్దమనిషి! నీ అదృష్టం కూడా డబ్బుతో ముడిపడి వుంది.

శుభాకాంక్షలతో—
నీ మేనమామ,
శోభనాద్రి.

ఉత్తరం చదవడం ముగించి ఈలవేయబోయాడు శ్రీకాంత్. ఉత్తరం కొరుకుడు పడలేదు. రెండోసారి చదువుతున్నాడు.

"ఎవరండీ ఈ మేనమామ!" అడిగింది రజని.

"యెవరో గుర్తుకు రావడంలేదు."

"ఉత్తరంలో తలా తోకా లేని విషయాలేమిటి?"

"అదే చూస్తున్నాను. అసలు అర్థంకావడంలేదు."

"చింపి అవతల పారవేద్దురూ."

శ్రీకాంత్ ఆమె మాటలు వినడంలేదు. అతడి మస్తిష్కం పనిచేస్తోంది. ఈ ఉత్తరం పసీపాటా లేనివాడు రాసిందా! కాదు. అలా అయివుంటే డోర్

నెంబర్ తో సహా యెందుకు యిస్తాడు? ఒకవేళ ఈ ఉత్తరం తనని వుద్దేశించి కాదా?

"కవర్ ఏది?" అడిగాడు శ్రీకాంత్.

రజని వంగి కవర్ అందించింది. మామూలు తెల్లటి కవర్, పోస్టల్ స్టాంప్ అంటించి వుంది. అడ్రసు స్పష్టంగా టైప్ చేసివుంది.

చిరునామా తనదే. ఈ వుత్తరం తనకే అని స్పష్టమయింది.

ఉత్తరం వెనక్కి త్రిప్పాడు.

'కె. రాఘవులు,

సివిల్ లాయర్,

సరస్వతీ జంక్షన్,

విశాఖపట్నం' అని వుంది.

"రజనీ! సీరియస్‌గా ఆలోచించు."

"ఏమిటండీ? అర్థం పర్థంలేని వుత్తరం పట్టుకుని...."

"అడ్రసులు యింత ఖచ్చితంగా సరిపోలవు."

"డబ్బు అనేటప్పటికి మీకు మతిపోయింది!"

శ్రీకాంత్ మాట్లాడలేదు. రజని తనకు ఫక్తు వ్యతిరేకం! తాను తేలికగా తీసుకునే విషయాలకు ఆమె విపరీతమైన ప్రాముఖ్యత యిస్తుంది. తాను సీరియస్‌గా తీసుకుంటే ఆమె తేల్చిపారవేస్తుంది.

శ్రీకాంత్ కవరూ కాగితమూ మడిచి జేబులో పెట్టుకున్నాడు. చకచక మూల గదిలోకి నడిచాడు. పనికిమాలిన వస్తువులు ప్రోగుపడి వున్నాయి. తలుపులు తీయగానే బొద్దింకలు పరుగెత్తాయి. ఎలుకలు కిటికీవైపు దూకాయి. గదిలో గబ్బు కంపు.

పనికిమాలిన వస్తువులను కెలుకుతున్నాడు శ్రీకాంత్.

"జాగ్రత్త! తెళ్ళుంటాయి!" అరుస్తోంది రజని.

శ్రీకాంత్ పాతకాలంనాటి రేకుపెట్టె తీశాడు. రేకులు తుప్పుపట్టి విరిగి వున్నాయి.

రేకుపెట్టెను వరండాలోకి లాగాడు శ్రీకాంత్. గాలిలో దుమ్ము రేగింది.

శ్రీకాంత్ ఊపిరి బిగబెట్టాడు. పెట్టెమూత లాగాడు. పనికిమాలిని పుస్తకాలున్నాయి. వాటిమీద చిమ్మెట్లు తిరుగుతున్నాయి.

"అవెందుకండీ? ఏనాటివో అవి....పనికిమాలిన...."

శ్రీకాంత్ కాగితాలు కెలుకుతున్నాడు. నల్లటి అట్టలు వేసిన డైరీలు బయటపడ్డాయి. కాలం వాటి నలుపు రంగును తినేస్తోంది. డైరీలు దులిపాడు. కీటకాలు పరుగెత్తాయి.

డైరీలు వెతకసాగాడు. తండ్రి రాసిన డైరీలు.

## 2

శ్రీకాంత్ తనకి వచ్చిన వుత్తరమూ, కవరూ చూపించాడు లాయరుకు.

"ఓ! శోభనాద్రిగారి మేనల్లుడు మీరా?" కావాలని ఆశ్చర్యపోయాడు రాఘవులు.

"ఈ ఉత్తరం నాకు అసలు అర్థంకాలేదండి. మీరు చెబుతారేమో!" అన్నాడు శ్రీకాంత్.

రాఘవులు పెళ పెళ నవ్వాడు.

"శోభనాద్రిగారు వింత మనిషి! అందుకే ఆయన చివరి క్షణాలు నాలాంటి పరాయివాడి చేతిమీద వెళ్ళిపోయాయి!" పొడి కళ్ళు అద్దుకున్నాడు.

"శోభనాద్రిగారు మీకు ఉత్తరం విషయం చెప్పి వుంటారు" కలగజేసుకున్నాడు వామనమూర్తి. అతను

శ్రీకాంత్ కు బాబాయి.

"నాకు చెప్పేలాగా వుంటే అంత తిరకాసుగా ఎందుకు రాస్తారు? ఆ రహస్యం శ్రీకాంత్ కి తెలియాలనే అలా రాయించివుంటారు."

"శోభనాద్రిగారి ఆస్తి ఏమాత్రం వుంటుంది?"

"ఆస్తా? నాకు తెలియదు."

"అదేమిటి? ఆయన సివిల్ వ్యవహారాలు మీరే చక్కబెడతారు!"

"సివిల్! అంతే! ఆర్థిక వ్యవహారాలు కాదు గదా!" మరల పెళపెళ నవ్వబోయాడు రాఘవులు.

"పోనీ, అమర్ నగర్ లో శోభనాద్రి బంగళా గురించి చెప్పండి."

రాఘవులు నవ్వడం ఆపలేకపోయాడు. పెళపెళ నవ్వాడు.

"అలా అడగండి చెబుతాను. నగరాభివృద్ధి సంస్థకి దాన్ని అమ్మేశారు."

శ్రీకాంత్ తన తలమీద పిడుగుపడినట్టు తబ్బిబ్బు పడ్డాడు.

"ఎందుకు?"

"చుట్టుపక్కల రెండెకరాల స్థలం. యెందుకా? నగరాభివృద్ధి కోసం." రాఘవులు పెళపెళ నవ్వాడు.

"మామయ్య ఆ డబ్బు ఏం చేసి వుంటాడు?"

"పరమాత్ముడికి తెలియాలి!"

వామనమూర్తి శ్రీకాంత్ మొహాలు చూసుకున్నారు.

"మామయ్య ఒంటరిగానే వుండేవాడా?"

"పోయిన డిశెంబర్ నెలాఖరువరకూ."

"ఆయనతో ఎవరుండేవారు?"

"నర్సమ్మ."

"ఆమె ఎవరు?"

"నర్స్ అండీ బాబూ! నర్స్ — సపర్యలు చేయడానికి."

"ఆమె ఒక్కతేనా?"

"ఆమె భర్తతోబాటు ఆ యింట్లోనే మకాం!" రాఘవుల కళ్ళ కొసలు వంగుతోన్నాయి.

"నర్స్ పేరేమిటి?"

"అప్పల నరసమ్మ. ఫస్టు నేటివ్ అమ్మడు. ఆమె భర్త పెదితల్లి."

"వాళ్ళు ఎందుకు వెళ్ళిపోయారు?"

"అప్పల నరసమ్మ పేరుకే అలా వుందిగాని దోర ముగ్గిన జాంపండు అమ్మడు. శోభనాద్రి మీద మనసు పడిందట. పెదితల్లి ఆమెను లాక్కుపోయాడు."

"డెబ్బైరెండు సంవత్సరాల గుండె జబ్బు ముసలాడికి వలపా?"

రాఘవులు పెళ పెళ నవ్వి, "అమ్మడికే అతడిమీద వలపు రేగిందని నా నమ్మకం!" అన్నాడు.

"అదయినా ఎలా?—ఓ....ఆస్తిని చూశా?"

శ్రీకాంత్ కి చిరాకుగా వుంది. ఈ రాఘవులు సగ్గుజావాలాగా మంచదు తేల్చడు. జిడ్డు వ్యవహారం.

"వాళ్ళ అడ్రసులు తెలుసా?"

"ఆమె యిక్కడే ఏదో ఆసుపత్రిలో చేరిందని విన్నాను."

"ప్లీజ్ చెబుతారా?"

రాఘవులు ఆశగా చూశాడు.

వామనమూర్తి సైగ చేశాడు. శ్రీకాంత్ అతడికి

యాభైనోటు అందించాడు. రాఘవులు చప్పున అందు కున్నాడు.

"తెలుసుకుని ఈ సాయంత్రం చెబుతాను" అన్నాడు రాఘవులు.

"ఆ మాట ముందే ఏడవ్వొచ్చు కదా!' నోటి చివర వరకూ వచ్చింది. కాని శ్రీకాంత్ వూరుకున్నాడు.

రాఘవులు లేచాడు. "ఇక మీరు నాకు సెలవు యిప్పించండి!" అన్నాడు. వామనమూర్తి శ్రీకాంత్ రోడ్డుమీద వున్నాడు.

"ఎవడు పడితే వాడి దగ్గర మనం దోపిడీ అవుతాం. డిటెక్టివ్ శిరీష్‌ను పట్టుకుందాం. వ్యవహారం అంతా ఆయనే చూసుకుంటాడు."

ఇద్దరూ ఆటో ఎక్కారు.

డిటెక్టివ్ శిరీష్ యింట్లోనే వున్నాడు.

ఇద్దరూ విషయం చెప్పారు. లెటరు, కవరు లాయరు గారి దగ్గరనే వున్నట్లు చెప్పారు.

శిరీష్ కళ్ళు మూసుకుని ఆలోచనలో పడ్డాడు.

"మనం ముగ్గురమూ మళ్ళీ రాఘవులు యింటికి వెళ్లాలి!" అన్నాడు శిరీష్.

## 3

కొత్త డాట్సన్ కారు సరస్వతీ జంక్షన్‌లో ఆగింది. శిరీష్ కారును ఒకప్రక్కగా పార్క్ చేశాడు. శ్రీకాంత్, వామనమూర్తి కారు దిగారు.

ముగ్గురూ రాఘవులి యింటిముందుకు నడిచారు.

రాఘవులు ముందు హాలులో లేడు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. ముందు హాలులో కోటు హాంగర్‌కి వ్రేలాడు తోంది. నల్ల కోటు!

"టోరుకి యింకా వెళ్ళలేదు!" అన్నాడు శిరీష్.

వామనమూర్తి తలూపాడు. మెయిన్ హాలులోంచి ప్రక్క గదిలోకి వెళ్ళే గుమ్మం మూసివుంది. పేరుపెట్టి పిలిస్తే జవాబు రాలేదు.

శిరీష్ మెల్లగా తలుపు తోశాడు. పెద్ద గది. ఆ గదిలో ఎవరూ లేరు.

శిరీష్ గదిలోకి ప్రవేశించాడు. వామనమూర్తీ, శ్రీకాంత్ అతడిని అనుసరించారు.

ఆ గదిలోంచి ప్రక్క గదికి వెళ్ళే గుమ్మం వుంది. దాని తలుపులు దగ్గరగా వేసివున్నాయి.

ఎక్కడినుండో మూలుగు వినిపిస్తోంది. ఎవరో బాధాకరంగా మూలుగుతున్నారు. శిరీష్ చటుక్కున ప్రక్కగది తలుపులు నెట్టాడు. బిగుసుకుపోయిన తలుపులకు లాగా అతికష్టంమీద లోపలకు తెరచుకున్నాయి.

చిన్న గది. ఒక మూలగా టేబులూ, టేబులుకి ఇవతల తిరగబడిన కుర్చీ, గోడకి చేర్చి పుస్తకాల రాక్, తిరగబడిన కుర్చీకీ రాక్‌కీ మధ్య నేలమీద వెల్లకితల పడిన వ్యక్తి.

గోడమీద స్విచ్ తడిమి లైటు వేశాడు శిరీష్.

వామనమూర్తీ, శ్రీకాంత్ గదిలోకి ప్రవేశించారు.

"అరరె! ప్లీడర్ గారు!" అన్నాడు శ్రీకాంత్.

తిరగబడిన కుర్చీని సరియైన స్థితిలో వుంచాడు శిరీష్.

రాఘవులు వెల్లకితలా పడివున్నాడు. అతడి చేతిలో మూత తీసిన కలం వుంది. అతడికి కొద్ది దూరంలో కాగితాలు పడివున్నాయి. రాఘవులు కళ్ళు మూసుకుని వగరుస్తున్నాడు.

"రాఘవులుగారూ!" పిలిచాడు వామనమూర్తి.

రాఘవులు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

"మీరా? వాళ్ళనుకున్నాను" అన్నాడు.

"వాళ్ళా? వాళ్ళెవరు?"

"ఏమో తెలియదు. ముగ్గురు గుండాలు. ఈ గదిలో కూర్చుండి నేను రాసుకుంటున్నాను" రాఘవులు చుట్టూ చూశాడు. శిరీష్ చటుక్కున అతడికి కలం మూత అందించాడు. రాఘవులు అందుకున్నాడు.

మీరెవరన్నట్టు చూశాడు.

"శ్రీకాంత్ నాకు ఫ్రెండులెండి. దారిలో ఎదురయ్యాం!" అన్నాడు శిరీష్.

"నన్ను కుర్చీలోంచి క్రిందకులాగారు. కాగితాలు విసిరికొట్టారు. ఒకడు నా గొంతుకద్ద కత్తి వుంచాడు."

"వాళ్ళు యింతకుముందు తెలుసా?"

"తెలియదు. మరల చూచినా గుర్తుపట్టలేను. కాని వారి ముగ్గురిలో ఒకడి పేరు మాత్రం ఠాకూర్ అని తెలిసింది."

"వాళ్ళు ఏం కావాలన్నారు?"

"శ్రీకాంత్ కి వాళ్ళ మేనమామ పంపిన వుత్తరం!"

"అంతేనా" కళ్ళెగరేశాడు శిరీష్.

"అదేం బాబూ! ఆ ఉత్తరంలో ఏదో రహస్య నిధి వుందేమో!"

"వాళ్ళు ఉత్తరం రాసుకుని వెళ్ళిపోయారా?"

"ఒట్టినే వెళ్ళిపోయారా? వాళ్ళ కార్యకలాపాలలో జోక్యం పెట్టుకోవద్దన్నారు."

"పెట్టుకుంటే!"

"పీక తీసేస్తామన్నారు" రాఘవులు చెమటలు కక్కాడు.

"శోభనాద్రిగారు తన మేనల్లుడికి వుత్తరం పంపినట్టు వాళ్ళకు ఎలా తెలిసింది?" అడిగాడు శిరీష్.

రాఘవులు పరీక్షగా చూచి, "మీరెవరో డిటెక్టివ్ లాగా వున్నారు. వాళ్ళకు ఎలా తెలిసిందో మాకు ఎలా తెలుస్తుంది?" అన్నాడు.

"బాంక్ ఎక్కౌంట్ తన మేనల్లుడికి యివ్వాలనుకున్నారు శోభనాద్రిగారు. అర్థంకాని ఉత్తరం రాసిపెట్టారు. మేనల్లుడికి డబ్బు యివ్వకుండా అడ్డుపడే శక్తి యెవరికి వుంది?"

"ఆయన వ్యక్తిగత రహస్యాలు ఎలా తెలుస్తాయి?"

"మీరు తప్పించి మీ యింట్లో ఎవరూ లేరా?"

"లేరు బాబూ! మా ఆవిడ అలిగి పుట్టింటికి వెళ్ళింది!"

"అవును మరి, నువ్వు సగ్గు జావవి!" గొణుక్కున్నాడు వామనమూర్తి.

"వాళ్ళు మరల వస్తారేమో!" అడిగాడు శిరీష్ తిరిగి.

"రారనుకుంటాను. కావలసింది తీసుకున్నారు కదా!"

"శోభనాద్రిగారి బంగళాను నగరాభివృద్ధి సంస్థకు యిచ్చేశారా?"

"అవును. ఒక వారం రోజులలో బంగళా పడగొట్టి రెండెకరాల భూమీ చదును చేస్తారు. ప్లాట్లు వేసి అమ్మేస్తారు."

శిరీష్ తలపంకించి కదిలించి బయటకు నడిచాడు. రాఘవులు శ్రీకాంత్ కు లెటరు తిరిగి ఇచ్చేసాడు.

శ్రీకాంత్ మెల్లగా రాఘవులును కుర్చీలో కూర్చుండబెట్టాడు. వామనమూర్తితో కలిసి బయటకు నడిచాడు.

"శోభనాద్రి బంగళా తాళం చెవులు అడుగు!" అన్నాడు శ్రీకాంత్ అతడితో.

# 4

అమర్ నగర్‌లో ప్రవేశించింది కారు. విశాలమైన బంగళాముందు ఆగింది కారు. కారులోంచి డిటెక్టివ్ శిరీష్ దిగాడు. వెనక సీట్లోంచి వామనమూర్తి శ్రీకాంత్ దిగారు.

బంగళా గేటు తెరిచాడు శ్రీకాంత్. వామనమూర్తి, శిరీష్, శ్రీకాంత్ బంగళా మెట్లు ఎక్కారు. శిరీష్ తాళాలు తెరిచాడు.

బంగళా బోసిగా వుంది. రెండెకరాల ఖాళీస్థలంలో కట్టిన బంగళా, బంగళా చుట్టూ స్థలంలో రకరకాల తోటలు పెరుగుతున్నాయి. తోట దృశ్యం చాలావరకూ బంగళా కిటికీల్లోంచి కనిపిస్తోంది.

శిరీష్ అన్ని గదులూ తిరిగాడు. ఒక గదిలో ఆగి పోయాడు. ఆ గది బెడ్‌రూం. గదికి రెండు పెద్ద కిటికీ లున్నాయి. కిటికీలలోంచి తోటలో పూలు కనిపి స్తున్నాయి. వాటికి బాక్‌గ్రౌండులో సర్వీ తోటవుంది. ఎండ పూలమీద ప్రతిఫలిస్తోంది. దృశ్యం మనోజ్ఞంగా వుంది.

గది గోడమీద చిత్రపటం తగిలించి వుంది. కాశ్మీర్ ప్రాంతంలో లాండ్‌స్కేప్ గుత్తులు గుత్తులుగా యాపిలు పళ్ళూ, పొగమంచు వెనుక కొండలూ.

చిత్రపటాన్ని సమీపించాడు శిరీష్.

చిత్రపటంమీద రాసివుంది.

'పొగమంచులో నయనానందకరమైన ప్రకృతి.'

డిటెక్టివ్ శిరీష్ ఉలిక్కిపడ్డాడు. చటుక్కున పాంటు

జేబులోంచి వుత్తరం తీశాడు. శోభనాద్రి తన మేనల్లుడు శ్రీకాంత్ కి రాసిన వుత్తరంలో ప్రతి మాటా చదివాడు.

నయనానందకరమైన వాతావరణం.

ఆ వాక్యం వద్ద ఆగిపోయాడు. ఫిబ్రవరి నెలలో విశాఖపట్నంలో పొగమంచు కురుస్తుంది. పొగమంచులో దృశ్యాలు శోభనాద్రికి నయనానందకరంగా కనిపిస్తాయి. ఉదయం నీరెండ వచ్చిన కొద్ది సేపటికి పొగమంచు కరగి పోతుంది.

అయితే పొగమంచులో శ్రీకాంత్ కలుసుకోవలసిన పెద్దమనిషి ఎవరు? ఆ వేళలో తోటలోకి యెవరైనా వస్తారా? అతడు ఎవరు? శ్రీకాంత్ ఎదురుచూస్తోన్న నిధి ఆయనకు ఒప్పగించాడా శోభనాద్రి?

డిటెక్టివ్ శిరీష్ తల విదిలించాడు.

అయితే వుత్తరంలో రాసినట్టు పుట్టినరోజు క్షణాలలో అదృష్టం కలిసిరావడం ఏమిటి?

డామిట్! తాను వుత్తరం చదివి కూడా కప్పదాటు వేశాడు. శ్రీకాంత్ పుట్టిన రోజు క్షణాలగురించి శోభనాద్రి ప్రస్తావించి వుంటాడు.

"శ్రీకాంత్! శ్రీకాంత్!" పిలిచాడు శిరీష్.

శ్రీకాంత్ క్రింద గదిలో దొరికాడు. నేలమట్టంలో వున్న గది అది. గోడవద్ద నిలబడి వున్నారు వామన మూర్తి, శ్రీకాంత్. శ్రీకాంత్ గోడలో చేతితో తడుముతోన్నాడు. అతడి చేతికి నాబ్ తగిలింది. నాబ్ త్రిప్పాడు. గోడలో మనిషి పట్టే స్థలం తప్పుకుంది.

"నేలమాళిగ!" ఆశ్చర్యంగా అన్నాడు శిరీష్.

"అవును సార్! మామూలుగా చూస్తోంటే దీర్ఘ చదరంగా చీలిక కనిపించింది" అన్నాడు వామనమూర్తి.

నేలమాళిగలోకి అడుగుపెడుతూ ఆగాడు శిరీష్. నాబ్ త్రిప్పాడు. గోడలో తప్పుకున్న భాగం మూసుకుంది.

"అదేం సార్! లోపలకు వెళ్ళి చూద్దాం!" అన్నాడు శ్రీకాంత్.

"తప్పకుండా గేటువద్ద ఏదో వాహనం ఆగివుంది. చప్పుడు వినలేదా?" అడిగాడు శిరీష్.

ముగ్గురూ నడవాలోకి వచ్చారు.

గేటు తెరచుకుని రాఘవులు లోపలకు వచ్చాడు. అతడి మొహం చేతులకు ప్లాస్టర్ అంటించి వుంది. తలకు అమృతాంజనం రాసినట్టు వాసన వస్తోంది. వామనమూర్తి పై గదిలోకి వెళ్ళాడు.

"గాయాలు తగిలాయా?" అడిగాడు శిరీష్.

రాఘవులు తలూపాడు. "శ్రీకాంత్ ఆస్తి కాదుగానీ నాకు చెడ్డ దినాలు ప్రారంభమయాయి. ఠాకూర్ మనుషులు మళ్ళీ నామీద దౌర్జన్యం చేసి వెళ్ళారు, మీ గురించి చెప్పమని."

"ఎందుకు? ఉత్తరం నకలు తీసుకుపోయారు కదా!"

రాఘవులు చిరాకుగా చూశాడు. తనకు ప్రాణగండమయినట్టు తాను చెబుతోన్నాడు. వీళ్ళకు కనీసం సానుభూతి కలగలేదేం?

నేలమట్టంలో వున్న గదిలోని ఫోను మ్రోగింది.

శిరీష్ ఫోన్ ఎత్తి, "రాఘవులుగారూ! మీ కోసం!" అన్నాడు.

రాఘవులు రిసీవర్‌లో మాట్లాడి చకచక బయటకు పరుగెత్తాడు. వామనమూర్తి నవ్వుకుంటూ మెట్లు దిగి గదిలోకి వచ్చాడు.

"బాబాయ్ యెక్కడకు వెళ్లావు" అడిగాడు శ్రీకాంత్.

శిరీష్ నవ్వి "మీ బాబాయ్ పైగదిలోంచి క్రింద గదిలోకి ఫోన్ చేశాడు. ఎక్స్‌టెన్షన్ ఫోన్ అని కూడా మరచి రాఘవులు పరుగెత్తాడు" అన్నాడు.

శ్రీకాంత్ అయోమయంగా చూశాడు. "రాఘవులు మనకు చెప్పేవాడు కాదా?"

"రాఘవులు మోసకారి!" అన్నాడు వామనమూర్తి.

ప్రోత్సాహపరిచాడు శిరీష్.

"గంట క్రితం తనని దుండగులు బెదిరించినట్టు చెప్పాడు రాఘవులు. గంటనుండీ అతడు భయంలోంచి తేరుకో లేదు. నమ్మశక్యంగాని విషయం కనీసం కలం మూత కూడా పెట్టుకోలేదు."

"ఆల్‌రైట్! పానకంలో పుడక! శ్రీకాంత్ నీ పుట్టిన రోజు ఏమిటి?" అడిగాడు శిరీష్.

"ఫిబ్రవరి 17."

"ఎన్ని గంటలకు పుట్టావు?"

శ్రీకాంత్ గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు.

"నేను చెప్పగలననుకుంటాను. శ్రీకాంత్ వాళ్ళ నాన్న అంటే మా అన్నయ్య నాచేత జాతకాలు రాయించాడు" వామనమూర్తి తన పాంటు జేబులోంచి చిన్న నోటుబుక్ తీశాడు. "ఫిబ్రవరి 17 ఉదయం 6గం. 1 ని॥"

శిరీష్ కళ్ళు మెరిశాయి. మౌనంగా తోటలోకి దారి తీశాడు. తోటలో ఫౌంటెన్ వుంది. ఫౌంటెన్ చుట్టూ రింగ్. రింగ్ మధ్య మెత్తటి మట్టిలో నిమ్మగడ్డి. గాలిలో

సువాసన. ఫౌంటెన్‌కి అవతలగా శిలా విగ్రహం.

శిరీష్ ఫౌంటెన్ దాటి శిలావిగ్రహాన్ని సమీపించాడు. నున్నటి విగ్రహం నల్లగా నిగనిగలాడుతోంది. శిలా విగ్రహం కింద శోభనాద్రిరావు 1861—1907 అని రాసివుంది.

శ్రీకాంత్ మేనమామ శోభనాద్రి. శోభనాద్రి, తాతయ్య ఈ శోభనాద్రిరావు అయి వుండాలి.

వామనమూర్తి, శ్రీకాంత్ లోపలకు వచ్చారు.

"మనం రేపు ఉదయం 6 గంటలకు తోటలో వుండాలి!" అన్నాడు శిరీష్.

# 5

కోడి కూసింది. ఇంకా చీకట్లు పల్చగా వున్నాయి. డాట్సన్ కారు అమర్ నగర్‌లో బంగళాముందు ఆగింది. హెడ్ లైట్స్ ఆఫ్ చేశాడు శిరీష్.

ముగ్గురూ తోటలోకి నడిచారు.

చీకట్లు మెల్లగా విచ్చుకుంటున్నాయి. తోటంతా పొగమంచు కురుస్తోంది.

ముగ్గురూ ఫౌంటెన్ వద్ద ఆగారు. శిలా విగ్రహం మంచునీళ్ళతో తడిసివుంది.

డిటెక్టివ్ శిరీష్ తోటలో కలియతిరుగుతోన్నాడు. తూర్పు దిశ ఎర్రబడుతోంది. శిరీష్ వాచీ చూసుకున్నాడు.

ఫిబ్రవరి 15 ఉదయం 6గం॥ 5ని॥

శిరీష్ నిట్టూర్చాడు. మరో 12 నిమిషాలలో ఏదో జరుగుతుంది. యెవరో పెద్దమనిషి వస్తాడు. అతడు యెవరు? ఎలా వస్తాడు? అతడికి శ్రీకాంత్ యెవరో తెలుసా? ఆ పెద్ద మనిషి మీద శోభనాద్రికి అంత

గు రేమిటి?

శిరీష్ తల విదిలించాడు.

తాను గాలిలో పరిశోధన చేస్తోన్నాడు. యెక్కడా భౌతికమైన ఆధారంలేని పరిశోధన. తాను తప్పటడుగు వేస్తున్నాడు. ఎక్కడ? వెలుగు రేకలు తోటలో అలుము కుంటోన్నాయి.

వాచీలో ముళ్ళు కదులుతోన్నాయి.

శ్రీకాంత్, వామనమూర్తి విడిగా తోటలో తిరుగు తున్నారు. మంచు తెరలు కరుగుతోన్నాయి.

6గం॥_16ని॥

శిరీష్ ఉలిక్కిపడ్డాడు. తోటలో తళుక్కున మెరి సింది.

"ఏమిటా మెరుపు?" అరిచాడు శ్రీకాంత్.

శిరీష్ శిలా విగ్రహం ముందు ఆగాడు. శిలా విగ్రహం మెరుస్తోంది. అదీ కొన్ని క్షణాలపాటే! విగ్రహం మెరవడం ఆగిపోయింది.

'పెద్దమనిషిని కలుసుకో!'

పెద్దమనిషి శోభనాద్రి శిలావిగ్రహం కాదుగదా! తోటలోకి ఈ వేళప్పుడు యెవరు వస్తారు? అయినా ఈ రోజు రారు? శ్రీకాంత్ పుట్టిన రోజు 17 కదా! నిమిషాలు గడుస్తున్నాయి.

"ఒక కోణంలో సూర్యకిరణాలు పడి విగ్రహం మెరుస్తుంది" అన్నాడు శిరీష్.

"అంటే విగ్రహంలో ఏదో మర్మం వున్నదన్న మాట!" అన్నాడు శ్రీకాంత్.

"కాని మీ మేనమామ సూచనల ప్రకారం ఫిబ్రవరి 17న ఈ తోటలో యెవరో పెద్దమనిషిని కలుసుకోవా

లన్నట్టుంది. నిజానికి విగ్రహ మేమిా? మామయ్య దృష్టిలో పెద్దమనిషి!"

"అవును. నాకూ అలాగే అనిపిస్తోంది. ఈ నిర్జనమైన తోటలో ఉదయం 6గం॥ _ 17ని॥కి యెవరు వస్తారు? శోభనాద్రిగారు మనిషిని నమ్మలేదు" వామనమూర్తి కలగజేసుకున్నాడు.

"అయితే మనం 17 వరకూ ఆగాలి!"

"కాని నగరాభివృద్ధి సంస్థ దాన్ని 18న స్వాధీనం చేసుకుంటుంది."

"వాళ్ళ స్వాధీనంలోకి వెళ్తే ఈ ప్రాంతంలో బుల్డోజర్లు విహారం చేస్తాయి."

"అంటే మనం ఈ లోపుగానే విగ్రహం రహస్యం కనుక్కోవాలి!" ఆలోచనలతో శిరీష్ తలమునకలయ్యాడు. విగ్రహాన్ని సమీపించాడు. దాన్ని చుట్టి వచ్చాడు. విగ్రహం తాకి చూశాడు. యెక్కడా ఎలాంటి నాబ్స్ లేవు. విగ్రహం నిలబడిన పీఠం నున్నగా వుంది. మాయ అరలు లేవు.

ముగ్గురూ విగ్రహంచుట్టూ నేల తడిమాడు.

శిరీష్ విగ్రహం పీఠం నేలమిాద అన్ని ప్రదేశంలో వ్రేలు పెట్టాడు. అంచునే వ్రేలు నడిపాడు.

"శిరీష్‌గారూ!" అరిచాడు వామనరావు. శిరీష్ అటు నడిచాడు. నేలలో చిన్న రింగు వుంది. రింగులో బొటనవ్రేలు పెట్టి పైకి లాగాడు వామనరావు. రింగులో చలనంలేదు.

శిరీష్ రింగును దొరకబుచ్చుకున్నాడు. గుండ్రంగా తిప్పాడు. యెక్కడో కరకరమంటోంది. రింగు చేతిలో తిరుగుతోంది.

"విగ్రహం కదులుతోంది!" ఆశ్చర్యపోయాడు వామనమూర్తి.

శిరీష్ రింగును తిప్పుతోన్నాడు. పీఠంవద్ద విగ్రహం ప్రక్కకు తప్పుకుంటోంది. విగ్రహం క్రింద చిన్న గొయ్యి.

శిరీష్ రింగు వదిలిపెట్టి గోతిలోకి వంగి చూశాడు.

గోతిలో చిన్న చెక్కపెట్టె వుంది. శిరీష్ చెక్కపెట్టె పైకి తీశాడు. పెట్టె చుట్టూ గోతిలో పౌడర్. గమాక్సిన్ వాసన గుప్పుమంది.

'చెదలు పట్టకుండా!' తలపంకించాడు శిరీష్.

పెట్టె తెరిచాడు. పెట్టెలో చిన్న కాగితం ముక్క వుంది.

"ఇంకా చీకట్లోకి.... ఇంకో విగ్రహంలోకి... క్షణాల నీడలలోకి...."

ఇంతే వుంది కాగితంలో.

శ్రీకాంత్ నిట్టూర్చాడు.

"మనది వృథా ప్రయాస!"

"అవును. అలాగే తోస్తోంది!" అన్నాడు వామనమూర్తి.

"మా నాన్న మీద శోభనాద్రి మామయ్యకు కోపం వుంది. అందుకే ఈ రకంగా నామీద కసి తీర్చుకుంటున్నాడు!" అన్నాడు శ్రీకాంత్.

శిరీష్ వాళ్ళ మాటలు వినడం లేదు. చెట్ల వెనకగా మనుషులు కదులుతోన్నారు. మరు నిమిషంలో వాళ్ళ చుట్టూ మనుషులు.

గళ్ళ లుంగీ గళ్ళ పంచెకట్టు కట్టుకున్న గూండా ఒకడు శిరీష్‌ను సమీపించాడు. రాళ్ళు దొర్లిస్తోన్నట్టు

నవ్వాడు. విలాసంగా చెక్కు పెట్టె అందుకున్నాడు.
శ్రీకాంత్, వామనమూర్తి మొహాలు చూసుకున్నారు.

# 6

"మనం తప్పుపని చేశాం. ఇప్పటికి వెయ్యి రూపాయిల వరకూ ఖర్చయాయి" అన్నాడు వామనమూర్తి.

"అవును. అసలు కలిసివచ్చేది వుందో లేదో...." అన్నాడు శ్రీకాంత్.

"నువు అనవసరంగా డిటెక్టివు అంటూ వెంపర్లాడావు. ఈ ఖర్చులకు తోడు డిటెక్టివు కివ్వవలసిన ఫీజు ఎంత వుంటుందో...."

"మనకు కలసిరాకపోతే ఫీజు యెక్కడనుండి తెస్తాం?"

"ఇవ్వకపోతే బాగుంటుందా?"

"ఇక్కడితో పరిశోధన ఆపివేయమని చెబుదాం!"

హోటలు రూంలో వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు.

"డిటెక్టివ్ విషయం తర్వాత ఆలోచిద్దాం. ముందు ఉదయం కనిపించిన ఉత్తరం విషయం చూడు బాబాయ్!" అన్నాడు శ్రీకాంత్.

"నీకు యింకా కలసివస్తుందన్న నమ్మకం వుందన్న మాట!" నవ్వాడు వామనమూర్తి.

"కొంత ఆశ వుంది. కొంత అపనమ్మకం వుంది."

"ఇంకా చీకట్లోకి.... ఇంకో విగ్రహంలోకి.... క్షణాల నీడలలోకి....అని వుంది చీటీలో. అంటే...."

"నిన్న మనం నేలమాళిగ చూశాం. చీకటి నేలమాళిగ.... నేలమాళిగలో ఇంకో విగ్రహం వుండివుండవచ్చును."

"క్షణాల నీడలలోకి....అంటే మనం అన్వయించుకో లేదు."

"ముందు ఈ చీకటి ఏమిటో చూద్దాం. తర్వాత క్షణాల నీడలు....పద...."

"ఠాకూర్ మనని వెంటాడాతాడేమో. నిన్న లాయరు చెప్పితే మనం నమ్మలేదు. ఇవాళ ప్రత్యక్షంగా చూశాము."

అవును అదో ప్రమాదం వుంది....

వామనమూర్తి కిటికీలోంచి బయటకు చూశాడు. క్రింద రోడ్డుమీద జనం అటూ ఇటూ కదులుతోన్నారు.

"యెవరూ మన గదిమీద నిఘాలేరు" అన్నాడు వామనమూర్తి.

శ్రీకాంత్ ఉల్లాసంగా చూశాడు.

ఇద్దరూ గదులకు తాళంపెట్టి రోడ్డుమీదకువచ్చారు. టాక్సీ మాట్లాడుకున్నారు. టాక్సీ అమర్ నగర్‌లో ఆగింది. టాక్సీ నడుస్తోన్నంత సేపూ ఇద్దరూ తమను ఎవరూ వెంటాడటం లేదని నిశ్చయించుకున్నారు.

శోభనాద్రి బంగళాముందు ఆగింది టాక్సీ.

ఇద్దరూ బంగళాలో ప్రవేశించారు, ఇల్లు ప్రశాంతంగా వుంది. ఇద్దరూ కింద గదిలో చేరారు. నేల మాళిగకు పోయే రహస్య ద్వారం తెరిచారు. రహస్య ద్వారం లోంచి కిందకు మెట్లు కనిపించాయి. చెక్క మెట్లు. చెక్క మెట్లు దిగారు యిద్దరూ. నడవా చీకటిగా వుంది. పెన్ టార్చి తీశాడు. వెలుగురేఖలో వామనమూర్తి చుట్టూ చూస్తూ నడవసాగాడు.

నడవా చివర చిన్న కొట్టు గది వుంది. గదికి తలుపులు లేవు. గదిలోకి చూశారు ఇద్దరూ. మసకచీకట్లో

ఎంతోమంది కూర్చున్నట్టు కనిపించారు.

ఇద్దరూ వులిక్కిపడ్డారు.

శ్రీకాంత్ గుండె దిటవుచేసుకొని పెన్ టార్చి అటు త్రిప్పాడు.

గదిలో విగ్రహాలున్నాయి. దేశభక్తుల విగ్రహాలు! అన్నీ సిమెంట్ విగ్రహాలు. విగ్రహాల మధ్య మరో విగ్రహం పట్టే ఖాళీసలం వుంది.

"శోభనాద్రి దేశభక్తుడా?" అడిగాడు వామనమూర్తి.

"అనే అనుకుంటాను! కాని ఇక్కడ మరో విగ్రహం వుండాలి! లేదు" వామనమూర్తి నేలను పరీక్షగా చూశాడు.

నేలమీద దుమ్ము ధూళి పడివుంది.

పెన్ టార్చి వెలుగు విగ్రహాలమధ్య ఖాళీసలంమీద పడింది. ధూళిలో ఏదో రాసివుంది. టార్చి వెలుగులో యిద్దరూ చదివారు.

"ప్రీతం స్టోర్స్, విశాఖపట్నం—2" శ్రీకాంత్ ఈల వేశాడు. యెవరో వ్రేలితో రాసిన అక్షరాలు. శ్రీకాంత్ కాగితంమీద నోట్ చేసుకున్నాడు. బయటకు కదిలారు.

ఇద్దరూ నడవాలో నడిచారు. చెక్కమెట్లు సమీపించారు. వెలుగు కనిపిస్తోంది గుమ్మంలోంచి. వెలుగుకు నీడ అడ్డం వచ్చింది. ముందు నడుస్తోన్న శ్రీకాంత్ వులిక్కిపడ్డాడు.

నీడ ఎవరిదో చప్పున గుర్తించాడు.

ఠాకూర్!

శ్రీకాంత్ ఆగిపోయాడు. వామనమూర్తి అప్పటికే దడదడలాడుతోన్నాడు.

ఠాకూర్ చెక్క మెట్లు దిగాడు.

"రండిరా బచ్చాల్లారా! మీరు యిక్కడుంటారని తెలుసు!" రాళ్ళు దొరికిపోతున్నట్టు నవ్వాడు ఠాకూర్.

"విగ్రహం దొరకలేదు!" అన్నాడు శ్రీకాంత్ వణికి పోతూ.

"విగ్రహంలేదని మాకూ తెలుసు!"

"అయితే...."

"మాకు తెలియని రహస్యం మీకు తెలిసివుండవచ్చు."

"రహస్యమా? మాకేం తెలియదు!"

ఠాకూర్ అతడిని అందిపుచ్చుకున్నాడు.

"బయట నా మనుషులున్నారు. వాళ్ళకు నిన్ను ఒప్పచెబుతాను. ఫుట్‌బాల్ ఆడతారు తెలుసా?" శ్రీకాంత్‌ను చెంపమీద చెళ్ళుమని కొట్టాడు.

శ్రీకాంత్‌కి కళ్ళూ, కళ్ళలో నీళ్ళూ తిరిగాయి. వామన మూర్తి ఠాకూర్‌ను సమీపించాడు.

"విగ్రహం లేదు. కానీ ధూళిలో ప్రీతం స్టోర్స్ విశాఖపట్నం-2 అని రాసివుంది. అంతే!" భయపడుతూ అన్నాడు.

ఠాకూర్ కళ్ళు కుటిలంగా మెరిశాయి.

ఇద్దరినీ చెరొక భుజమూ పట్టుకుని బయటకు లాక్కుంటూ వచ్చాడు.

నడవలో ఆగాడు.

"హాండ్సప్!" స్తంభం చాటునుండి వచ్చాడు శిరీష్.

ఠాకూర్ కళ్ళు క్రూరంగా చూస్తున్నాయి.

శిరీష్ అతడి కళ్ళలో కదలికను గమనించాడు. తన చేతిలో పిస్తోలు వుంది. ఠాకూర్‌కి అటూ యిటూ వామన మూర్తి శ్రీకాంత్ వున్నారు. ఠాకూర్ వాళ్ళను తన

కవచంగా ఉపయోగించుకుంటాడు.

శిరీష్ క్షణాలు వృథా పోనివ్వదల్చుకోలేదు. గాల్లోకి దూకాడు. నరాల శక్తి పాదాలలో కేంద్రీకరించుకున్నాడు. ఠాకూర్‌ను తన్నాడు. వెల్లకితలా పడబోతూ బోర్లగిల తిరిగాడు. చేతులమీద నేలకు ఆనాడు.

ఠాకూర్ గోడకి కొట్టుకున్నాడు. వామనమూర్తినీ శ్రీకాంత్‌నూ వదిలాడు.

శిరీష్ అతడికి అవకాశం యివ్వదల్చుకోలేదు. బోర్లగిల పడినవాడు అదే కోణంలో ముందుకు దూకాడు.

ఠాకూర్ అతడి భుజాలు పట్టుకున్నాడు. అతడి చేతిలోని పిస్తోలును తన్నాడు.

శిరీష్ కళ్ళ కొసలలోంచి ప్రక్కకు చూశాడు.

శ్రీకాంత్ పిస్తోలు అందుకున్నాడు.

దూరంగా వాహనం వస్తోన్న చప్పుడయింది.

శిరీష్ అరిచాడు. "పారిపోండి. వీళ్ళు నన్నేమీ చేయరు!"

శిరీష్‌కి పిస్తోలు అందించలేదు శ్రీకాంత్. అలాగని పిస్తోలు ప్రేల్చనూలేదు. పిస్తోలు జేబులో పెట్టుకుని గేటులోకి ఉరికాడు. వామనమూర్తి అప్పటికే రోడ్డు మీద వున్నాడు.

"ఠాకూర్ మనుషులు నిజంగా అతడివెంట రాలేదు. అదిగో — వాన్‌లో వస్తోన్నారు" అన్నాడు వామనమూర్తి రొప్పుతూ.

ఇద్దరూ రోడ్డుమీద పరుగెత్తి మాయమయారు.

వాన్ గేటుముందు ఆగింది. ఠాకూర్ మనుషులు క్రిందకు ఉరికారు. అప్పటికి శిరీష్‌ను కదలకుండా పట్టుకున్నాడు ఠాకూర్.

ఠాకూర్‌ను సమీపించారు ఠాకూర్ అనుచరులు.

ఠాకూర్ తన పట్టులో వున్న శిరీష్‌ను నడిపించసాగాడు. తన అనుచరులలో ఒకడిని పిలిచాడు.

"రాం! ప్రీతం స్టోర్స్‌కి వెళ్ళు! శోభనాద్రి విగ్రహం వుంటుంది. చేజిక్కించుకో" అన్నాడు ఠాకూర్.

రాం బయటకు పరుగెత్తాడు.

శిరీష్‌ను కుర్చీలో కూర్చుండబెట్టి తాళ్ళతో కట్టేశారు.

"నిన్ను ఏమీ చేయనని నీ ధీమా ఏమిటి?" అడిగాడు ఠాకూర్.

శిరీష్ నవ్వి, "నువ్వూ నీ అనుచరులూ, నేనూ నా క్లయంట్సూ వెతికేది ఒకే గమ్యం కోసం! అందుకే...." అన్నాడు.

రాళ్ళు దొర్లిస్తోన్నట్టు నవ్వాడు ఠాకూర్.

"వాళ్ళు యింకా నీ క్లయింట్సేమిటి? నీ ప్రమేయం లేకుండానే వాళ్ళు అండర్ గ్రవుండ్‌లో వెతుక్కోవడానికి వచ్చారు."

శిరీష్ బయటపడదల్చుకోలేదు. తనకీ క్లయింట్స్‌కీ మధ్యలో ఠాకూర్ ఎవడు?

ఉన్నట్టుండి శిరీష్ నవ్వసాగాడు.

"పెద్ద పెద్ద హత్యలు చేశానంటావ్ .... ఉత్తర ప్రదేశ్‌లో గొప్ప దోపిడీదారునంటావ్. నీకు తలలో తెలివిలేదు!"

ఠాకూర్ మొహం ఎర్రబడింది.

"యెవరితో మాట్లాడుతున్నావో మరిచిపోయావు?" అరిచాడు ఠాకూర్.

శిరీష్ పరిహాసంగా నవ్వాడు.

ఠాకూర్ కళ్ళు ఎర్రబడ్డాయి.

"ఒరేయ్ సూదులూ, క్రొవ్వొత్తి అగ్గి పెట్టె"
అరిచాడు ఠాకూర్.

అనుచరులు స్టూలుమీద క్రొవ్వొత్తి నిలబెట్టారు.
ఒత్తి ముట్టించారు. సూదుల చివర చిన్న లోయ్యి పిడులు!
సూదులు కాల్చసాగారు.

శరీఫ్ వాటివంక చూడసాగాడు.

# 7

ప్రీతం స్టోర్స్ ముందు ఆగింది ఆటో.

శ్రీకాంత్ బాడుగ చెల్లించి ఆటోను పంపేశాడు.
వామనమూర్తి రోడ్డుమీదకు పరిశీలించి చూసి స్టోర్స్
వైపు నడిచాడు.

శ్రీకాంత్ కౌంటర్ ముందు ఆగాడు.

"మీవద్ద విగ్రహాలున్నాయా?" అడిగాడు శ్రీకాంత్.

"ప్లాస్టర్ ఆఫ్ పారిస్ విగ్రహాలా? యెంత ఖరీదులో
కావాలి?" అన్నాడు స్టోర్స్ మేనేజర్.

"ప్లాస్టర్ ఆఫ్ పారీస్‌తో చేసినవి కావు..సిమెంట్‌తో
చేసినవి...."

మేనేజర్ విడ్డూరంగా చూశాడు. "మా స్టోర్స్‌లో
సిమెంట్ విగ్రహాలు అమ్ముతారని యెవరు చెప్పారు?"

"శోభనాద్రిగారు."

మేనేజర్ ఉలిక్కిపడ్డాడు. "మీరెవరు?"

శ్రీకాంత్ అటూ ఇటూ చూశాడు. పెదిమలు కదప
బోయాడు. వామనమూర్తి అతడి చేతిని గట్టిగా
నొక్కాడు. స్టోర్స్ ముందు టాక్సీ ఆగడం, దాంట్లోంచి
రాం దూకడం శ్రీకాంత్ చూడలేదు. కాని వామన
మూర్తి చూడగలిగాడు.

స్టోర్స్‌లోకి వచ్చాడు రాం. అతడి చేతిలో చాకు

తటుక్కుమన్నది. చాకును శ్రీకాంత్ వీపుమీద ఆన్చాడు.

"నువ్వు మాట్లాడుతోన్న విగ్రహం విషయం నాకు తెలుసు! ప్రాణాలకు ముప్పు తెచ్చుకోనక! విగ్రహం నాకు యిప్పించు" ఆదేశించాడు రాం.

శ్రీకాంత్ కొన్ని క్షణాలపాటు దిగ్భ్రాంతిలో మునిగిపోయాడు.

వామనమూర్తి షాపు మేనేజర్ మొహంలోకి చూశాడు.

అతడిని శోభనాద్రి నమ్మాడు. కాబట్టే విగ్రహం ఈ స్టోర్స్‌లో వుంచాడు. స్టోర్స్‌లో సిమెంట్ విగ్రహాలు అమ్మరు. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ విగ్రహాలే అమ్ముతారు. శోభనాద్రిగారు వుంచిన విగ్రహం శ్రీకాంత్‌కి సంక్ర మించవలసి వుంది. అంటే మరెవరైనా దాన్ని సంగ్ర హించాలంటే అటువంటి నకిలీ విగ్రహం వుంచుతారు.

తెల్లబోయి చూస్తోన్నాడు మేనేజర్. అతడికి కన్ను గొట్టాడు వామనమూర్తి. మేనేజర్‌కి ధైర్యం వచ్చింది. చెయ్యి చాపి ప్లాస్టర్ ఆఫ్ పారిస్ విగ్రహాలవైపు చూపించాడు. రకరకాల సైజులలో విగ్రహాలున్నాయి.

రాం వాటివంక నిర్ఘాంతపోయి చూశాడు. కొంత సేపట్లో వాటిలో వున్న శోభనాద్రి విగ్రహం కనిపిం చింది. చటుక్కున దాన్ని అందుకుని బయటకు పరు గెత్తాడు.

"దానికి నేను బిల్లు చెల్లిస్తాను!" అన్నాడు శ్రీకాంత్.

"అక్కర లేదు. ముందు మీరు శోభనాద్రిగారికి ఏమవుతారో చెప్పండి!"

"ఆయన మా మామయ్య."

"లోపలకు రండి. విగ్రహం యిస్తాను" అన్నాడు

స్టోర్స్ మేనేజర్. ముగ్గురూ లోపలకు వెళ్లారు.... సిమెంట్ విగ్రహం స్టూలుమీద వుంది. తోటలో ఉన్న విగ్రహం మోడల్‌లో వుంది.

"తీసుకువెళ్ళండి. మీ గురువులు నాకు శోభనాద్రిగారు చెప్పారు" అన్నాడు మేనేజర్.

శ్రీకాంత్, వామనమూర్తి విగ్రహంతో బయటకు నడిచారు.

# 8

"సార్! రాం వస్తోన్నాడు. అతడి చేతిలో విగ్రహం వుంది!" అన్నాడు అనుచరుడొకడు.

ఠాకూర్ సూదులు పట్టుకున్నవాడల్లా వెనక్కి తిరిగాడు. సూదులు స్టూలుమీద పెట్టాడు.

విగ్రహంతో రాం గదిలోకి వచ్చాడు.

శిరీష్ రాంనూ రాం చేతిలో ఉన్న విగ్రహాన్ని చూశాడు. నుదురు చిట్లించాడు.

రాం విగ్రహాన్ని కుర్చీలో పెట్టాడు. ఠాకూర్ విగ్రహాన్ని చుట్టూ తడిమాడు. విగ్రహం నున్నగా తీర్చి దిద్దివుంది. సుత్తిని అందుకుని విగ్రహం నెత్తిన ఒక పెట్టు పెట్టాడు. విగ్రహం తునాతునకలయి కుర్చీలో పడింది. ముక్కల మధ్య రాగిరేకు.

ఠాకూర్ రాగిరేకును అందుకున్నాడు. దానిమీద అక్షరాలూ అంకెలూ తాపడం చేసి ఉన్నాయి. జి.డబ్ల్యు.బి.(G.W.B.)బొంబాయి. 19-8-1-4-15-23.

ఠాకూర్ తల విదిలించాడు. శిరీష్‌ను సమీపించాడు.

"నిన్ను హింసించలేదు కదా! ఒక్క మాట చెప్పు!" స్నేహంగా అడిగాడు ఠాకూర్.

"ఏమిటిశ?"

"జి. డబ్ల్యు. బి. అంటే ఏమిటి?"

శిరీష్ తక్కున చెప్పాడు. "గుడ్ విల్ బాంకు"

ఠాకూర్ మెల్లగా రెకను కదిపి, "నిజమే! లక్నోలో కూడా దాని బ్రాంచి వుంది. నేను దోచుకున్నాను కూడా" అన్నాడు.

"కింద నెంబర్లేమి?" అడిగాడు శిరీష్.

ఠాకూర్ రాళ్ళు దొర్లిస్తోన్నట్టు నవ్వాడు. "శోభనాద్రి గుడ్ విల్ బాంకు లాకర్ లో సొమ్ము దాచాడు. దాని తాళం తెరుచుకునే కోడ్ అంకెలు!" అన్నాడు.

"ఠాకూర్! అభినందనలు. చివరకు నువ్వే నెగ్గావు!"

"థాంక్స్! కాని.... ఈ క్లూ తప్పుకాదనే నమ్ముతాను. యెందుకయినా మంచిది. నా అనుచరులు యిక్కడ నిఘా ఉంటారు."

శిరీష్ నవ్వి, "వాళ్ళకు వాటా యివ్వకుండా తప్పించుకుంటావన్నమాట!" అన్నాడు.

ఠాకూర్ మొహంలో దిగ్భ్రాంతి క్షణకాలం కనిపించి మాయమయింది.

ఠాకూర్ తన అనుచరుల్లో ఒకడికి సైగ చేశాడు.

వాడు సిరంజిలోకి ద్రవంలాగి శిరీష్ను సమీపించాడు.

## 9

డిటెక్టివ్ శిరీష్ కళ్ళు తెరిచాడు. గదిలో తానొక్కడే కూర్చున్నాడు. గది తలుపులు వెలుపలనుండి మూసి ఉన్నాయి. స్టూలుమీద యింకా కొవ్వొత్తి, అగ్గిపెట్టె, సూదులూ వున్నాయి.

ఠాకూర్ తన బృందంతో కంగారుగా వెళ్ళిపోయాడు.

అతడు త్వరగా బొంబాయి చేరుకోవాలి. అందుకే ఆ హడావుడి.

శిరీష్ మందహాసం చేశాడు. తనకు మత్తుమందు ఇంజెక్టు చేశారు.

శిరీష్ కళ్లు తిప్పి వాచీవంక చూసుకున్నాడు. మూడు గంటలయింది. బయట చీకటిగా ఉన్నట్టు కిటికీలోంచి తెలుస్తోంది. అంటే తెల్లవారుజాము మూడు గంట లయిందన్నమాట. కాళ్ళూ చేతులూ కదిపాడు శిరీష్. మత్తుమందు ఇంజక్టు చేయడంవల్లనే వాళ్ళు తన తాళ్ళు విప్పారు.

కుర్చీలోంచి లేచాడు శిరీష్. కొవ్వొత్తి వెలిగించాడు. తలుపు వద్ద జ్వాల ఉంచాడు. తలుపు కొద్దిసేపట్లోనే అంటుకుంది. రెండు రెక్కలూ మండసాగాయి. పొగ గదిలో వ్యాపిస్తోంది. కిటికీలోంచి వచ్చేగాలి చాలడం లేదు.

శిరీష్ ఉక్కిరిబిక్కిరయ్యాడు. కాలుతోన్న తలుపులను బలంగా తన్నాడు. తలుపులు పెళపెళ విరిగి అవతలకు పడ్డాయి. గచ్చుమీద పడి మండుతోన్నాయి. శిరీష్ కుర్చీని వెలుగు దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు. మస్తిష్కంలో ఆలోచనలు రేగుతున్నాయి.

శోభనాద్రి నిజంగా గుడ్ విల్ బాంకులో తన సంపద దాచాడా? దాచి వుంచినవాడు లాకర్ నెంబర్లు ఇవ్వడం ఏమిటీ? అటువంటప్పుడు ఉత్తరం యెందుకు రాసినట్టు? బాంకు పాస్ బుక్ పంపించవచ్చునుకదా! ఉత్తరంలో 'పుట్టినరోజు క్షణాల' గురించి ఉదహరించాడు శోభనాద్రి. వాటికి అర్థం ఏమిటి?

రెండో ఉత్తరంలో 'క్షణాల నీడలు' ఏమిటి?

లాకర్ నెంబర్లు మననం చేసుకున్నాడు శిరీష్.

19—8—1—4—15—23.

అంకెలను కాగితంమీద వేసి ప్రస్తిపట్టసాగాడు. తూర్పు తెల్లవారుతోంది. వెలుగురేఖలకు చీకట్లు పారి పోతున్నాయి.

శిరీష్ చకచక కాగితం మీద ఇంగ్లీ అక్షరాలు రాశాడు. A నుండి Z వరకూ ఒకటినుండి ఇరవై ఆరు నెంబర్లు వేశాడు. తరిగి Z నుండి A వరకూ వెనక్కి అంకెలు వేసుకుంటూ ఒకటినుండి ఇరవై ఆరు వేశాడు. రెండు ఇంగ్లీషులు స్పెల్లింగులు తయారయాయి. వాటిలో మొదటి స్పెల్లింగ్ అర్ధవంతంగా వుంది.

SHADOW (షాడో—)

నీడ! ఏ నీడ! విగ్రహంలో నీడ గురించి ప్రస్తావన ఏమిటి?

"శిరీష్‌గారూ!"

శిరీష్ తలెత్తి చూశాడు. శ్రీకాంత్, వామనమూర్తి విగ్రహంతో తిరిగొచ్చారు. ఆ సిమెంట్ విగ్రహంమీద కూడా 19—8—1—4—15—23 అని అంకెలు వున్నాయి! దానిపై GWB మాత్రంలేదు. విగ్రహాన్ని పగలగొట్టి చూశారు. మరే ఆధారమూ దొరకలేదు.

శిరీష్ కుర్చీలోంచి దిగ్గున తోటలోకి పరుగెత్తాడు. తూర్పు ఎర్రబడుతోంది. తోటలో చెట్ల నీడలు ఏర్పడు తున్నాయి.

తోటలో శోభనాద్రి తాతయ్య విగ్రహం యధా ప్రకారంగా వుంది. 'ఎండ తగిలే వీలు బాగా వుంది' గొణిగాడు శిరీష్.

సూర్యకిరణాలు విగ్రహంమీద పడ్డాయి. విగ్రహం నీడ పొడవుగా పడుతోంది.

శిరీష్ వాచీ చూసుకున్నాను. 6 గం॥ 4 ని॥

విగ్రహం నీడ చివరకు పరుగెత్తాడు. నీడ మెల్లగా విగ్రహంవైపుగా కుంచించుకుంటోంది. వాచీ చూసుకుంటూ మెల్లగా నీడ వెంబడే నడవసాగాడు. నిముషాలు గడుస్తోన్నాయి. నేలమీద సిమెంట్ చప్టా. అడుగు వెడల్పు చప్టా. 6గం॥ 16ని॥ విగ్రహం కొన్ని క్షణాల పాటు మెరిసింది.

శ్రీకాంత్, వామనమూర్తి అతడి ప్రతి చర్యనూ విడ్డూరంగా చూస్తోన్నారు.

6గం॥ 17ని॥

నీడను చూశాడు. మరుక్షణం నీడ అంచులో గుర్తు పెట్టాడు. అక్కడ త్రవ్వమని చెప్పాడు. శ్రీకాంత్, వామనమూర్తి పారలు అందుకున్నారు.

ఈ రోజు ఫిబ్రవరి 17. ఈ రాత్రిలోగా ఆస్తి దొరికితే దొరికినట్టు! రేపు అంటే ఫిబ్రవరి 13న ఈ భవనం డిమాలిష్ అవుతుంది.

నేలలో నిధులున్నా నిక్షేపాలున్నా అంతా మనిషి కంటపడకుండా అణగారి పోతాయి.

ఇద్దరూ త్రవ్వసాగారు. చేతులు చెమటలు పడుతున్నాయి, అలవాటులేని పని కావటంవలన.

ఎక్కడో ఠాణాలో ఏడు గంటలు కొట్టారు.

గునపం ఖంగుమన్నది.

ఇద్దరూ లేని ఓపిక తెచ్చుకొని త్రవ్వుతోన్నారు. లంకెబిందెలు బయటపడ్డాయి. ఇద్దరూ అతికష్టంమీద వాటిని గోతిలోంచి బయటకు తీశారు.

డిటెక్టివ్ శిరీష్ తృప్తిగా నిట్టూర్చాడు.

—:ఐ పో యి ం ది:—

# సీతా కళ్యాణం

## టెంపోరావ్

సోఫాలో కూర్చుని షుగర్ మేగ్నట్ సుబ్బారావు ఖరీదైన చుట్టను కాలుస్తున్నాడు. పొగను బయటకు వదులుతూ తన వాచ్ వైపు చూశాడు. పది కావస్తోంది. బ్రేక్ ఫాస్టు సేవించి, విశ్రాంతిగా చుట్ట కాల్చి ఆఫీసుకు వెళ్ళడం అతడికలవాటు.

సీత నవ్వుతూ అతడికెదురుగా నిలబడింది. ఆమెను చూసి అతడు తాపీగా నవ్వాడు. సుబ్బారావుకి యిద్దరే పిల్లలు. పెదవాడు కొడుకు. అతడు అమెరికాలో ఉన్నాడు. ట్రైయినింగ్ పూర్తయ్యాక తిరిగి వస్తాడు. రెండోది సీత.

ఆమె బి.ఎ. ఫైనలియ్యర్‌లో వుంది.

"అమ్మాయి పరీక్ష ఎప్పుడు?" అడిగాడు సుబ్బారావు.

"ఇరవై నుంచి" అందామె.

"అటుపైన యింక చదవనక్కరలేదు. అర్జునరావు గారి అబ్బాయి గోపాలం రెడీగా ఉన్నాడు నీ కోసం!"

అన్నాడు తండ్రి నవ్వుతూ.

"నాన్నగారూ, గోపాలాన్ని చేసుకోవాలనే ఉద్దేశం నాకులేదు. నా పెళ్ళి విషయంలో మీరు ఏ ప్రయత్నాలూ చేయొద్దు!"

"అదేమిటలా అంటున్నావు? అర్జునరావుగారికి మూడు షుగర్ ఫ్యాక్టరీలున్నాయి. గోపాలంతో నీ పెళ్ళి అయితీరాలి. గోపాలానికి నువ్వు నచ్చావు!"

"గోపాలం నాకు నచ్చలేదు" అందామె.

సుబ్బారావు ఆమె వంక సూటిగా చూశాడు.

"సీతా! గోపాలం అందగాడు కాకపోవచ్చు కాని బాగా డబ్బున్నవాడు. అతడిని పెళ్ళాడితే నువ్వు రాణిలా జీవిస్తావు!"

"రాణీ అయే అవకాశం మరొకరికి కొదిలి మామూలు మనిషిలా జీవించాలని నా ఆ ఆశ."

"నిన్ను కాలేజికి పంపడం నేను చేసిన తప్పు! చదువు నీ బుర్రను పాడుచేసింది."

ఆమె వ్యంగ్యంగా నవ్వింది.

"చదువు బుర్రను పాడుచేయదు. సరైన విలువలను గుర్తించేటట్లు చేస్తుంది. నేను డబ్బులో పుట్టిపెరిగాను. డబ్బంటే నాకంతగా ఆశలేదు. డబ్బు కోసం పెళ్లాడ్డం నాకిష్టంలేదు. నాకు నచ్చిన వ్యక్తిని పెళ్ళాడ్తాను" అందామె.

"అలాంటివాడు ఎవరేనా వున్నాడా?"

"ఉన్నాడు కాబట్టే మీతో చెప్పాలని యిలా వచ్చాను."

"యెవడు వాడు?"

"జీవన్! అతడిని నేను ప్రేమిస్తున్నాను. అతడినే

పెళ్ళాడ్తాను."

"వాడు ఏం చేస్తున్నాడు?"

"అతడు యింజనీరింగ్ పాసయ్యాడు. మోడర్న్ ఇంజనీరింగ్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు."

"జీతం ఎంతిస్తారు?"

"వెయ్యి రూపాయలని చెప్పాడు."

"వాడితో నీకెలా పరిచయమైంది?"

"ఒక రోజున నేను నడుపుతున్న కారు ఎందువల్లనో ఆగిపోయింది. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను. జీవన్ స్కూటర్ మీద పోతూ నన్ను చూసి ఆగాడు. ఐదు నిమిషాల్లో అతడు కారును సరిచేశాడు. అటుపైన యిద్దరం కల్సుకోడం జరిగింది. అతడు నాకు చాలా నచ్చాడు."

సుబ్బారావు కోపంగా సోఫాలోంచి లేచాడు.

"సీతా, నువ్వు నా కూ తు రు వ ని తెల్సుకుని ఆ దుర్మార్గుడు ప్రేమ నటించి నిన్ను మోసం చేస్తున్నాడు. వాడి వెయ్యి రూపాయిలతో నువ్వు బతకలేవు" అరాచ్చాడతను.

"మన దేశంలో యెందరో నెలకు యాభై రూపాయిల ఆదాయంతో బతుకుతున్నారు!"

"చావలేక, జీవచ్ఛవల్లా బతుకుతున్నారు. మనింట్లో ఉన్న అల్సేషియన్ కుక్కలకు వెయ్యికంటె ఎక్కువ ఖర్చవుతోంది!" అన్నాడతను వెటకారంగా.

"డబ్బున్న చెయ్యి ఎంతైనా ఖర్చుపెట్టగలదు."

"జీవన్ యిల్లెక్కడ?"

"అతడు లాడ్జిలో గది తీసుకుని ఉంటున్నాడు."

"ఏ లాడ్జిలో?"

ఆగ్రహంతో ఉన్న తండ్రివంక ఆమె క్షణకాలం చూసింది.

"మీరు అక్కడకు వెళ్తారా?"

"వాడి లాడ్జికి వెళ్ళేంత ఖర్మ యీ జీవితంలో నాకు పట్టదు!"

"అతడు గణపతీ లాడ్జిలో ఉంటున్నాడు. కాని అతడిని మీరు ఏమీ అనొద్దు. ఏదేనా కావలిస్తే నాతో చెప్పండి. నన్ను ఎంతేనా తిట్టండి."

సుబ్బారావు చుట్టను యాష్ట్రేలో పడేసి ఆమె కళ్ళలోకి కోస్తున్నట్టు చూశాడు.

"కలలు గనకు! వాడితో నీ పెళ్ళి జరగదు. నువ్వు గుడ్డిదానవు అయినా వాడికి కట్నాన్ని నా నమ్మకం. కారు రిపేరు చేసినవాడిని నువ్వు ప్రేమించనక్కరలేదు. పది రూపాయిలు పడేస్తే ఏ మెకానిక్ అయినా ఆ పని చేస్తాడు."

"కారు రిపేరు చేసినందుకు నేను అతడిని ప్రేమించడంలేదు. అతడు నాకు నచ్చాడు. నేనంటే అతడికెంతో ప్రేమ. మా జీవితం సుఖంగా సాగుతుంది"

"షటప్, యూ ఫూల్!" అర్చాడతను.

సీత తృళ్ళిపడింది.

"సీతా, ఇటుపైన కారును స్వయంగా నడుపుకుని నువ్వు బయటకు వెళ్ళొద్దు. డ్రయివర్ రాజును తీసుకెళ్ళు" తండ్రి ఆదేశించాడు.

ఆమె తలాడించింది. సుబ్బారావు గబగబా బయట సిద్ధంగా వున్న మెర్సిడిస్ కారువైపు నడిచాడు.

ప్రక్క గదిలోంచి యిదంతా మౌనంగా విన్న

శారద అక్కడికొచ్చింది.

శారద కూతురి భుజంమీద చెయ్యి వేసింది.

"ఆయనతో నువ్వు చెప్పిందంతా నిజమేనా?" అడిగిందామె.

"అవునమ్మా."

"దాన్ని గురించి యింతవరకూ నాకెందుకు చెప్ప లేదూ? నేను చచ్చిపోయాననుకున్నావా?"

సీత తల్లిని కౌగలించుకుంది.

"అలా అనకమ్మా! నాన్నగారితో చెప్పానుగా? నువ్వంతా విన్నావు. లేకపోతే నీతోనూ చెప్పేదాన్ని."

"ఈ ప్రేమలు మనకొద్దమ్మా. నీకేది మంచిదో ఆయనకు బాగా తెలుసు. మనం ఆడవాళ్ళం. మొగాళ్ళు చెప్పినట్లు వినడం మనకు మంచిది."

తల్లివైపు సీత నవ్వుతూ చూసింది.

"అమ్మా, నువ్వు యీ కాలం స్త్రీవి కావు. ఈనాటి ప్రపంచంలో ఆడా, మగా భేదాలు లేవు. శ్రీమతి ఇందిరాగాంధీ మన ప్రధాన మంత్రి. అది గుర్తుంచుకో! మునపటిలా పెళ్ళిళ్ళు యిప్పుడు జరగవు. జీవన్ నన్ను ప్రేమిస్తున్నాడు. అతడు నాకు నచ్చాడు. మా యిద్దరికీ పెళ్ళి చేయడం అన్ని విధాలా మంచిది. తలిదండ్రులు అలా చేయడం వాళ్ళ కర్తవ్యంగా భావించాలి" అంది సీత.

"ఏమోనమ్మా, ఏం జరుగుతుందో! ఆయన పట్టుదల మనిషి" అంది శారద.

"నేను ఆయన కూతుర్నిగా! ఏమవుతుందో చూద్దువు గాని" అంది సీత సాలోచనగా.

# 2

సీత ఫియట్ కారు దగ్గరకు వెళ్ళింది. ఆమెను చూసి డ్రయివర్ రాజు పరుగెత్తుకొచ్చాడు.

"అమ్మగారూ, నే నొస్తాను," అన్నాడు డ్రయివర్.

అతడికి ఇగ్నిషన్ కీని ఆమె యిచ్చింది. తలుపు తెరిచి ఆమె వెనుక సీటుమీద కూర్చుంది. రాజు వెనుక తలుపు మూసి, స్టీరింగ్ వీల్ వెనుక చతికిలబడ్డాడు.

"ఎక్కడికమ్మా?" అంటూ ముందు తలుపు మూశాడు.

"లజ్ వైపు పద."

ఫియట్ కారు బయటకు దూసుకుపోయింది. గేటు బయట నిలిచిన గూర్ఖా ఆమెకు సెల్యూట్ చేశాడు.

లజ్ లో కారు ఆగింది. ఆమె డ్రయివర్ వయిపు చూసింది. హేండ్ బాగ్ లోంచి వందరూపాయల నోటు తీసి ఆమె డ్రయివర్ కిచ్చింది. కాగితంమీద రాసిన ఒక లిస్టు అతడి కిచ్చింది.

సమీపంలో వున్న నాజర్ స్టోర్స్ వైపు చెయ్యి చూపించింది.

"అక్కడికెళ్ళి యీ నోటుపుస్తకాలు కొని పట్రా! పుస్తకం మీద 120 పేజీలని వేసి వుండొచ్చు. అయినా లెక్కపెట్టి చూడు!" అందామె.

డ్రయివర్ రాజు డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు. కొంచెం దూరంలో స్కూటర్ ఆపి పక్కనే నిలబడి వున్న జీవన్ వైపు చూసి ఆమె దిగింది. అతడు వేగంగా దగ్గర కొచ్చాడు.

"జీవన్, మనం ఆ రెస్టారెంట్ లోకి పోదాం పద! నా కూడా నాన్నగారు నీడను పంపారు" అందామె.

ఇద్దరూ వేగంగా నడిచి కాబిన్ లోకి ప్రవేశించారు.

పక్క పక్కనే కూర్చున్నారు. బాయ్ రాగానే ఆమె టీ ఆర్డరిచ్చింది.

పక్కనున్న జీవన్ వైపు ఆమె నవ్వుతూ చూసింది. ఆప్యాయంగా అతడి చెయ్యి పట్టుకుంది.

"నాన్నతో అంతా చెప్పేశాను." అందామె.

"ఏమన్నారు?"

"ఈ పెళ్ళి జరగదు అన్నారు. ఈనాడు అటువంటి మాటలు మనం సినిమాల్లో వింటూవుంటాం."

"అయితే ఏం చేద్దాం?" అడిగాడతను ఆత్రంగా.

"మనం అనుకున్నది చేసుకుందాం. ఎవ్వరూ మన్ని ఆపలేరు." అందామె.

బాయ్ వేడి టీ తెచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్ళి పోయాడు. ఆమె అతడి కళ్ళలోకి చూసింది. అలా చూస్తూనే వుంది.

"ఇలా నీకేసి చూస్తూ శాశ్వతంగా వుండిపోవాలని పిస్తోంది" అందామె.

పక్కకు వంగి అతడామె బుగ్గమీద ముద్దెట్టు కున్నాడు.

"సీతా. మీ నాన్నగారు కోటీశ్వరులు. కోపంవస్తే మనిషిని నలిపేస్తారని అనేకమంది అంటూవుంటారు. అటు వంటి పరిస్థితుల్లో నువ్వు నాతో చెయ్యి కలపడం ఎంత వరకూ మంచిదో ఆలోచించు!"

ఆమె విచిత్రంగా నవ్వింది.

"నాన్నగార్ని గురించి నాకు బాగా తెలుసు. ఒక ప్పుడు శ్రీనివాస్ ఆయనకు కుడి భుజంగా వుండేవాడు. ఎందుకో పేచీ వచ్చింది. నాన్నగారు అతడిని తొక్కి పారేశారు. ఎక్కడా శ్రీనివాస్‌కు ఉద్యోగం దొరక

లేదు. ఈ పట్నంలో వుండలేక అతడు తన గ్రామానికి వెళ్ళిపోతాడు."

"అటువంటి వ్యక్తిని ఎదిరించడం మనకు ఎంతవరకూ మంచిదో ఆలోచించు! సీతా, నాకెంత కష్టమొచ్చినా ఫరవాలేదు. కాని నావలన నువ్వు కష్టపడితే నేను చూడలేను" అన్నాడు జీవన్.

"జీవన్, డోంట్ బాదర్! నాన్నగారు ఎటువంటి వారయినా ఆయనలోని బలహీనత నాకు తెలుసు. వీక్ స్పాట్‌లో దెబ్బ తగిలితే ఆయన తట్టుకోలేరు."

జీవన్ మౌనంగా నవ్వాడు.

"జీవన్, నాన్నగారికి నీ అడ్రస్ తెలుసు. నీకు ప్రమాదం రావడం నాకిష్టం లేదు. ఆయన నీతో మాట్లాడొచ్చు. ఆయన ఏం చెప్పినా సరే అను. అలా చేస్తే నీకు డేంజర్ వుండదు. నిన్ను నా దగ్గర నుంచి దూరంగా పంపడానికి నాన్న తప్పక ప్రయత్నిస్తారు."

ఆమె టైమ్ చూసింది.

"ఈపాటికి డ్రయివర్ వచ్చి వుంటాడు. నేను వెళ్తాను. మరో టీ తాగి నువ్వు వెళ్ళొచ్చు!" అతడు నవ్వాడు.

"రాత్రి పది తర్వాత ఫోన్ చెయ్యి. ఎక్కడ కలుసుకునేదీ మనం నిర్ణయించుకుందాం. పదింటికి నాన్న నిద్రపోతూ వుంటాడు."

"అలాగే" అన్నాడతను.

ఆమె నవ్వుతూ కాబిన్‌లోంచి బయటకు వెళ్ళిపోయింది.

డ్రయివర్ రాజు ఆమెను నలువయిపులా చూశాడు. ఎక్కడా ఎవ్వరూ లేరు.

"రాజూ, యింత సేపయిం దేమిటి? బోర్ కొట్టి టీ తాగడానికి వెళ్ళారు" అందామె.

"పేజీలు లెక్క పెట్టడానికి టైమయిందమ్మా!" అన్నాడు డ్రయివర్ ఆమెకు నోటుపుస్తకాల పాకెట్ యిస్తూ.

డ్రయివర్ యిచ్చిన డబ్బును ఆమె బాగ్‌లో పడేసు కుంది.

"ఎక్కడికి?"

"నా క్లాస్‌మేట్ మాలతి యింటికి పద" అందామె.

## 3

ఏర్ కండిషన్డు గదిలో కుషన్డు రొటేటింగ్ కుర్చీలో కూర్చున్న సుబ్బారావు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఒక అనామకుడు, పేరూ వూరూ లేని ఒక బీదవాడు తన యింట్లోకి ప్రవేశించకుండా తను అడ్డుపడాలి.

అతడి పళ్ళమధ్య చుట్ట వెలుగుతోంది. అతడు బజర్ నొక్కాడు రెండుసార్లు. అతడి కుడిభుజమైన వెంకట్ పరుగెత్తుకొచ్చాడు.

సుబ్బారావు పొగ వదులూ వెంకట్ వైపు చూశాడు.

"జీవన్ అనే యువకుడు మోడర్న్ ఇంజనీరింగ్ కంపెనీలో పనిచేస్తున్నాడు. గణపతీ లాడ్జిలో వుంటు న్నాడు. వాడి బుర్ర చెడిపోయినట్లుంది. పిచ్చిపనులు చేస్తున్నాడు. వాడికి బుద్ధి చెప్పాలి!"

వెంకట్ మౌనంగా విన్నాడు.

"వెంటనే మస్తాన్‌కి ఆ పని అప్పగించు" అన్నాడు సుబ్బారావు.

మస్తాన్ పదేళ్ళుగా సుబ్బారావు మజిల్ మన్‌గా వుంటున్నాడు. ప్రతినెలా అతనికి, పనివున్నా లేక

పోయినా వెయ్యి రూపాయలు పంపబడుతుంది. పని సవ్యంగా నిర్వహించాక స్పెషల్ బహుమతి వేరే వుంటుంది.

మస్తాన్ దేవాంతకుడు. పిశాచంలా వుంటాడు. అతడితో సాధారణంగా ఎవ్వరూ పేచీ పెట్టుకోరు.

"చెప్తాను బాస్!" అన్నాడు వెంకట్.

వెంకట్ గదిలోంచి బయటకు వెళ్ళేలోగా సుబ్బారావు మనసు మారింది.

"వెంకట్!"

అతడు వెనక్కి తిరిగి వచ్చాడు.

"ప్రస్తుతం మస్తాన్ వద్దు. నువ్వు వెళ్ళి జీవన్‌ని కల్సుకో! వాడిని యిక్కడకు తీసుకురా. మాట్లాడి చూద్దాం. నాతో మాట్లాడాక అతడు మారొచ్చు. అలా మారకపోతే మస్తాన్‌కి పని అప్పగించుదాం."

"అది మంచిపద్ధతి బాస్. గోరుతో తీసేదానికి గొడ్డలి అనవసరం" అన్నాడు వెంకట్.

"వెంటనే చెప్పింది చెయ్యి! ఆ జీవన్‌గాడు సాయంత్రము ఐదు లోపల నా ముందు వుండాలి!"

"యస్. బాస్" అని వెంకట్ కదిలాడు.

మోడర్న్ ఇంజనీరింగ్ కంపెనీ ఆఫీసుకు వెళ్ళాడు వెంకట్. రిసెప్షన్‌లో కూర్చున్న యువతిని జీవన్ గురించి అడిగాడు.

"ఆయన గదిలో వున్నారు. లోపలకు వెళ్ళండి" అందామె.

వెంకట్ లోపలకు నడిచాడు. స్వింగ్ డోర్ మీద జీవన్ పేరుంది. అతను స్వింగ్ డోర్ తోసి లోపలకు వెళ్ళాడు.

జీవన్ అందమైన యువకుడు. వయస్సు 26 వుంటుంది. కోలముఖం. మెరిసేకళ్ళు, సన్నటి మీసాలు.

జీవన్ వెంకట్ వైపు నవ్వుతూ చూశాడు. "ప్లీజ్ సిడౌన్! ఏం కావాలో చెప్పండి!"

వెంకట్ కూర్చుని జీవన్ వైపు చూశాడు.

"మిస్టర్ జీవన్, మీరు నాతో రావాలి."

"ఎక్కడకు?"

"సుబ్బారావుగారి పేరు విన్నారా?"

జీవన్ నవ్వాడు.

"ఆయనతో మాట్లాడ్డానికి."

"ఇప్పుడు నేను రాలేను. పనులున్నాయి. తర్వాత వస్తాను."

అతడి వంక సూటిగా చూశాడు వెంకట్.

"మీ కంపెనీ అధిపతి తారాచంద్ సుబ్బారావుగారి మిత్రుడు. అందువలన పనులు మానుకుని నాతో రావల్సిందే!"

"భయపెడుతున్నారా?" అడిగాడు జీవన్.

"ధైర్యముంటే భయపడనక్కరలేదు."

"నేను పిరికిపందను కాను. నాకు అర్జంటు పని వుంది. మూడింటికి వస్తాను."

వెంకట్ కుర్చీలోంచి లేచాడు.

"మిస్టర్ జీవన్. సరిగ్గా మూడింటికి యీ ఆఫీసు బయట నేను కారులో వేచి వుంటాను. కిందకి దిగివస్తే మనం సుబ్బారావుగారి దగ్గరకు వెళ్ళొచ్చు."

"నేను నా స్కూటర్ మీద వస్తాను. కారులో మీరు నా ముందు వెళ్ళొచ్చు."

"ఆల్ రైట్." అని వెంకట్ బయటకు నడిచాడు.

స్వింగ్ డోర్ దగ్గర ఆగి వెనక్కి తిరిగి అతడు జీవన్ వైపు చూశాడు.

"అప్పుడు రాలేనని అనకూడదు. మాట మారిస్తే చిక్కుల్లో యిరుక్కుంటారు."

"మాట మార్చటం నాకు అలవాటు లేదు. తప్పక వస్తాను. సుబ్బారావుగారిలాంటి పెద్దమనిషి రమ్మని కబురు పంపితే వెళ్ళకుండా వుండగలనా?" అన్నాడు జీవన్.

వెంకట్ డోర్ లాగి వెళ్ళిపోయాడు. కుర్చీలో వెనక్కివాలి జీవన్ సిగరెట్ వెలిగించాడు. పొగ వదులూ ఆలోచిస్తున్నాడు. తను ధైర్యంగా వెళ్ళి సుబ్బారావుతో మాట్లాడాలి. అంతవరకూ తన జీవితసమస్య పరిష్కరించబడదు.

# 4

ఏర్ కండిషన్డు గదిలో కొచ్చిన జీవన్ వైపు సుబ్బారావు పరీక్షగా చూశాడు. వెంకట్ బయటకు వెళ్ళిపోయాడు.

జీవన్ వైపు చుట్టపొగ వదులుతూ సుబ్బారావు చూస్తూనే వున్నాడు. తన కూతుర్ని జీవన్ ఎందుకంతగా ఆకర్షించాడో అతడికి అర్థమైంది.

జీవన్ కి చదువుతో పాటు చక్కటి రూపం కూడా వుంది. అతడి మెదడులో బాంబులా ఏదో పేలింది. మస్తాన్ చేత యాసిడ్ జల్లిస్తే జీవన్ కురూపి అవుతాడు. అటుపైన తన కూతురు అతడిని వదిలేస్తుంది.

మరో బాంబు మెదడులో పేలింది. గతంలో జరిగిన ఒక విషయం అతడికి జ్ఞాపకొచ్చింది. జానీ అనే బొచ్చుకుక్కను బెంగుళూరులో అతడు కొన్నాడు. ఆ కుక్కంటే సీతకు చాలా యిష్టం.

రాత్రుళ్ళు జానీ కూతురు పక్కనే పరుపు మీద పడుకునేది. జానీని ఎత్తుకుని సీత యింట్లో తిరిగేది, కారులో వెళ్ళేది.

మూడేళ్ళ తర్వాత ఏదో రోగం వచ్చి జానీ బొచ్చంతా రాలిపోయింది. చర్మం మీద పుళ్ళు! ఎవ్వరూ దాన్ని దగ్గరకు రానిచ్చేవారు కాదు. కాని సీత దాన్ని వదల్లేదు.

అది కళ్ళతో చూడలేక వెటర్నరీ డాక్టర్ చేత యింజక్షన్ యిప్పించి జానీని సుబ్బారావు చంపించేశాడు. సీతకు తెలియకుండా యిదంతా తను చేయించాడు. జానీ చనిపోయినందుకు సీత ఎంతగానో ఏడ్చింది.

అటువంటి సీత కురూపయినా జీవన్ని వదుల్తుందా?

సుబ్బారావు ఆలోచిస్తున్నాడు. జీవన్ అలా నిలబడే వున్నాడు.

"సార్, కూర్చోవచ్చా?" అడిగాడు జీవన్.

"కుర్చీలు ఖాళీగా వున్నాయిగా, కూర్చోవచ్చని తెలియదూ?"

"మీరు అనుమతివ్వనిదే కూర్చోడం మర్యాదగా వుండదుగా?"

సూటిగా జీవన్ వైపు చూశాడు సుబ్బారావు.

"నా అనుమతి పొందేవా నా కూతుర్ని ప్రేమించడానికి?"

"ఆమె అనుమతి పొందాను."

"అది చాలా? పెద్దవాళ్ళతో మాట్లాడక్కర లేదా?"

"మాట్లాడటానికి వచ్చానుగా!"

ఆరిపోయిన చుట్టను సుబ్బారావు గోల్డులైటర్ తో వెలిగించాడు.

"జీవన్, నీ తలిదండ్రులు ఎక్కడ వున్నారు?"

"పై లోకంలో."

"ఎవరున్నారు నీకు?"

"నేను ఒంటరివాడిని. అనాథాశ్రమంలో వుండి నేను బి. ఇ., పాసయ్యాను" అన్నాడతను మౌనంగా.

"అటువంటువాడవు వినయంగా మసులుకోవాలి!"

"వినయంగా వుండటం అందరికీ మంచిదే, నాకే కాదు."

"జీవన్, సీత పెద్దింటిపిల్ల. ధనవంతుల బిడ్డ. ఆమెను వలలో వేసుకోవడం నీకు ప్రమాదకరం!"

"నేనామెను కల్సుకున్నప్పుడు మీ కూతురని నాకు తెలియదు సార్. తర్వాత తెలిసింది."

"ఇంతవరకూ ఏదో జరిగింది. ఇటుపైన నువ్వు దాని దగ్గరకు వెళ్ళకూడదు."

"అలాగే సార్."

"ఆమెను మర్చిపోవడానికి నీకెంత కావాలి?"

"నాకు డబ్బొద్దు సార్. వచ్చే జీతం నాకు చాలు."

సుబ్బారావు ఒక కవర్ను అతడి వైపు తోశాడు.

"ఎవరేనా డబ్బిస్తే వద్దనకు. డబ్బు మనిషికి ఎప్పుడూ ఉపయోగపడుతుంది. ఆ కవరులో 25 వేలుంది. తీసుకో! అది పట్టుకుని యీ పట్నం వదిలి మరెక్కడికేనా వెళ్ళిపో!" అన్నాడు సుబ్బారావు గంభీరంగా.

"నా వుద్యోగం వదిలేస్తే మళ్ళా నాకు మంచి వుద్యోగం దొరక్కపోవచ్చు సార్!"

"నా కూతురికి నువ్వు చాలా దూరంగా వుండాలి. దగ్గరగా వుండడానికి వీలులేదు. నువ్వు పనిచేసే కంపెనీకి ఇండియా అంతటా బ్రాంచీలున్నాయి. తారాచంద్‌తో

మాట్లాడాను. నిన్ను అమృతసర్ బ్రాంచికి ట్రాన్సఫర్ చేస్తానన్నాడు."

జీవన్ అతడి వైపు సూటిగా చూశాడు.

"మీరు పెద్దలు. అన్నీ తెల్సినవారు. మిమ్మల్ని సంతోషపెట్టడానికి నేను అమృతసర్ వెళ్తాను" అన్నాడు జీవన్.

సుబ్బారావు ఆనందంతో నవ్వాడు.

"నువ్వు బుద్ధిమంతుడవే! అనాధాశ్రమంలో నీలా పెరిగిన ఏ అమ్మాయినో చూసి పెళ్ళి చేసుకో! నీ జీవితం సుఖంగా సాగుతుంది."

"అలాగే సార్."

"ఇటుపైన సీత నిన్ను కలిస్తే మర్చిపొమ్మని చెప్పు! నీ మనసు మారిందను!"

"చెప్తాను సార్."

"ఇక్కడ తలాడించి మరోవిధంగా ప్రవర్తిస్తే నువ్వు కష్టాల పాలవుతావు. నిన్ను అణగదొక్కేస్తాను."

"ఆ పరిస్థితి రాదు, సార్."

సుబ్బారావు వాచ్ చూశాడు. ఐదు కావస్తోంది. పని తొందరగా ముగిసినందుకు అతడు లోలోపల సంతోషించాడు.

"వారం రోజులు గడువిస్తున్నాను. ఆ లోపల నీ లాడ్జి గది ఖాళీ చేసి పోవాలి. నా మనుషులు అంతా గమనిస్తూ వుంటారు."

"చేస్తాను సార్."

సుబ్బారావు అతడికి షేక్‌హేండ్ యిచ్చాడు.

"జీవన్, గుడ్ లక్! ఆ కవరు తీసుకో!"

కవరు తీసుకొని జీవన్ మెల్లగా గదిలోంచి బయటకు నడిచాడు.

## 5

తారాచంద్ కి ఎదురుగా కూర్చున్నాడు జీవన్.

"మై డియర్ బాయ్, ట్రాన్స్ఫర్ ఆర్డర్ నీకు అందే వుంటుంది. అమృతసర్ వెళ్ళి అక్కడ మన బ్రాంచి బాగా వృద్ధి చెందేటట్లు నువ్వు చూడాలి. అక్కడ చాలా బాగుంటుంది. కొంతకాలం అక్కడ వుంటే మళ్ళా యిక్కడకు తిరిగి రానని నువ్వే అంటావు" అన్నాడతను.

జీవన్ లోలోపల నవ్వుకున్నాడు. సుబ్బారావు చెప్పడంవలన తారాచంద్ తనను అంతదూరం వెళ్ళమంటున్నాడు. కాని తనే బ్రాంచి అభివృద్ధికోసం పంపుతున్నట్లు చెప్తున్నాడు.

"జీవన్, నువ్వు పెళ్ళి చేసుకోవడం మంచిది. హోటల్లో తింటే డబ్బు ఎక్కువగా ఖర్చవుతుంది. పెళ్ళయినాక ఒక ఫ్లాట్ ఫ్రీగా కంపెనీ నీకు యిస్తుంది."

"అలాగే సార్. నేనూ అదే అనుకుంటున్నాను" అన్నాడు జీవన్.

ఒక కవర్ను అతడు జీవన్ కి యిచ్చాడు. "ఎల్లుండి నువ్వు బయలుదేరుతున్నావు. రైలు టికెట్ రిసర్వ్ చేయించాను. ఆ కవరులో వుంది."

ఆ కవర్ను తీసుకున్నాడు జీవన్.

"అంతా యింత వేగంగా చేసినందుకు మీకు నా ధన్యవాదాలు సార్."

"ఆల్ రైట్. గుడ్ లక్! అమృత్ సర్ నేను వస్తూ వుంటాను. డోంట్ బాదర్!"

"నాకు ఏ బెంగా లేదు సార్. నా అనేవాళ్ళు లేని

వాడు ఎక్కడున్నా ఒకటే!" అన్నాడు జీవన్.

సెలవు తీసుకుని జీవన్ బయటకు వెళ్ళిపోయాడు.

సీ * *

బీచ్‌లోపల రోడ్డుమీద ఫియట్ కారు ఆగివుంది. డ్రయివర్ రాజు కారులో కూర్చుని వాళ్ళవైపు చూస్తున్నాడు.

అరగంట తర్వాత సీత కారు దగ్గరకు వచ్చింది. జీవన్ తన స్కూటర్ వైపు వెళ్ళాడు. డ్రయివర్ రాజు పరీక్షగా సీత వంక చూశాడు. ఆమె కళ్ళమ్మట నీళ్లు కారుతున్నాయి.

ఆమె సీటుమీద కూర్చుని తలుపు మూసింది. "ఇంటికి పద!" అందామె డ్రయివర్‌తో.

రాజు ఎదురుగా వున్న స్కూటర్ వైపు చూశాడు. వెనుదిరిగి చూడకుండా జీవన్ వెళ్ళిపోయాడు. ఏదో జెడిసి వుంటుంది.

డ్రయివర్ రాజు కారును వేగంగా యింటివైపు పోనిస్తున్నాడు. ఏదో కారు వెనుకనే వస్తోంది. అందులో గూండాల్లాంటి మనుషులున్నారు. ఎవరు వాళ్ళు?

డ్రయివర్ రాజు అనేక మలుపులు తిప్పాడు. వెనక కారు ఇంకా వెంటాడుతూనే వుంది.

గేటు దాటి ఫియట్ కారు యింటి కాంపౌండులోకి ప్రవేశించింది. వెనక కారు తిన్నగా వెళ్ళిపోయింది.

సోఫాలో కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు సుబ్బారావు. అతడి ముందునుంచి లోపలకు వెళుతోంది సీత.

"అమ్మాయి!" పిల్చాడతను.

ఆమె ఆగి అతడి వంక చూసింది. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రబడ్డాయి.

"ఎందుకలా వున్నావు?"

"నేనెలా వుంటే మీ కెందుకు నాన్నా? మీ కోరిక ఫలించినందుకు సంతోషించండి. పాపిష్టి డబ్బు ప్రేమికులను యింతగా విడదీస్తుందని నే ననుకోలేదు" అందామె.

సుబ్బారావు గంభీరంగా నవ్వాడు.

"జీవన్ పేదరికంలో పెరిగాడు. ఇరవై అయిదు వేలు చూసేసరికి అతడి కళ్లు తిరిగాయి. నిన్నేమిటి, అతడు యీ లోకాన్నే మర్చిపోయాడు. అతడు నిన్ను డబ్బు కోసం ప్రేమించాడని యిప్పుడేనా తెల్సుకో!" అన్నాడు తండ్రి.

ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది.

డ్రయివర్ రాజు హాల్లో కొచ్చాడు. సుబ్బారావు అతడివైపు చూశాడు.

"కొందరు గూండాలు కారులో మన కారును యింటిదాకా వెంటాడారు, సార్!"

"ఎందుకు వెంటాడి వుంటారు?"

"తెలియదు సార్."

"నువ్వు పొరబడి వుంటావు. నా కార్లను వెంటాడే ధైర్యం యీ పట్నంలో ఎవ్వరికీ వుండదు. అయినా కారు నంబరు చూశావా?"

"చూడలేదు సార్."

"మళ్ళా వెంటాడితే యీసారి చూడు. వాళ్ళ పని పట్టిస్తాను" గర్జించాడు సుబ్బారావు.

## 6

ఖరీదైన కంజీవరం పట్టుచీరలో ఆమె చాలా అందముగా వుంది. ఒంటిమీద చాలా నగలున్నాయి. సీత కారులో వెళుతోంది. వెనుక నుంచి ఓ కారు దూసుకు

వచ్చి ఫియట్‌ను దాటిపోయింది. కొంచెం దూరం వెళ్లాక ఆ కారు సడెన్ బ్రేక్‌తో ఆగింది.

నల్గురు గూండాలు ఫియట్ వైపు పరుగెత్తుకొచ్చారు. డ్రయివర్ రాజును ఒకడు బలంగా తలమీద కొట్టాడు. అతడు కిందపడ్డాడు.

అరుస్తూన్న సీతను ఎత్తుకుపోయి వాళ్ళకార్లో కూర్చో బెట్టారు. క్షణంలో ఆ కారు దూసుకుపోయింది.

డ్రయివర్ రాజు కళ్ళు తెరిచి నలువైపులా చూశాడు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. వాళ్ళు పారిపోయిన కారు నంబర్ని వల్లించుకుంటూ డ్రయివర్ కారును యింటికి పోనిచ్చాడు.

హాల్లో కూర్చున్న సుబ్బారావు ముందు డ్రయివర్ రాజు ఏడుస్తూ పడిపోయాడు.

"కారులో వచ్చి ఆ గూండాలు అమ్మాయిగార్ని ఎత్తుకుపోయారండి!" అన్నాడు డ్రయివర్.

అమాంతంగా సుబ్బారావు సోఫాలోంచి లేచాడు. అతడి ఒళ్ళు వణికింది. గుండె దడదడ కొట్టుకుంది.

"ఎవరు వాళ్ళు?"

"ఒకరోజు వాళ్ళే మన కారును వెంటాడారు సార్. నన్ను నెత్తిమీదకొట్టి అమ్మాయిగార్ని తీసుకుపోయారు."

"కారు నంబరు చూశావా?"

"నల్లటి అంబాసిడర్ కారు, TMP 3246"

శారద ఏడుస్తూ భర్తవైపు చూసింది.

"అన్ని నగలు పెట్టుకుని వెళ్ళొద్దంటే వినలేదు. తన ఫ్రెండ్ మాలతికి చూపించివస్తానంది" అందామె.

"నువ్వు భయపడకు!" అని సుబ్బారావు ఫోన్ దగ్గరకు నడిచాడు.

రిసీవర్ ఎత్తి కమీషనర్ ఆఫ్ పోలీసు నంబరు తిప్పాడు. తన పేరు చెప్పి కమీషనర్ ఆనంద్ కు కనక్షన్ యివ్వమన్నాడు.

అటువైపునుంచి ఆనంద్ కంఠం వినపడింది. "మిస్టర్ ఆనంద్, మా అమ్మాయి సీతను నలుగురు గూండాలు నల్లటి అంబాసిడర్ కారులో ఎత్తుకుపోయారు" అని కారు నంబర్ యిచ్చాడు.

"ఆశ్చర్యంగా వుంది సార్" అన్నాడు కమీషనర్.

"మిస్టర్ ఆనంద్, మీరు వెంటనే ఏదేనా చేస్తారా లేకపోతే ముఖ్యమంత్రికి ఫోన్ చెయ్యనా?"

"ముఖ్యమంత్రిదాకా వెళ్ళడం ఎందుకు సార్? ఆ కారును మావాళ్ళు అరగంటలో పట్టుకుంటారు."

"మా డ్రయివర్ కిచ్చి అమ్మాయి ఫోటో మీకు పంపుతున్నాను. డ్రయివర్ రాజు యితర విషయాలు మీతో చెప్తాడు. ఈ కిడ్నాపింగ్ జరిగినప్పుడు డ్రయివర్ రాజు అక్కడే వున్నాడు."

"వెంటనే పంపండి."

సుబ్బారావు రిసీవర్ పెట్టేశాడు.

సీత ఫోటో తీసుకుని డ్రయివర్ రాజు బయటకు వెళ్ళిపోయాడు.

సోఫాలో కూర్చుని శారద ఏడుస్తోంది. ఆమె వైపు విసుగ్గా చూశాడు సుబ్బారావు.

"ఏడ్చే అవకాశం కోసం నీ కళ్ళు నిండి ఎదురు చూస్తూ వుంటాయి" అన్నాడు కోపంగా.

"ఏడవక ఏం చెయ్యను? వాడు అమెరికా వెళ్ళి, ఎవత్తినో పెళ్ళాడి యిక్కడకు రానంటున్నాడు. దీన్ని యెవరో యెత్తుకుపోయారు! నా బిడ్డను వాళ్ళు ఏం

చేస్తారో!”

“నీ కూతుర్ని వాళ్లు ఏమీ చెయ్యరు. కాస్సేపట్లో నాకు ఫోన్ చేస్తారు. లక్షో, రెండు లక్షలో యిస్తే దాన్ని వదిలేస్తామంటారు. ఈ లోకంలో ఏం జరిగినా డబ్బు కోసమే!”

శారద మౌనందాల్చింది. సుబ్బారావు హాల్లో పచార్లు చేస్తూ ఆలోచిస్తున్నాడు. పోలీసులను నమ్ముకు కూర్చుంటే లాభంలేదు. డిటెక్టివ్ వాలి పట్నంలో వున్నాడు. అతడికి ఫోన్ చేయడం మంచిదేమో! సుబ్బారావు ఆలోచిస్తున్నాడు.

అశోక్ హోటలు నంబరు తిప్పి సుబ్బారావు వాలి కోసం అడిగాడు. క్షణంలో కనెక్షన్ వచ్చింది.

“హలో, వాలి హియిర్!”

“వాలిగారూ, సుబ్బారావుని. వారంరోజుల క్రితం మిమ్మల్ని కలుసుకున్నప్పుడు యిది నేను ఊహించలేదు. మా అమ్మాయి సీతను యెవరో యెత్తుకుపోయారు!”

సుబ్బారావు వివరాలన్నీ యిచ్చాడు.

“సుబ్బారావు భాయ్, డ్రయివర్ రాజా ఎటువంటి వాడు?” అడిగాడు వాలి.

“వాడు నా దగ్గర పదేళ్ళనుంచి వుంటున్నాడు. చాలా మంచి మనిషి.”

“సీతను ఒక రోజు నీ యింట్లో చూశాను. చాలా అందంగా వుంటుంది” అన్నాడు వాలి.

“ఈ రోజుల్లో అందం మనిషికి శత్రువు, సార్” అన్నాడు సుబ్బారావు.

“సుబ్బారావు భాయ్, నేను పోలీస్ కమీషనర్తో

మాట్లాడి చేయవలసింది చేస్తాను. ఎత్తుకుపోయినవాళ్ళు నీకు ఫోన్ చేస్తే వెంటనే నాకు చెప్పు! పిల్లకేదో అవుతుందని భయపడకు. సీతకు ప్రమాదం రాకుండా నేను చూస్తాను" అన్నాడు వాలి.

"ఇంతవరకూ ఫోన్ కాల్ రాలేదు, సార్."

"డబ్బు కోసం యిది జరిగుంటే ఫరవాలేదు. డబ్బు పారేస్తే ఆమెను వదిలేస్తారు. మరో ఉద్దేశంతో మన దేశంలో ఆడపిల్లలను ఎత్తుకుపోతున్నారు. వాళ్ళు డబ్బు అడగరు. ఆడపిల్లలను వ్యభిచార గృహాలకు అమ్మేస్తారు. అరేబియా మొదలగు దేశాలకు పంపేస్తారు."

వాలి చెప్పింది విని సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. సీతను, తనకూతుర్ని వాళ్ళు గల్ఫుదేశాలకు పంపేస్తారా?

"సుబ్బారావు భాయ్, నువ్వు గాభరాపడకు. అమ్మాయి యెక్కడో మనకు కనిపిస్తుంది."

మరికొంతసేపు మాట్లాడి సుబ్బారావు రిసీవర్ని పెట్టేశాడు.

విచారవదనంతో భార్య పక్కనే సోఫాలో కూర్చున్నాడు. తన దగ్గర కోట్లువున్నాయి. కాని ఈ క్షణంలో వాటి విలువ సున్నా అనిపిస్తోంది.

సీతంటే అతడికి ప్రాణం. ఆమెకు ఏ లోటూ లేకుండా అతడు చూస్తూ వచ్చాడు. ఇప్పుడామె వాళ్ళ చేతుల్లో ఏం కష్టపడుతోందో!

మెల్లిగా అతడి చెయ్యి భార్యమీదపడింది. ఆమె అతడివైపు చూసింది. సుబ్బారావు కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి.

"చూశారా! రాజయినా, బికారయినా యీ పరిస్థితిలో ఏడవ్వాలసిందే! మనకెంతో వున్నా యీ సమయంలో ఏదీ లేదనిపిస్తుంది" అంది శారద.

సుబ్బారావు మాట్లాడలేదు. ఫోను మ్రోగింది. వాళ్ళే అయివుంటారు. గబగబా వెళ్ళి అతడు రిసీవర్ని ఎత్తాడు.

"హలో, సుబ్బారావు స్పీకింగ్!"

"ఆఫీసునుంచి, సార్. అకౌంటెంట్ అనంతరామన్, సార్. నాకు పదివేలు అప్పుకావాలి, సార్."

"ఎందుకు?"

"నా కూతురు పెళ్ళికి కావాలి, సార్. ఒక యువకుడు అమ్మాయిని ప్రేమించి పైసా కట్నంలేకుండా పెళ్ళాడ్తానన్నాడు. వెంటనే పెళ్ళి చెయ్యాలని నిశ్చయించాను. అందుకు అప్పుకావాలి, సార్."

"చూద్దాం, నేను ఆఫీసుకొచ్చాక!" అని అతను రిసీవర్ పెట్టేశాడు.

7

టెలిఫోన్ మ్రోగింది. సుబ్బారావు రిసీవర్ని అందుకున్నాడు. అటువైపునుంచి వాలి కంఠం వినపడింది.

"సుబ్బారావు భాయ్, నువ్వు చెప్పిన నంబరున్న నల్లటి అంబాశిడర్ కారు మీనంబాకం ఏర్పోర్టు పార్కింగ్ స్థలంలో మాకు దొరికింది. వాళ్ళు కారును అక్కడ వదిలేశారు" అన్నాడు వాలి.

"గుడ్ గాడ్, ఆ కారు ఎవర్ది?"

"ఎల్.ఐ.సి.లో పనిచేసే ధర్మారావుది. ఇవాళ పొద్దుట తన కారు దొంగిలించబడిందని ధర్మారావు మైలాపూర్ పోలీస్ స్టేషన్లో రిపోర్టిచ్చాడు."

"గుడ్ గాడ్! వాలిగారూ, విమానంలో అమ్మాయిని

వాళ్ళు ఎక్కడికేనా తీసుకుపోయేరేమో?"

"అది కూడా దర్యాప్తు చేశాను. సీత వాళ్ళతో ఏడుస్తూ వెళ్తుంది. నవ్వుతూ వెళ్ళదు. అవకాశం దొరికితే అరుస్తుంది. ఇతరు అది గమనిస్తారు. అటువంటిదేమీ జరగలేదు. ఢిల్లీ, బొంబాయి ఫ్లయిట్స్‌లో వెళ్ళిన వాళ్ళలో ఏడుస్తూన్న యువతిలేదు. ఆన్ కాన్‌షస్ స్టేట్‌లో ఏ యువతీ వెళ్ళలేదు. ఏ యువతి ఒంటినిండా నగలులేవు!"

"నగలను వాళ్ళు తీసేసి వుంటారు, సార్!"

"యూ ఆర్ రైట్! ఆమెను విమానంలో తీసుకుపోయారనే నమ్మకం సృష్టించడానికి కారును అక్కడ వదిలేశారని నేను భావిస్తున్నాను. నీ కూతుర్ని వాళ్ళు పట్నంలో ఎక్కడో దాచివుంటారు. ప్రస్తుతం పోలీసులు ప్రతిచోటా అమ్మాయికోసం వెతుకుతున్నారు. కొంత కాలం పోయినదాకా వాళ్ళామెను యిక్కడనుంచి కదల్చరు!"

"వాలిగారూ, ఎంతకాలం నేనిలా బాధపడాలి? ఎంతేనా ఖర్చుపెట్టండి! నా బిడ్డ నాకు వెంటనే దక్కేటట్లు చూడండి!"

"సుబ్బారావు భాయ్, డబ్బు ఎంత విలువైనది అయినా దానితో మనం అంతా సాధించలేం. నీకు ఫోన్ కాల్ వచ్చిందా?"

"లేదు, సార్."

"అయితే యిది డబ్బు కోసం జరిగి వుండదు!"

"దేనికి జరిగి వుంటుంది?"

"అదంతా చెప్పి నిన్ను నొప్పించడం నాకిష్టంలేదు. డబ్బు కోసం చేసుంటే యీ పాటికి వాళ్ళు నీకు ఫోన్

చేసి వుండేవారు."

"అందుకే నేనూ గాభరాపడుతున్నాను, సార్."

"నీ కూతుర్ని వాళ్ళు పట్నందాటి తీసుకుపోలేదు. బస్టేండు దగ్గర, రైలు స్టేషన్‌లలో, ఏర్ పోర్టులో, పోర్టులో పోలీసులు తిరుగుతున్నారు. ప్రతి ప్రయివేట్ కారునూ ట్రంక్‌రోడ్లమీద ఆపి సోదా చేస్తున్నారు" అన్నాడు వాలి.

"వాలిగారూ, ఆమెకు ప్రమాదం రాకుండా చూడండి. నా పిల్ల యింటికొచ్చేటట్లు చేయండి" అన్నాడు సుబ్బారావు ఏడుపు కంఠంతో.

రిసీవర్ పెట్టేసి కన్నీళ్ళతో సుబ్బారావు సోఫాలో కూర్చున్నాడు. అతడి భార్య చెయ్యిపట్టుకుంది.

"మీరు విచారంతో, బాధతో కృంగిపోతున్నారు. తిండి తినడంలేదు. అమ్మాయి తిరిగొచ్చేసరికి నేనూ మీరూ వుంటామో లేదో!" అందామె.

"పోతేపోనీ! ఈ లోకంలో దేనికీ విలువలేదు! బంగారంలాటి నా పిల్ల దూరమైనాక దేనిమీదా నాకు యింట్రెస్టులేదు. నా దగ్గరున్న డబ్బంతా గుట్టగావేసి కాల్చేయాలనిపిస్తోంది" అన్నాడతను నిరాశతో.

"ఒకసారి వెనక్కి తిరిగి చూడండి! అమ్మాయి జీవన్ని ప్రేమించి పెళ్ళాడ్డానంటే మీరు అడ్డుపడ్డారు. అతడిని ఎక్కడికో పంపించేశారు. వాళ్ళ పెళ్ళికి మీరు ఒప్పుకుని వుంటే వాళ్ళు సుఖంగా వుండేవారు. ధనవంతులు డబ్బుకోసం ఆశించకుండా పెళ్ళిళ్ళుచేయడం మంచిదిగా!"

"అదంతా యిప్పుడెందుకులే! ఈనాడు అమ్మాయి నాకూ, జీవన్‌కీ కూడా దూరమైంది. అది తిరిగి వస్తే

జీవన్ గురించి మనం ఆలోచిద్దాం!"

"అది తిరిగొస్తే జీవన్‌కిచ్చి పెళ్ళిచేస్తారా?" అడిగిందామె ఆత్రంగా.

"ఇటుపైన దాని ప్రేమ విషయాలలో నేను కలగజేసుకోను. దాని జీవితం దానిది. తన యిష్టమొచ్చినట్లు అది పెళ్ళి చేసుకోవచ్చు!"

"ఈ వార్త తెలిస్తే అది వస్తుందేమో!"

"శారదా, నీకు బుర్రలేదు. ఇంటికి తిరిగిరావడానికి అమ్మాయి మన్ని వదిలి పారిపోలేదు. డ్రయివర్ రాజును కొట్టి నలుగురు గూండాలు దాన్ని ఎత్తుకుపోయారు. తిరిగిరావడం దానిచేతిలో లేదు!" అన్నాడతను.

టెలిఫోన్ మ్రోగింది. అతడు టైమ్ చూశాడు. ఎనిమిది కావస్తోంది. హాల్లోని లైట్లు వెల్గుతున్నాయి. మెల్లిగా లేచి అతడు రిసీవర్ని అందుకున్నారు.

"సుబ్బారావుగారూ, పోలీస్ కమీషనర్ ఆనంద్‌ని. ఆ కారు స్టీరింగ్ వీలుమీద వేలిముద్రలు లేకుండా వాళ్ళు తుడిచేశారు. ఆ గూండాల అంతు చిక్కడం లేదు. ఒక విషయం మాత్రం ఖాయం. మీ అమ్మాయి పట్నంలోనే వుంది. ఆమెను బయటకు తీసుకువెళ్ళడం అసాధ్యం!"

"మిష్టర్ ఆనంద్, సీత గురించి ఆచూకీ తెలిపినవారికి లక్ష రూపాయిలు బహుమతిగా యిస్తాను. ఈ వార్త మీరు అన్ని పత్రికలకూ పంపండి."

"వెంటనే ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి అందరికీ యీ విషయం తెలుపుతాను."

"మరో విషయం. ఎత్తుకుపోయిన వాళ్ళు ఆమెను అమ్మడానికి ప్రయత్నించవచ్చు. ఆమెను తండ్రికే

అమ్మమని వాళ్ళను హెచ్చరించండి. సీతను అమ్మితే వచ్చే డబ్బుకు రెండింతలు నేనిస్తానని వాళ్ళను హెచ్చరించండి!"

"అలా చేయిస్తాను, సార్" అన్నాడు పోలీస్ కమీషనర్ ఆనంద్.

# 8

సుబ్బారావు నీరసంగా సోఫాలో పడుకుని వున్నాడు. డ్రయివర్ రాజు హాల్లోకొచ్చాడు.

"మీ కోసం ఆయన వచ్చారు సార్!"

ఎవరని సుబ్బారావు అడగలేదు.

"రమ్మను" అన్నాడు యాంత్రికంగా.

కాస్సేపట్లో జీవన్ లోపలకు వచ్చాడు. అతడి కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. అతడిని చూసి సుబ్బారావు ఆశ్చర్యపోయాడు.

"నువ్వు అమృతసర్ కు వెళ్ళలేదూ?"

"లేదు, సార్. వెళ్దాం అనుకుంటూండగా సీత మాయమైందని విన్నాను. రైలు టికెట్లు ఆఫీసుకు వాపసుచేసి, జాబ్ రిజైన్ చేశాను. అప్పటినుంచీ సీత కోసం అన్వేషిస్తున్నాను" అన్నాడు జీవన్.

సుబ్బారావు అతడి చెయ్యి పట్టుకున్నాడు.

"సీత కోసం అంతా వదిలేశావు!"

"ఆమె కోసం నా ప్రాణాలు యిస్తాను, సార్. ఆమె తిరిగి రాకపోతే నేను బ్రతికుండను. పోతే ఆమెతో పోతాను! వుంటే ఆమెతో వుంటాను!"

సుబ్బారావు ఆ మాటలు విని వెక్కి వెక్కి ఏడ్చాడు. తన జేబులోంచి ఒక కవర్ను తీసి అతడు సుబ్బారావు కిచ్చాడు.

"ఏమిటిది?"

"మీరిచ్చిన 25 వేలు మీకిచ్చేస్తున్నాను."

సుబ్బారావు ఆ కవర్ను దూరంగా విసిరాడు.

"జీవన్, నేననుకున్నంత విలువ డబ్బుకు లేదని అమ్మాయి మాయమైనాక గ్రహించాను. ఇరవై ఐదు వేలతో నిన్ను కొనాలని చూశాను. కాని నువ్వు అమ్ముడు పోయే వ్యక్తివి కాదని యిప్పుడు గ్రహిస్తున్నాను."

టెలిఫోన్ మ్రోగింది. సుబ్బారావుకు రిసీవర్ని అందించాడు.

"హలో, సుబ్బారావు!"

"మిస్టర్ సుబ్బారావు, మీ అమ్మాయి క్షేమంగా వుంది. ఏం చెయ్యాలో ఆమె చెప్తుంది, మాట్లాడండి" అందో కంఠం అటువైపునుంచి.

కాస్సేపట్లో సీత కంఠం అటువైపు నుంచి వినబడింది.

"నాన్నగారూ!" అందామె.

"అమ్మా! కన్నతల్లీ! ఎలా వున్నావు?" అడిగాడు సుబ్బారావు ఏడుస్తూ.

"నాన్నా, వీళ్ళు నన్ను ఆరేబియాకు తీసుకువెళ్ళాలిట! మీరు పోలీస్ రిపోర్టు యివ్వడం వలన వాళ్ళు నన్ను తీసుకు వెళ్ళలేకపోతున్నారు. పోలీసులు నా కోసం వెతకకుండా చూడండి. అప్పుడు నేను ఆరేబియాకు పోతాను. నన్ను కొన్న ఆ షేక్తో జీవితం సాగిస్తాను."

"సీతా, వాళ్ళతో చెప్పు! ఆ షేక్ ఎంతిస్తే దానికి రెండు రెట్లు నేనిస్తానని చెప్పు!"

"నాన్నగారూ, వెనక్కు తిరిగి రావాలనే కోర్కె నాకు లేదు. జీవన్ నాకు దూరమైపోయాక నేను ఎక్కడకు పోయినా బాధలేదు."

"సీతా, నువ్వు జీవన్నే పెళ్ళాడు. అతను యిక్కడే వున్నాడు!"

"నమ్మలేను!"

"అతను మాట్లాడతాడు."

సుబ్బారావు రిసీవర్ని జీవన్ కి యిచ్చాడు.

"సీతా, జీవన్ నేనే!"

"నమ్ముతున్నాను. నాన్నను మాట్లాడమను."

సుబ్బారావుకు రిసీవర్ ఇయ్యబడింది.

"నాన్నగారూ, వాళ్ళకు ఐదు లక్షలు కావాలిట."

"వెంటనే యిస్తాను."

"వుండండి కాస్సేపు" అందామె.

ఓ నిమిషం తర్వాత ఆమె కంఠం వినపడింది.

"IOB బాంక్ విల్లివాకం బ్రాంచిలో A/C3416లో మీరు ఐదు లక్షలు జమకట్టాలి. ఆ యకౌంట్ సి. పరశురామ్ పేరున వుంది."

"రేపు పొద్దుటే డబ్బు కట్టిస్తాను."

"నాన్నగారూ, మీమీద వీళ్ళకు నమ్మకంలేదు. ఆ డబ్బు మీరు జీవన్ కి యివ్వండి. బాంకికి వెళ్ళి అతడిని జమ కట్టమనండి."

"అలాగే చేస్తాను" అన్నాడు సుబ్బారావు.

"నాన్నగారూ, మీరు అలాచేస్తే డబ్బు కట్టిన పది గంటల్లో నేను మన యింట్లో వుంటాను."

"ఆ క్షణం కోసం నేను ఎదురు చూస్తున్నాను" అన్నాడు సుబ్బారావు.

## 9

బ్యాంకి ఎనిమిదిన్నరకు తెరవబడుతుంది. ఎనిమిదింటికే సుబ్బారావు జీవన్ కి ఒక బాగ్ లో పెట్టి ఐదు లక్షలు

యిచ్చాడు.

"డ్రయివర్ రాజుతో ఫియట్ కారులో వెళ్ళు! ఆ డబ్బు సి. పరశురామ్ A/C నంబరు 3416లో చెల్లించిరా! అమ్మాయి క్షేమంగా యింటికొస్తుందని మనం ఆశిద్దాం" అన్నాడు సుబ్బారావు.

"అలాగే, సార్" అన్నాడు జీవన్.

సరిగ్గా 8-25కి జీవన్ కారులో వెళ్ళాడు. పదిగంటలు లోపల ఆమె వస్తుంది! సాయంత్రం ఆరు గంటల లోపల సీత యింటికి రావాలి!

బాంకికి వెళ్ళిన జీవన్ అరగంటలో తిరిగివచ్చాడు. అందరూ హాల్లో నిశ్శబ్దంగా కూర్చున్నారు. గంటలు, నిమిషాలు సెకండ్లు లెక్కపెడుతున్నారు.

నిమిషాలు గడుస్తున్నాయి. గంటలు మెల్లిగా కదులున్నాయి, సుబ్బారావు, శారద, జీవన్ కాఫీ కూడా తాగలేదు. అలాగే కూర్చున్నారు.

"నా బిడ్డ యింటికొచ్చాక ఆనందంగా తిందాం" అన్నాడు సుబ్బారావు.

సాయంత్రం నాలుగ్గంటలయింది. XYZ కారు కాంపౌండులో ఆగింది. డిటెక్టివ్ వాలి, గిరి నవ్వుతూ హాల్లో ప్రవేశించారు.

సుబ్బారావు వినయంగా వాళ్ళను కూర్చోమన్నాడు.

వాలి సుబ్బారావు వైపు నవ్వుతూ చూశాడు.

"వాళ్ళు ఫోన్ చేశారా?" అడిగాడు వాలి.

"చేశారు, సార్. ఐదు లక్షలు యిమ్మన్నారు. ఇచ్చాను. నా కూతురి రాకకోసం ఎదురు చూస్తున్నాను. ఆరు లోపల ఆమె రావాలి!"

"ఆమె వస్తుందని ప్రార్థించుదాం" అన్నాడు వాలి.

ఆరు గంటలయింది. హాల్లో ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

"ఇంకా రాలేదు!" అన్నాడు సుబ్బారావు.

ఇంటిముందు ఏదో కారు ఆగిన చప్పుడైంది. అందరూ బయటకు పరుగెత్తారు. టాక్సీ లోంచి సీత కిందకు దిగింది. కంజీవరం పట్టుచీరలో వుందామె! ఒంటినిండా నగలున్నాయి!

సుబ్బారావు ఆమెను ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

"తల్లీ, తిరిగొచ్చావా?" అన్నాడతను.

ఆమె తండ్రివైపు నవ్వుతూ చూసింది.

"నాన్నగారూ, జీవన్ బతికుండగా నేను మీకూ, అతడికీ దూరంగా వుండగలనా?" అందామె.

"అమ్మా, నువ్వు జీవన్ని పెళ్ళాడు. నేను అంగీకరిస్తాను" అన్నాడు సుబ్బారావు.

ఆమె తండ్రిని కౌగలించుకుంది.

"నాన్నగారూ, నామీద మీకెంత ప్రేముందో నాకు తెలుసు. నా ప్రేమకోసం ఎంతో జరిగింది. అదంతా వాలిగారు చెప్తారు" అంది సీత.

* * *

డిటెక్టివ్ వాలి చుట్ట పొగ వదుల్తూ హాల్లో వున్న వాళ్ళవైపు చూశాడు.

"సుబ్బారావు భాయ్, సీత నీకు తగిన కూతురు. నీలాగే ఆమె తెలివైనది. ప్రేమకోసం ఆమె పెద్ద నాటకం ఆడింది. డ్రయివర్ రాజును కొట్టి ఆమెను

ఎత్తుకుపోయిన వాళ్ళు జీవన్ స్నేహితులు" అన్నాడు వాలి.

అందరూ అతడివైపు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"సుబ్బారావు భాయ్, సి. పరశురామ్ అనే వ్యక్తికి IOB లో A/C లేదు. జీవన్ ఆ పేరులో అకౌంట్ ఓపెన్ చేసి ఐదు లక్షలు అందులో జమకట్టాడు. నీ డబ్బు కాస్తకూడా పోలేదు. కాని వాళ్ళు ప్రదర్శించిన యీ నాటకం మూలంగా వాళ్ళ ప్రేమ ఫలించింది" అన్నాడు వాలి.

"ఇదంతా మీకు ముందుగా తెలుసా?" అడిగాడు సుబ్బారావు.

"జీవన్, సీత నా దగ్గరకొచ్చి అంతా చెప్పారు. ఇలా నాటకం ఆడ్తామన్నారు. ఆడమన్నాను. సుబ్బారావు భాయ్, నీ పిల్ల ఆనందంగా వుండాలని నువ్వు ఆశిస్తున్నావుగా? వాళ్ళిద్దరికీ వైభవంగా పెళ్ళిచేసి దీవించు! వాళ్ళిద్దరూ చాలా ఆనందంగా జీవిస్తారు" అన్నాడు వాలి.

"అలాగే చేస్తాను, సార్" అన్నాడు సుబ్బారావు.

—:ఐ పో యిం ది:—

సీరియల్

# రక్తం త్రాగే పిశాచం

వసుంధర




(గత సంచిక తరువాయి)

"ఏం?" అన్నాడు శివశంకరం.

"నేను తయారుచేసిన మందుకీ, సదానందుడు పుస్తకంలో రాసిన మందుకూ వాస్తవంలో ఎన్నో పోలిక

లున్నమాట నిజం. అది శవాన్ని బ్రతికించటంవరకూ నేను పుస్తకాన్ని నమ్ముతాను. కానీ దుష్టశక్తి గురించి రాసిన దంతా అభూత కల్పన అని నా అనుమానం. అలాంటిది సైన్సు ఒప్పుకోదు—" అన్నాడు మహాదేవుడు.

"పుస్తకంలో విషయంమీద నాకు నూటికి నూరు పాళ్ళూ నమ్మకముంది తమ్ముడూ—ఆ అమ్మాయి శవం దుష్టశక్తిగా మారివుండకపోతే — మంచంమీంచి మాయమై మీకు దూరంగా ఎలా వెళ్ళగలిగిందంటావ్?" అన్నాడు శివశంకరం గంభీరంగా.

మహాదేవుడి కళ్ళు మెరిశాయి—"అన్నయ్యా! ఆ శవం కాస్త దూరంగా నడిచి తర్వాత చచ్చిపోయుంటుందని నా నమ్మకం. అది నిజంగా దుష్టశక్తిగా మారివుంటే ఇంతకాలం నిశ్శబ్దంగా వుండదు గదా—ఒక్క నిముషంలో విషయం తేల్చేద్దాం. నా ఫ్రెండ్ నరోత్తమరా వున్నాడు. అతను నగర సంచారం చేసే నారదుడు కాక పోయినా—ఊళ్ళో ఎక్కడెక్కడి నీలివార్తలూ అతణ్ని చేరుకుంటాయి. చాలా పత్రికలకు అతడు కథల్లాంటి వార్తలనందిస్తూంటాడు. అతడందించే ప్రతి వార్తకూ ఎంతో కొంత ఆధారం వుంటుంది—అతడికి ఫోన్ చేశానంటే దుష్టశక్తి ఈ నగరంలో వున్నదీ లేనిదీ తేలిపోతుంది—" అంటూ అక్కణ్నించి లేచి వెళ్ళాడు.

మహాదేవుడి అదృష్టం బాగుంది. ఫోన్ చెయ్యగానే అవతల రిసీవర్ నరోత్తమరావే ఎత్తాడు.

పలకరింపులవగానే-"నరోత్తమ్! ఒక ముఖ్య విషయం. గత వారం రోజుల్లో ఊళ్ళో చెప్పుకోదగ్గ వింత వార్తలేమైనా ఉన్నాయా? ముఖ్యంగా అపూర్వ శక్తులకు సంబంధించినవి-అది నా పరిశోధనకు ఎంతో అవసరం-"

అన్నాడు.

నరో త్తమ్ కంఠం ఉత్సాహంగా ధ్వనించింది—"ఈ వారం రోజుల్లోనూ బ్రహ్మాండమైన వార్తలు సంపాదించాను. అయితే అవి నేరుగా పత్రికలకు పంపలేదు. కొన్ని సంఘటనలకు ఏదో మూలకారణం వుంటుందని పించింది. అన్నీ కలిపి పెద్ద వ్యాసం తయారుచేద్దామని ఆశ—వింటావా?" అన్నాడు.

"వినడానికే గదా—ఫోన్ చేసి అడిగింది-" అన్నాడు మహాదేవుడు.

"ఒకమ్మాయి రంగారావు అండ్ సన్స్—బట్టల దుకాణంలో ప్రవేశించి బట్టలు కొని—మేనేజర్ సత్యారావుని సాచి లెంపకాయ కొడితే అతడు కళ్ళు తిరిగి పడిపోయాడు. మర్నాడా అమ్మాయి మళ్ళీ షాపుకి వచ్చి "నీ రకం తాగుతాను మూడువేలిచ్చి పంపు—" అని ఓ చీటీ రాసి సేఠ్ రతన్‌లాల్ ఇంటికి పంపిస్తే—అక్కణ్ణించి డబ్బు వచ్చింది. ఆ చీటీ చదువుకుని రతన్‌లాల్ చంకలు గుద్దుకున్నాట్ట కూడా. ఇది న్యూస్ నెంబర్ వన్. న్యూస్ నెంబర్ టూ ఏమిటంటే — ఒక అమ్మాయి ప్రమీలా టెయిలరింగు షాపులో కిటికీ ఊచను అవలీలగా పెరికి — దాన్ని దారంలా పడేసిందట. అదే ఫీటు మర్నాడు కూడా చేసిందట. న్యూస్ నంబర్ త్రీ — రాగిణి అనే అమ్మాయి తనపై అత్యాచారం చేయబోయిన జగ్గూ అనే రౌడీని చావ చితకదన్నింది. ఆ జగ్గూ ఇప్పుడు హాస్పిటల్లో చావు బతుకులమధ్య ఉన్నాడు. ఈ సంఘటనను కొన్ని వందల మంది కళ్ళారా చూశారు. విచిత్రమేమిటంటే రాగిణి చాలా సామాన్యమైన ఆడపిల్ల. ఎంతో సుకుమారి.

కరాటేవంటి విద్యలేమీ ఆమెకు రావు. ఆ రోజున తనను ఎవరో చెవిలో చెబుతూ జగ్గూ దగ్గరకు తీసుకు పోయారనీ—తన మనసు తన అధీనంలో లేదనీ ఆమె చెప్పింది.

ఈ న్యూస్ సెంబర్ త్రీ మాత్రం అప్పుడే పేపర్ల వాళ్ళకి వెళ్ళిపోయింది. ఈవినింగ్ ఎడిషన్లో రావచ్చు. ఇది నిన్న సాయంత్రం ఆరింటికి జరిగింది. నేను ఈ మూడు వార్తల్నీ క్రోడీకరించి కథ తయారుచేయాలనుకుంటున్నాను. రాగిణి బట్టల షాపులో అమ్మాయి, టెయిలరింగ్ షాపులో అమ్మాయి—ముగ్గురూ ఒక్కరేనా అన్న విషయం నేను తేల్చాలి. అది తేలితే పరిశోధన ఒకడుగు ముందుకు వేస్తుంది—" అన్నాడు నరోత్తమ రావు.

"నాకు రాగిణి అడ్రస్ కావాలి—" అన్నాడు మహాదేవుడు. నరోత్తమరావు చెబుతూంటే అతను అడ్రస్ నోట్ చేసుకుని థాంక్స్ చెప్పి ఫోన్ పెట్టేసి అన్న, అసిస్టెంట్ల దగ్గరకు వెళ్ళి—"మేము బ్రతికించిన శవం పేరు రాగిణి అనుకొంటూను. ఒకసారి ఆమెను కలుసుకొంటే పని జరుగుతుంది. ఆమె దుష్ట శక్తిగా మారిందో లేదో తెలియదు కానీ — కొన్ని అపూర్వ శక్తులను కలిగి వుందన్నమాట నిజం — " అంటూ అన్నయ్యకు నరోత్తమరావు చెప్పిందంతా వివరించాడు.

"సందేహంలేదు—దుష్ట శక్తి ఉనికి తెలిసినట్లే—" అన్నాడు శివశంకరం.

"మనం ముగ్గురం కలిసి వెడదామా—? ఆ అమ్మాయి ముఖం నాకు అచ్చు గుద్దినట్లుగా గుర్తున్నది—" అన్నాడు లింగం.

"వెడదాం—అంతా కలిసే వెడదాం—" అన్నాడు శివశంకరం.

## 26

ఆ దారిన పోతూ పోతూ ఆ యింటిముందు ఆగాడు బైరాగి.

బైరాగి ముఖం దివ్య తేజస్సుతో వెలిగిపోతోంది. నిలువునా కాషాయాంబరాలు ధరించాడు. మెడలో రుద్రాక్షమాల ఉంది. భుజానికి వ్రేలాడుతున్న జోలె లోంచి దండం కనబడుతున్నది.

"ఇంట్లో ఎవరున్నారు?" అంటూ అరిచాడు బైరాగి.

ఒక నడివయస్కురాలు ఆ కేకకు అదిరిపడి లోపల్నుంచి పరుగున వచ్చి బైరాగిని చూసి "నువ్వా? ఇంకా ఎవరోననుకున్నాను. ముష్టికోసం అంతలా కేకలు పెట్టాలా?" అని విసుక్కుంది.

"నేను ముష్టికోసం రాలేదు. ప్రమాదం నుంచి నిన్ను హెచ్చరిద్దామని వచ్చాను—" అన్నాడు బైరాగి.

"నాకేం ప్రమాదం?" అందా స్త్రీ ఆశ్చర్యంగా.

"ప్రమాదం నీకు కాదు. ఈ యింట్లో నువ్వుకాక ఇంకెవరున్నారు?" అన్నాడు బైరాగి.

"నా కొడుకున్నాడు—" అందా స్త్రీ.

"అయితే ప్రమాదం వాడికే!"

"వాడేం చేశాడు?"

"వాడేమీ చేయలేడు. వాడొక పిశాచం అధీనంలో ఉన్నాడు—" అంటూ బైరాగి ఇంట్లో అడుగుపెట్టబోయాడు. ఆ స్త్రీ కంగారుగా గుమ్మానికి అడ్డంగా నిలబడి—"ఆగు—ఏదో వంకతో నా యింట్లో జొరబడాలని చూడకు—" అంటూ అరిచింది.

"నన్నాపితే ఆనక నువ్వే విచారిస్తావు. ఉపేక్షిస్తే నీ కొడుకు నీకు దక్కడు. నువ్వే చెప్పు. ఇటీవల కొన్నాళ్ళుగా నీ కొడుకు ప్రవర్తన విచిత్రంగా ఉండడం లేదూ?" అన్నాడు బైరాగి.

ఈ ప్రశ్న ఆ స్త్రీపై బాగా పనిచేసింది. "అవును-కానీ...."

"కానీ ఏమిటి—ఒక పిశాచం వాడి రక్తం తాగింది. సందేహం లేదు. ఈ వీధిలో కొంతకాలం ఒక పిశాచం సంచరించింది. నా మాట విను. నేను నీ కొడుక్కు తాయెత్తు కడతాను. వాడు మళ్ళీ మామూలు మనిషవుతాడు .."

ఆ స్త్రీ ఆశ్చర్యంగా — "నా కొడుకు పిశాచం పాలబడ్డాడని ఎందుకంటున్నావ్?" అంది.

"నా అంగీలో పవిత్రమైన కుంకుమ వుంది. నీ యింటి ముందుకు రాగానే ఆ కుంకుమ భరిణ చలించింది. అందుకే నిన్ను చూడగానే నిన్ను పిశాచం పీడించడం లేదని తెలిసిపోయింది. అప్పుడు ఇంకెవరైనా అయుండాలని ఊహించాను. నా మాట విను. ఒక్క తాయెత్తు నీ కొడుక్కు నా చేతులతో కట్టనీ—" అన్నాడు బైరాగి.

ఏమనుకుందో ఆ స్త్రీ ఒప్పుకుంది. అప్పటికింకా ఆమె కొడుకు నిద్రలేవలేదు.

"వాణ్ణి లేపకు—వాడు నిద్రలో ఉండడమే నాకు మంచిది—" అన్నాడు బైరాగి.

బైరాగి హాల్లో కూర్చుని తన వద్దనున్న కుంకుమను పొట్లం కట్టి — ఆ స్త్రీ ఇచ్చిన దారంలో దాన్ని తాయెత్తులా కట్టి—మనసులోనే ఏదో మంత్రోచ్చారణ

చేసి—"చూడు—ఎవరికైనా పిశాచం పీడిస్తూందో—వాళ్ళు పది గజాల దూరంలోనే ఉన్నట్లయితే—ఈ తాయెత్తును వదిలిపెడితే దానంతటదే వెళ్ళి వాళ్ళను చేరుతుంది—" అంటూ బైరాగి ఆ తాయెత్తును నేలమీద వదిలిపెట్టాడు.

ఆ స్త్రీ చూస్తూండగా ఆ తాయెత్తు దానంతటదే కదిలి పక్క గదిలోని మంచంమీద పడుకుని వున్న యువకుడి చేతికి తనంతట తనే బిగుసుకుపోయింది. ఆమెకు ఆశ్చర్యంతో నోటమాట రాలేదు.

తాయెత్తు చేతికి బిగుసుకోగానే ఆ యువకుడు చటుక్కున లేచి కూర్చుని — "అమ్మా!" అంటూ అరిచాడు.

"బాబూ—మధూ!" అంటూ ఆ స్త్రీ గదిలోపలకు పరుగెత్తింది.

మధు వళ్ళు విరుచుకొని—"ఏమిటోనమ్మా—ఇప్పుడు నాకెంతో సుఖంగా అనిపిస్తోంది. వంటికి పట్టిన చీడ వదిలిపోయినట్లు, మనసును పీడించే బాధ తొలగిపోయినట్లు అనిపిస్తోంది. చెప్పలేని ఆనందం నాకు కలుగుతోంది. ఎందుకో నాకెంతో సంతోషంగా ఉంది. ఏమైందమ్మా నాకు—" అన్నాడు.

మధు తల్లి అతడి వంకే ఆశ్చర్యంగా చూస్తోంది. ఇదంతా తాయెత్తు మహాత్మ్యమా? అంటే ఇంతకాలం తన కొడుకును పిశాచం పట్టి పీడిస్తూంటే తను తెలుసుకోలేకపోయిందా? ఇంతకీ ఆ పిశాచం ఎక్కణ్నించి వచ్చింది?

తన చేతిలోని ఫోటోలో కేవలం మగవాళ్ళ బొమ్మలే కాలిపోవడం గుర్తుకొచ్చిందావిడకు. అప్పటి

వకుళ చూపులు గుర్తొచ్చాయి. ఆపైన ఆమె నవ్వు.

వకుళ పిశాచమా?

జోగారావు ఇంట్లో ఓ గదిలో వకుళ ఓ గాజు తొట్టెలో నగ్నంగా స్నానంచేసే భయంకర దృశ్యం...

వకుళ పిశాచమా?....

"ఇంక నీ కొడుక్కేం భయం లేదు. తాయెత్తు జాగ్రత్త...." అన్నాడు బైరాగి.

"అలాగే స్వామీ—" అంటూ అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కరించింది మధు తల్లి.

"ఈయనెవరమ్మా?" అన్నాడు మధు.

మధు తల్లి మధుకి బైరాగి గురించి చెప్పింది.

"నన్ను పిశాచం పట్టిందా?" ఆశ్చర్యంగా అడిగాడు మధు.

"గత వారం రోజుల్లో నీ దినచర్య నీకు గుర్తుందా?" అనడిగాడు బైరాగి నవ్వుతూ.

"అసలేమీ గుర్తుకురావడంలేదు—" అన్నాడు మధు.

"అంటే పిశాచం నీ రక్తం తాగిందన్నమాట. అలాంటివారికి జ్ఞాపకాల్లోంచి కూడా ఆ పిశాచపు చర్యలు తొలగిపోయేలా చేస్తుంది తాయెత్తు. పిశాచాన్ని చూసి జడుసుకున్నవారికైతే—ఈ తాయెత్తు కట్టుకుంటే ఆ భయం పోతుంది—" అన్నాడు బైరాగి.

"స్వామీ—ఈ వీధిలోని చాలామందిపై ఆ పిశాచం ప్రభావం పడివుంటుంది. మీరు నాకు మరిన్ని తాయెత్తులు అనుగ్రహించండి—అందరికీ సాయపడతాను—" అంది మధు తల్లి.

"ఎవరమ్మా ఆ పిశాచం?" అన్నాడు మధు.

"ఇంకెవరు? ఆ వకుళ ...."

"వకుళ పిశాచమా-భలేదానివమ్మా-" అని నవ్వాడు మధు.

"ఆ విషయమూ తేల్చుకుందాం—అదృష్టంకొద్దీ ఈ మహానుభావుడు మనను కరుణించాడు—" అంది మధు తల్లి.

"ఏదైనా డబ్బా ఉంటే తీసుకురా — అందులో కుంకం పోస్తాను. దానితో నువ్వే తాయెత్తులు కట్టొచ్చు—" అన్నాడు బైరాగి.

మధు తల్లి లోపల్నుంచి ఒక డబ్బా తీసుకొచ్చింది. బైరాగి తన జోలిలోంచి ఓ చిన్న కుంకం భరిణ తీసి డబ్బాలోకి వంచాడు. డబ్బా నిండేవరకూ అందులోంచి కుంకం పడుతూనే ఉన్నది. డబ్బా నిండాక బైరాగి భరిణను తిరిగి జోలిలో వేసుకొని—"ఈ డబ్బాకు మూత పెట్టి దేవుడి మందిరంలో వుంచు. అడిగినవాళ్ళకి లేదనకుండా ఇయ్యి. ప్రతిఫలం ఆశించకు. ఎవరి పరిస్థితైనా ప్రమాదంగా ఉంటే తాయెత్తు తయారుచేసి వదిలిపెట్టు. తాయెత్తు దానంతటదే వారికి బిగించుకుంటుంది. నీకై నువ్వు ఎవరి చేతులకూ తాయెత్తులు కట్టకు. నుదుట ఈ కుంకుమ ఉన్నవారికి పిశాచ భయం ఉండదు—మరి నేను వస్తాను—" అంటూ అక్కణ్ణించి పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళిపోయాడు.

మధు, మధు తల్లి కూడా ఆయన వెళ్ళిపోతూంటే ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు.

"మహానుభావుడు—" అంది మధు తల్లి అప్రయత్నంగా.

"అమ్మా—అది సరే — నువ్వేమిటీ వకుళ పిశాచం అంటున్నావు?" అన్నాడు మధు.

"ఈ వారం రోజులూ నువ్వు దానితోనే కదా తిరిగావు. నీకేమీ అలా అనిపించలేదా?" అంది తల్లి.

"వారం రోజులు నేను వకుళతో తిరిగానా? నమ్మలేను...." అన్నాడు మధు.

మధు తల్లి ఆశ్చర్యం ఇంకా పెరిగింది—"అయితే సందేహం లేదు. అది పిశాచమే. మనమిప్పుడు ముందు శారదమ్మ ఇంటికి పరుగెత్తాలి. అక్కడ అది వాళ్ళని ఎంత రొష్టు పెడుతోందో ఏమో—?" అందామె.

మధు, మధు తల్లి కలిసి శారద ఇంటికి వెళ్ళారు. ఇంటి తలుపులు తాళంవేసి లేవుగానీ ఇంట్లో ఎవ్వరూ లేరు.

"పిళ్ళంతా ఎక్కడికెళ్ళారంటావ్? వకుళ గది కూడా ఖాళీగా ఉంది. ఆ గదిలోని గాజు జాడీ లేదు" అంది మధు తల్లి. ఆవిడ వంక ఆశ్చర్యంగా చూసి— "నువ్వేదో భ్రమపడుతున్నావేమోనని నా అనుమానం-" అన్నాడు.

"నాది భ్రమ అని ఎందుకనుకుంటున్నావ్?" అంది తల్లి.

"పిశాచమేమిటి? మన మెరిగిన మనిషి రూపంలో మనుషుల మధ్య ఇంట్లో కాపురం పెట్టడమేమిటి?" అన్నాడు మధు.

"అందరూ అలాగనుకొంటారనే అది మనుషుల మధ్య దర్జాగా కాపురం పెట్టి అందర్నీ ఓ ఆట ఆడించింది. ఈ రోజుతో దాని ఆట కట్టు. అన్నీ తెలిసిపోయి పారిపోయిందో ఏమో!" అంది మధు తల్లి.

ఇద్దరూ అక్కణ్నించి ఎదురింటికి వెళ్ళారు.

"వాళ్ళ పిల్లలిద్దరూ జడుసుకొన్నారట. ధర్మాసు

పత్రిలో ఉన్నారుట. మీ మధ్యే వాళ్ళను ధర్మాసుపత్రిలో జేర్చాడుట కూడా — ఉదయమనగా వెళ్ళి పోయారు వాళ్ళు. ఇంతవరకూ వెనక్కి రాలేదు—" అంది కామేశ్వరమ్మ.

మధు, తల్లి ధర్మాసుపత్రికి వెళ్ళారు. కాసేపు వెతగ్గా స్పెషలు వార్డు దగ్గర ఓ గదిముందు కూర్చుని ఏడుస్తూన్న శారద కనబడింది. మధు తల్లి పరుగున వెళ్ళి—"ఏమమ్మా ఏమయింది?" అంది ఆత్రుతగా.

"నా పిల్లలిద్దరూ కొన ప్రాణంతో ఉన్నారు. వాళ్ళను ప్రాణం పోయడానికి డాక్టర్లు నానా ప్రయత్నాలూ చేస్తున్నారు. కానీ వాళ్ళు బ్రతికే అవకాశం తక్కువ. ఇదంతా ఆ వకుళ మూలంగా జరిగింది. అది మనిషి కాదు పిశాచం...." అంది శారద.

"అవునమ్మా — సరిగ్గా చెప్పావు. ఈ విషయం నాకూ ఇప్పుడే తెలిసింది. పిల్లలెక్కడున్నారో చెప్పు. మంత్రించిన కుంకం తెచ్చాను...." అంది మధు తల్లి ఆత్రుతగా.

"ఉండుండి ఎగిరిపడుతున్నారు. దెయ్యం.... దెయ్యం అని అరుస్తున్నారు. అక్కా నాలిక పొడుగ్గా చేయొద్దు. అక్కా....అలా చూడొద్దు....అక్కా....అలా నవ్వొద్దు నాకు భయమేస్తోందక్కా .... అంటూ పిచ్చిపిచ్చిగా అరుస్తున్నారు. రాత్రి ఇద్దరూ ఆ వకుళ గదిలో పడుకున్నారు. అది వాళ్ళనింతలా హడలగొట్టేస్తుందని నాకేం తెలుసు.... చేజేతులా వాళ్ళను మృత్యు మందిరంలోకి పంపాను. వాళ్ళ బాధ చూడలేక బయటకు వచ్చేశాను. ఆయన లోపల ఉన్నారు. ఏ జన్మలో ఏ

పాపం చేశానో — భగవంతుడు నాకిలా అన్యాయం చేస్తున్నాడు. డాక్టర్లు చేయలేనిది—కుంకం చేస్తుందా- మంత్రాలకు చింతకాయలు రాలతాయా—ఏదో నీ పిచ్చి అభిమానం.... అంతే! వెళ్ళు .... లోపలకు వెళ్ళు...."
అంది శారద విరక్తిగా.

మధు తల్లి లోపలకు వెళ్ళింది. మధు కూడా ఆమెను అనుసరించాడు.

శారద అలా ఏడుస్తూ కూర్చుని ఉంది. ఆమెకు ఎక్కిళ్ళు కూడా రాసాగాయి. ఉన్నట్లుండి ఆమె భుజం మీద ఎవరిదో చేయి పడింది. శారద ఆశ్చర్యానికి అంతులేదు.

రమ .. రమ వెనుక సూర్యం....

ఇద్దరి నుదుటనా రూపాయకాసంత కుంకుమబొట్లు.

"అమ్మా! ఏడుస్తున్నావా?" అన్నారు ఇద్దరూ ఏక కంఠంతో. శారద చటుక్కున ఇద్దర్నీ దగ్గరగా లాక్కుని "నా బాబూ, నా తల్లీ — నా బాబూ, నా తల్లీ ...." అంటూ పదేపదే వాళ్ళ ముఖాలమీద ముద్దులు కురిపించింది.

"అంతా ఆశ్చర్యంగా వుంది. వళ్ళెరక్కుండా పడి వున్న పిల్లలిద్దరూ కుంకంబొట్టు పెట్టగానే చటుక్కున లేచి కూర్చున్నారు —" అన్నాడు మధు.

"ఇది కలో, నిజమో నమ్మలేకుండా ఉన్నాను —" అన్నాడు జోగారావు.

డాక్టర్లు కూడా ఇలాంటి విచిత్రం తామెక్కడా చూడలేదన్నారు. హాస్పిటల్లో వున్న నరోత్తమరావు ఏజంటు అప్పుడే ఈ వార్త నరోత్తమరావు కందించ

డానికి టెలిఫోన్ దగ్గరకు వెళ్ళిపోయాడు.

మధు తల్లి తనకు జరిగిన అనుభవం చెప్పి—"ఆ మహానుభావుడి కారణంగా నా బిడ్డ నాకు దక్కాడు. లేకపోతే ఉన్న ఒక్కగా నొక్క కొడుకూ...." ఆ తర్వాత వాక్యం పూర్తిచేయలేక ఆగిపోయింది.

"ఆ మహానుభావుడే నా బిడ్డల్ని నాకు దక్కించాడు" అంది శారద.

"అయితే ఇంతకీ వకుళ పిశాచమయిందన్న మాట" అన్నాడు జోగారావు. ఎందుకో ఈ నిజం అతడికి బొత్తిగా నచ్చలేదు. తన రక్తం పంచుకుపుట్టిన వకుళ ఇప్పుడు రక్తం తాగే పిశాచిగా మారిందా? అదెలా సంభవం?

"అందుకు సందేహమా?" అంటూ శారద గత సాయంత్రం తనకు జరిగిన అనుభవాలు చెప్పింది.

రమ, సూర్యం—రాత్రి తాము పొందిన అనుభవాలు చెప్పారు.

మధు తల్లి తన అనుభవాలు చెప్పింది.

అక్కడ ఎందరో జనం మూగారు.

అంతా ఈ కథలు విచిత్రంగా వింటున్నారు. ఆశ్చర్య పోతున్నారు.

"నాకిప్పుడు తిరిగి ఇంటికి వెళ్ళాలంటే భయంగా వుంది—" అంది శారద.

"ఈ కుంకం నొసటన ఉంచుకుంటే ఎవరికీ ఏ భయాలూ ఉండవు. దీనితో వకుళ ఆటకట్టు—" అంది మధు తల్లి. ఆమె శారద నొసట వెంటనే కుంకంబొట్టు పెట్టింది. బొట్టు పెట్టగానే శారద భయం మటుమాయ

మయింది.

వకుళ పిశాచమై ఆ వీధిలో తిరిగిందన్న వార్త నగర మంతా ఒక్కసారిగా గుప్పుమంది.

## 27

మహాదేవుడు, లింగం, శివశంకరం గుమ్మందాకా వచ్చి ఆగిపోయారు.

తలుపులు రెండూ బార్లా తెరిచి ఉన్నాయి. ముందు గదిలో ఇద్దరు వనితలు కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

లింగం కాస్త లోపలగా వెళ్ళి—"నమస్కారమండీ! రాగిణిగారిల్లు ఇదేనాండీ?" అన్నాడు.

"రాగిణిగారిల్లా?" అంటూ ఆశ్చర్యపడిందో వనిత— "నాకు తెలిసినంతవరకూ ఇది శ్రీకాంత్ గారిల్లు. వారి మరదల్ని నేను. శ్రీకాంత్ గారి భార్య లక్ష్మి. ఇంకా లక్ష్మిగారిల్లన్నా కొంత న్యాయం. లక్ష్మి నా అక్క-"

"ఇంతకీ మీ పేరు—?"

"అఫ్‌కోర్స్—నా పేరు రాగిణి—"

"అబ్బా — ఆ మాట ముందే చెబితే ఎంతో బాగుండేది. ఇది శ్రీకాంత్ గారిల్లే కావచ్చు. కానీ నిన్న మీరు జగ్గూకిచ్చిన డోసు మీ బావగారి పేరును మూలకు నెట్టేసింది. మీతో ఓ ముఖ్యమైన పనుండి వచ్చాం—" అన్నాడు లింగం. అప్పటికి మహాదేవుడు, శివశంకరం లోపలకు వచ్చారు.

రాగిణి చటుక్కున లేచి నిలబడింది—"మీరు...." అందామె తడబడుతూ.

లింగం అందర్నీ పరిచయం చేశాడు. తన్ను పరిచయం చేసుకొన్నాడు.

"కూర్చోండి—" అంది రాగిణి.

"మనం మళ్ళీ కలుసుకొందాం రాగిణీ!" అంటూ రెండో వనిత లేచింది.

"వారెవరు? మీ అక్కగారా?" అన్నాడు లింగం.

"మా అక్కగారైతే ఇంట్లోంచి ఎందుకు వెళ్ళిపోతుంది? ఈమె కూడా నిన్నటి సాహసం గురించి విని నన్నభినందించడానికి వచ్చింది. పేరు జలజ—" అంది రాగిణి.

జలజ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

"అపూర్వ శక్తులపైన రీసెర్చి చేస్తున్నాం మేము. మీ అనుభవం గురించి పూర్తిగా తెలుసుకోదలిచాం—" అన్నాడు ప్రొఫెసర్ మహాదేవుడు విషయానికి వస్తూ.

"ఇప్పటికే చాలామందికి చెప్పాను. చర్విత చర్వణం ఎందుకని వివరాలన్నీ రాసి వుంచాను. మీరు చదువుకోండి—" అంటూ రాగిణి వాళ్ళకో కాగితం ఇచ్చింది.

"చాలా బాగా రాశారు—" అన్నాడు లింగం అభినందిస్తూ — "మీలో మంచి రచయిత్రి కాగల లక్షణాలున్నాయి—"

"ఉంటే ఉండొచ్చు. కానీ 'ఇది రచన కాదు. యథాతథంగా జరిగింది రాసేశాను—" అంది రాగిణి.

"మిమ్మల్ని మేము కొన్ని ప్రశ్నలడగాలి. మీ అక్కయ్యగారు కూడా ఇంట్లో వుంటే పిలుస్తారా? మీ గురించి మేము కొన్ని విశేషాలు తెలుసుకోవాలి!" అన్నాడు మహాదేవుడు.

రాగిణి లక్ష్మిని పిలిచింది. ఇద్దరూ కూర్చున్నారు.

"మీరు ఈ మధ్య ఎప్పుడైనా ధర్మాసుపత్రికి వెళ్ళారా?" అడిగాడు మహాదేవుడు.

"ధర్మాసుపత్రికా? ఎందుకు?" అంది రాగిణి ఆశ్చర్యంగా.

"మీకు గుర్తుండి ఉండకపోవచ్చు. పోనీ మీ అక్కగారికి గుర్తుంటే— ....?"

"మా యింట్లో ఎవ్వరూ గత పది దినాలుగా హాస్పిటలు గురించి ఆలోచించను కూడా లేదు—" అంది లక్ష్మి.

మహాదేవుడు ఒక్క క్షణం తటపటాయించి—"మీలో ఎవరికైనా డైరీ రాసే అలవాటుందా?" అడిగాడు.

"మా ఇద్దరికీ కూడా ఉంది—" అంది లక్ష్మి.

మహాదేవుడు తను వకుళకు ఇంజక్షన్ ఇచ్చిన తేదీ చెప్పి-"ఆ రోజు మీ దినచర్య ఏమిటో చెప్పగలరా?" అనడిగాడు.

ఇద్దరాడవాళ్ళూ లోపలకు వెళ్ళి చెరో డైరీతోనూ తిరిగివచ్చి-"ఆ రోజు రహస్యాలేవీ లేవు కావాలంటే ఆ పేజీలు మీరే చదవొచ్చు—" అంటూ మహాదేవుడి చేతిలో డైరీలు పెట్టారు. మహాదేవుడు నిర్మోహమాటంగా ఆ పేజీ చదివాడు. ఆశ్చర్యమేమిటంటే ఆడవాళ్ళిద్దరూ కూడా మగాళ్ళతో కలిసి ఆ రాత్రి రెండు గంటల దాకా పేకాడుతూనే వున్నారు.

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషా

## ఆమె ఎక్కడ?

అసలు ఇదంతా కథలా వ్రాసేవాడిని కాదు. కానీ ఈ పోలీసులు, డిటెక్టివ్‌లు తామే తెలివిగలవాళ్ళ మనుకుంటారు. ప్రతి నేరస్థుడూ నేరం చేసేటప్పుడు ఎక్కడో పొరపాటు చేస్తాడనీ, ఆ పొరపాటు ఆధారంగానే నేరస్థుడిని పట్టుకోవచ్చునని వాళ్ళ నమ్మకం.

కానీ ఈ పోలీసుల సామర్థ్యం మీద నాకు అంతగా నమ్మకం లేదు. ఈ ప్రపంచంలో రోజూ వేల సంఖ్యలో నేరాలు జరుగుతున్నా వాళ్ళు ఎంతమందిని పట్టుకుంటున్నారు? వాళ్ళ చేతకానితనంవలన చాలాసార్లు అమాయకుల్ని పట్టుకుని జైల్లో పడేస్తుంటారు.

అందాకా ఎందుకు? నేను సరోజ మెడ విరిచి చంపేసిన సంగతి వాళ్ళు ఈనాటిదాకా తెలుసుకోలేకపోయారు.

"నేను అమరప్రేమికుణ్ణి" అని చెప్పుకోలేను కానీ నిజానికి సరోజను చాలా సిన్సియర్‌గా ప్రేమించాను. కానీ ఆమె ఉత్త డబ్బుమనిషి. అందుకే నాలాంటి మధ్యతరగతివాడిని వదులుకుని, ఆ రమేష్‌ని పెళ్ళి చేసుకుంది. వాడు బంగారు పిచుక మరి.

సరోజకు రమేష్‌ని పరిచయం చేసింది నేనే. రమేష్ నా అంత అందగాడు, తెలివిగలవాడు కాకపోయినా, నా ఆస్థికంటే పదిరెట్లు ఆస్థిపాస్థులు వాడికి ఉన్నాయి.

నాకు చేసిన ద్రోహానికి సరోజను చంపిపారేస్తే? అవును. అదే మంచిపద్ధతి. దానివలన నా కసి తీరుతుంది. ఆలోచించాను.

ఒకరోజు ముఖ్య విషయం ఒకటి మాట్లాడాలని సరోజను ఇంటికి రప్పించాను.

కుర్చీలో కూర్చుని మాట్లుడుతోంది సరోజ. ఎదుటి నుంచి ఆమెను గొంతు పిసకడం చాలా కష్టం, చేతులతో ఎదుర్కొంటుంది. నేను గాయపడటం నాకు ఇష్టంలేదు. వెనుకగా వెళ్ళి పని పూర్తిచేయటం మంచిది. కుర్చీని ఆధారంగా చేసుకుని, మెడని వెనుకవైపుకు విరచడం తేలిక. అవును. అలాగే చేశాను.

మరుసటిరోజు ఉదయం మామూలు సమయానికే ఫారంలోకి వెళ్ళాను. నా పనులు పూర్తి చేసుకున్నాను.

వారం రోజులు గడిచాయి. ప్రొద్దున్నే సబ్-ఇన్‌స్పెక్టర్ యం. యం. రాజన్ వచ్చాడు. కేరళ క్రిష్టియన్. ఈ ప్రాంతంలోనే సెటిలయ్యాడు. మనిషి చాలా పొడగరి. దృఢమైన శరీరం. ఈమధ్యనే సబ్-ఇన్‌స్పెక్టర్ అయ్యాడు. సివిల్ సర్వీసెస్ ఎగ్జామ్స్‌లో ప్రిలిమినరీ పాస్ అయ్యాడని విన్నాను. అసాధారణమైన తెలివితేటలు వున్నాయి.

అతన్ని ప్రతిశనివారం "హోటల్ కల్పన"లో చూస్తూ వుంటాను. మా యిద్దరికీ మొదటిసారిగా పరిచయం అక్కడే జరిగింది.

అతనికి డ్యూటీ విషయంలో స్నేహాలు అడ్డురావని నాకు తెలుసు. అందుకే అతనితో జాగ్రత్తగా వ్యవహరించదల్చుకున్నాను.

రాజన్ సంభాషణ మొదలు పెట్టాడు.

"మీకు సరోజ అనే అమ్మాయి తెలుసనుకుంటాను.

ఆమెను మీరీమధ్య చూశారా?"

ఆమె తప్పిపోయిన సంగతి పోలీసులకు యిప్పుడు తెలిసింది కాబోలు. ఆమె నా యింటికి రావడం ఎవరో చూసి వుంటారు. అందుకే సరోజ గురించి నన్ను అడుగుతున్నాడు.

సరోజకు, నాకు గల స్నేహం గురించి రాజన్‌కి వివరించాను. ఆ తరువాత వారం రోజులక్రితం జరిగినదానిని గురించి చెప్పడం మొదలుపెట్టాను.

"క్రిందటివారం సరోజ మా యింటికి వచ్చింది. తనని తన భర్త సరిగా ఆదరించడంలేదని చెప్పింది. నా సహాయం కోరింది. కానీ, నేను తిరస్కరించాను. దానితో ఆమె కోపగించి, నన్ను విపరీతంగా తిట్టి, విసురుగా వెళ్ళిపోయింది. ఇంతకూ ఏం జరిగింది?" అమాయకంగా ప్రశ్నించాను.

ఆమె కనిపించడం లేదన్న విషయం చెప్పాడు.

నేను ఆశ్చర్యం నటించాను.

మరికొన్ని ప్రశ్నలడిగాడు రాజన్. తడబాటులేకుండా అన్ని ప్రశ్నలకూ జవాబు ఇచ్చాను. నా యిల్లంతా తిరిగి చూశాడు. కోళ్ళఫారం కూడా పూర్తిగా తిరిగి చూశాడు. పాపం ఏమీ చేయలేక శలవు తీసుకుని నిష్క్రమించాడు.

నేను మామూలుగా రోజూ కోళ్ళఫారంలోకి వెళ్ళి నా పనులు పూర్తి చేసుకుంటున్నాను.

కానీ నా చుట్టూ పోలీసు నిఘా ఎక్కువైందన్న సంగతి తెలుస్తూనే ఉంది. రోజూ మెయిన్‌రోడ్ మీద బీట్‌చూసే కాన్‌స్టేబుల్, ప్రత్యేకించి నా యింటి ముందుండి ఫారం ముందునుండి రోజుకి మూడు, నాలుగుసార్లయినా తిరుగుతున్నాడు.

లన్నింటినీ మరో యంత్రంలో వేపి పొడి పొడిగా చేశాను. సరోజ మాంసపుముక్క లన్నింటినీ కోళ్ళకు రోజూ పెట్టే మాంసంలో కలిపి పెట్టేశాను. ఎముకల పొడిని ఫారం నిండా చల్లేశాను. ఇసుకలో కలిసిపోయింది.

సరోజ కట్టుకున్న చీర, బూడిదగా మారిపోయింది. ధూళిలో కలిసిపోయింది.

సరోజ మాంసం ఎంత రుచిగా ఉందో మరి! కోళ్ళన్నీ ఎంతో ఆత్రంగా తినేశాయి.

సరోజ యిప్పుడు ఎక్కడ ఉందో ఈ పోలీసులు తెలుసుకోగలరా? నిజానికి నాకూ తెలీదు. సరోజ ఎక్కడ ఉంది? కోళ్ళ జీర్ణాశయంలో ఉందా? అవి పెట్టిన గ్రుడ్లలో ఉందా? ఆ గ్రుడ్ల నన్నింటినీ ఊరి జనంతోపాటు తిన్న పోలీసుల శరీరంలోనే ఉందా?—ఏమో, ఎక్కడ ఉందో!

—పి. శ్రీధర్, విజయవాడ.

## తాగిన వాసన?

మళ్ళీ మీరు తాగొచ్చారు. బాగా వాసనొస్తుంది - ఔనా?" నిలేసింది భార్య, భర్తని తలుపుదగ్గరే!

"అ....వు....ను" నసిగాడు భర్త. "కాని మా ఆఫీసులో పనిచేసే శర్మని ఇదే విషయం అడిగితే 'అబ్బే అలాంటిదేమీ లేదు' అన్నాడే?" సందేహం వెలిబుచ్చాడు భర్త.

"ఐతే - అతగాడు కూడా ఆ సమయంలో తాగే ఉంటాడులెండి" అంది భార్య నిశ్చయంగా.

—వేదాంతం జగన్నాధం, హన్మకొండ.

ఓ రోజు ప్రొద్దున్నే బస్సు ఎక్కి హైదరాబాద్ వెళ్ళాను.

మర్నాడు హైదరాబాద్‌నుండి తిరిగి వచ్చేసరికి నా యిల్లంతా చిందరవందరగా వుంది. ఫారంలోకి వెళ్ళి చూశాను. పోలీసుల పయం. పారలు, పలుగులు తీసుకుని మొత్తం తవ్వి పోశారు. సరోజను చంపి ఎక్కడో పాతి పెట్టాననుకున్నారు కాబోలు.

నేను ఫారంలోకి వెళ్ళేసరికి కొంతమంది పోలీసులు కోళ్ళ నన్నింటినీ ఒక మూలకు పెడుతున్నారు. మరికొంత మంది ఆ ప్రదేశంలో రెండు మూడుచోట్ల త్రవ్వడం మొదలు పెట్టారు.

నన్ను చూడగానే రాజన్ ఆశ్చర్యపోయాడు. మిగిలిన పోలీసుల విషయం చెప్పనే అక్కర్లేదు. నేను త్వరగా తిరిగి రాననుకున్నారు కాబోలు.

నేను కొద్దిగా కోపంతో కూడిన విసుగు ప్రదర్శించాను. అందులో కొంత ఆశ్చర్యం కూడా మిళితం చేశాను.

రాజన్ నాకు నచ్చచెప్పడం మొదలుపెట్టాడు.

ఏమైతేనేం మొత్తం అంతా త్రవ్విపోశారు. బావిలోకి కూడా ఒకళ్ళిద్దరు దిగి చూసి వచ్చారు. ఎక్కడా ఏమీ కనిపించకపోయేసరికి తమ పరిశోధన విరమించుకున్నారు.

పిచ్చివాళ్ళు! వాళ్ళకు అంత తేలికగా దొరికిపోవడానికి నే నేమన్నా అమాయకుడినా! సరోజ శవాన్ని నా కోళ్ళన్నీ ఎప్పుడో శుభ్రంగా భోజనం చేశాయి. అంటే పొడుచుకు తిన్నాయని కాదు అంతటి ఘోర కృత్యానికి నేను ఒడి కట్టలేను.

నా ఫారంలో మాంసాన్ని ముక్కలుగా తరిగే యంత్రంలో సరోజ శవాన్ని ముక్కలుగా చేశాను. ఎముక

